

# ప్రసవానంతరము తల్లులు ఎదుర్కొనే ప్రధాన సమస్య జుట్టు రాలిపోవడం!

## దీనికి ఏకైక పరిష్కారం

# అశ్విని

## హెయిర్ ఆయిల్




పాలిచ్చే తల్లుల్లో విపరీతంగా జుట్టు రాలిపోతుంటుంది. సాధారణంగా స్త్రీలు బలహీనంగా ఉండే ఈ దశలో సాధారణ తలనూనెలు ఎందుకు పనికి వస్తాయి? సమస్యను ఎంతవరకు నియంత్రించగలుగుతాయి? ఇక్కడే మాతృమూర్తులందరికీ కావాలి, **అశ్విని హెయిర్ ఆయిల్** అందించే సంపూర్ణ సంరక్షణ.

ప్రత్యేక ఫార్ములాతో తయారైన **అశ్విని హెయిర్ ఆయిల్** ఈ సమస్యకు పరిష్కారాన్నిస్తుంది. ఇది మాత్రమే జుట్టురాలిపోవడాన్ని అరికట్టి, జుట్టును బాగా పెంచుతుంది. వేలాది మంది బాలింతలైన తల్లులు **అశ్విని హెయిర్ ఆయిల్** ను వాడిన తరువాత జుట్టు రాలడం ఆగిపోవడం, జుట్టు బాగా పెరగడం గమనించారు. అలా వారి సమస్యను పరిష్కరించుకొన్నారు. పుట్టిన బిడ్డలకు (శిశువులకు) కూడా **అశ్విని హెయిర్ ఆయిల్** మంచి ఫలితాలను ఇచ్చింది. కాబట్టి నేడే (మళ్లీ) **అశ్విని హెయిర్ ఆయిల్** ను మొదలు పెట్టండి. మీ శిశువులకు కూడా ఇదే తైలాన్ని వాడి మంచి ఫలితాల్ని పొందండి. వాడిన తరువాత మీ అనుభవాల్ని మాకు వ్రాయండి.

నేను షుమారు 6 సంవత్సరముల నుంచి అశ్విని హెయిర్ ఆయిల్ వాడుతున్నాను. నాకు ఇద్దరు బిడ్డలు పుట్టారు. మామూలుగా బిడ్డలు పుట్టిన టైమ్‌లో జుట్టు ఊడుతుంది అని చెప్పారు. కాని నాకు మాత్రం జుట్టు ఎప్పుడూ ఊడలేదు. ఇంకా జుట్టు బాగా పెరిగింది. మా పిల్లలకి కూడా అశ్వినినే వాడుతున్నాను. కాబట్టి పాలిచ్చే తల్లులకు, బిడ్డలకు అశ్విని హెయిర్ ఆయిల్ బాగా సహాయపడగలదని చెప్పగలుగుతున్నాను.

ఇట్లు
బి. భాగ్యలక్ష్మి

C/o బి.జ్ఞానేశ్వర్
1- 5- 38/ 18, ఫైవ్ బిల్డింగ్ కాంప్లెక్సు,
మారుతీ నగర్, కొత్తపేట, హైదరాబాదు-12

- రాలే జుట్టును అరికడుతుంది.
- జుట్టు పెరిగేందుకు సహకరిస్తుంది.
- తలనొప్పిని తగ్గిస్తుంది.
- చుండ్రును నివారిస్తుంది.
- మెదడును చల్లబరుస్తుంది.
- చిన్న వయస్సులో జుట్టు తెల్లబడటాన్ని అరికడుతుంది.

**అశ్విని** హోమియో హెయిర్ ఆయిల్

అశ్విని హోమియో అండ్ ఆయుర్వేదిక్ ప్రాడక్ట్స్ లిమిటెడ్, మూసాపేట, హైదరాబాదు 18 ఫోన్: 3703607, www.aswini.com.

# ఇదీ సంగతులు

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం



'సెంటర్‌స్ప్రెడ్'లో
సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'బాబా'
'హోలీ'
సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో





అనుబంధంగా ముకేష్, భువనచంద్ర, ఆదినారాయణరావు, కళ్యాణ్‌జీ, రావుబాలసరస్వతి, శ్రావణమాస గీతాలు...57, 44,54,61,74,42 పేజీలలో

ముఖచిత్రం:'ఇంద్ర' సినిమాలో ఆర్తీ అగర్వాల్




ఐదు నెలల క్రితం "ఈనాడు"లో మీ పత్రిక ప్రకటన చూచిన మొదలు వదలకుండా పత్రిక చదువుతున్నాం. మా ఇంట్లో అందరికి నచ్చిన పత్రిక ఇది. మీ పత్రికలో గతంలోని సినీ ప్రముఖుల గురించి, ఆనాటి మరపురాని మధురగీతాల గురించి చదువుతుంటే నాకు చెప్పలేని ఆనందంగా వుంది. 'ఆపాత (ట) మధురం'లో గీతాలు చూచి ప్రతిపాటను పాడుకుంటాను. కొన్ని నేను చూచిన కొన్ని, చూడని చిత్రాల్లోనివి. హిందీ చిత్రాలలోని పాటలు, ఆ రంగ ప్రముఖుల గురించి ప్రచురిస్తున్నందుకు మీకు ప్రత్యేక వందనాలు. మీ(మా) పత్రిక గురించి నా ఆనందం మాటల్లో చెప్పలేనిది.

- చెరుకూరి సర్వేశ్వరరావు, బూరుగుపూడి

'హాసం' బృందానికి శుభాభినందనలు

"హాసం" నిర్వహించే వారందరూ బాధ్యత వహిస్తూ సర్వజనామోదంగా సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దుతున్నారు. ఇక నా విన్నపమేమంటే 'అర్థంచేసుకుందాం ఆస్వాదిద్దాంలో' 'నామ్' హిందీ చిత్రంలోని 'చిఠ్ఠీ ఆయీహై' అన్న పాటని విశ్లేషిస్తారని ఆశిస్తున్నాను. గుండెలు తడిపే పాటల్లో అదొకటి.

-వెంకటరమణయ్య, కడప

"హాసం" పత్రికలో మీరు ప్రచురిస్తున్న కామెడీ సీరియల్స్, కథలు వేటికవే సాటి. అలాగే ఘంటసాల గారి గురించిన వివరాలు సీరియల్‌గా అందిస్తున్నందుకు అభినందనీయులు. ఇంకా ప్రతి సంచికలో సినిమా పాటలతో వస్తున్న 'హాసం'కు థ్యాంక్స్.

-వర్రె సతీష్‌బాబు, ఉయ్యూరు

మీ "హాసం" పత్రిక చాల బాగుంది. కొన్ని సంవత్సరాలుగా వార్తా పత్రికలు చదవడం మాని వేసిన మాకు మీ పత్రికతో మళ్లీ చదవడం ప్రారంభించడం సంతోషం కలుగుతోంది. హిందీలో కనీసం రెండు పాటలు పాత/కొత్త కలయికలతో ఇవ్వగలరు. దయచేసి పాటలలో పొరపాట్లు రానివ్వకండి. ఎందుకంటే మేము పాటలు ఫైల్ చేసుకుంటున్నాము.

-టి. వెంకటేష్, సనత్‌నగర్, హైదరాబాద్

ఏ పత్రికలు అంతగా చదవడం ఆసక్తిలేని నాకు తమరు ప్రచురిస్తున్న "హాసం" హాస్య సంగీత పక్షపత్రిక ఎంతగానో ఆకర్షించింది. ప్రధాన కారణం కేవలం సినీ విషయాలనేగాక, సంగీతానికి సంబంధించి అనేక విషయాలను ఆయా పాటలు ఏయే రాగాలలో ఎవరెవరు కూర్చారో తెలుపుతూ పాటలను కూడా ప్రచురించడం ఎంతైనా హర్షణీయం. ఎన్నెన్నో గత స్మృతులను నేటి తరానికి తమ పత్రిక ద్వారా అందిస్తున్నందులకు సదా కృతజ్ఞతలు.

-కేమా చెంచయ్య, రేపల్లె

నేను మీ పత్రిక 12వ సంచిక నుండి చూడటం తటస్థించింది. నేను ముందు వచ్చిన 11 సంచికలు వెంటనే తెప్పించుకొని చదివాను. ఆర్టికల్స్ చాలా బాగున్నవి. ఈ టి.వి./నెట్ యుగంలో ఈ ప్రయోగం సాహసమే. పత్రిక చదువుతూ ఉంటే మరల పాత సినిమాలను చూస్తున్నంత ఆనందం కలిగింది.

ఎందరో సినీ, సంగీత ప్రముఖుల అనుభవాలు, వారి వివరాలు అన్ని కలిపి ఒకేసారి చదువుతుంటే మృష్టాన్న భోజనం తిన్నట్టున్నది.

-యకమా నాగేశ్వరరావు వర్మ, గుంటూరు

లోకం విషవాయువులతో నిండే సమయంలో ఒకే ఒక్క శీతల పవనం వీచినట్లుగా ఉద్భవించిన "హాసం" పత్రికకు నా ధన్యవాదాలు. ఈ మధ్య మీరు విడుదల చేసిన హాసంలో 'జయం' పాటలు చదివి, ఆ పాటలు విన్న తరువాత యువత లక్ష్యం ప్రేమ కంటే దేశం అయితే బావుంటుందన్న నా స్వీయ అభిప్రాయంతో ఎంతో ఉద్రిక్త భరిత పద్యాన్ని దేశరక్షణ'కు అన్వయించి వ్రాశాను. దీనిని మా పాఠశాల విద్యార్థుల చేత ఆగస్టు 15వ తేదీన పాడిస్తున్నాము. దానిని మీ ద్వారా చాలా మంది యువత చదివి, నేర్చుకుని, ఆచరించాలని నా ఆకాంక్ష.

-రామకృష్ణానంద్, నూజివీడు

మీరీ గేయాన్ని ఒక నెల ముందు పంపి ఉంటే ఆగష్టు 1-15 సంచికలో వచ్చి ఉండేది. ఆ తర్వాత వచ్చే సంచికలో అంటే ఈ సంచికలోనే - ఇది మార్కెట్‌లోకి వచ్చేసరికి జండా పండగ అయిపోయినా సరే - మీ స్ఫూర్తిని గమనించి ప్రచురిస్తున్నాం.

-ఎడిటర్

మీ 1-15 ఆగష్టు సంచిక చదివాను. ఒక వినూత్నమైన, అర్థవంతమైన, ఉపకరించే పత్రిక చదువుతున్నానన్న భావన కలిగింది. చాలా సంతోషం. 'జయం మనదే' చిత్రంలోని పాటల సంగీత, సాహిత్యాల సౌరభాన్ని తెలియజేస్తూ "నిజంగా సంగీత సాహిత్యాలు తరించిన రోజులవి. అంతరించిన రోజులివి".

ఇవి నూటికి నూరుపాళ్లూ అక్షర సత్యాలు. ఆ వాక్యాలు చదువుతుంటే ఒళ్లు గగుర్పొడిచింది. తెలుగుబాణీ వినిపించని నేటి సంగీతమూ, మాటకూ - మాటకూ పొంతనలేని నేటి సినీ సాహిత్యమూ మనం ఎంత దౌర్భాగ్యపు స్థితికి దిగజారామో తెలియ జేస్తున్నాయి. మీ పత్రికలోని 'ఆర్టికల్స్' అన్నీ బాగుంటున్నాయి - కంగ్రాట్స్.

-చక్రవర్తి, మౌలాలి, హైదరాబాదు

'హాసం' 1-15 ఆగష్టు సంచికలో 'మా మామయ్య ఘంటసాల కథ'ని శ్రీమతి సావిత్రి గారు చక్కగా వివరిస్తున్నారు. పాఠకులకి అర్థమయ్యే విధంగా సరళ భాషలోరాస్తున్నారు. 'ఇది నాగోడు - ఇట్లు మీ రేలంగోడు'లో రేలంగి చక్కని విషయాల్ని తెలియజేశారు. అటువంటి వ్యక్తి ఈ భువిలో జన్మించడు. నేటి 'హాస్యం' అపహాస్యం పాలవుతున్న రోజుల్లో ఆయన లేకపోవడం ఆయన అదృష్టం. ఈసారి 'హాసం' ముఖచిత్రం ఎంతో బాగుంది. కీపిటప్!

-ముసునూరి రామచంద్రమూర్తి, విజయవాడ-3

పినాకపాణి గారి మీద వ్యాసం ఎంతో బాగుంది. ఆయన 85 మేళకర్త రాగాలలో ఆల్బమ్ (14 కాసెట్స్) రిలీజ్ చేశారన్నారు. వ్యాసాల్లో పుస్తకాల, కాసెట్స్ ప్రస్తావన వచ్చినప్పుడు అవి ఎక్కడ దొరుకుతాయో రాస్తే ఎంతో మేలు చేసిన వారవుతారు.

-యు.రవీంద్రరావు, శింగరాయకొండ

సంపుటి :1 సంచిక: 22

**16- 31 ఆగస్టు 2002**

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 22


మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82


"మురగ పెట్టుకున్న పాలు విరుగునన్నాడోయ్, పంచుకున్న పాలు మంచి పెంచునన్నాడోయ్" అన్నారు ఆరుద్ర. ఆస్తిపాస్తుల విషయం మాట ఎలాగున్నా అనుభూతుల సంగతికొస్తే మాత్రం పంచుకోవడం వల్ల బహులాభాలున్నాయన్నారు పెద్దలు. పంచుకుంటే సంతోషం రెట్టింపవుతుంది, దుఃఖం సగమౌతుంది. కళల విషయానికొస్తే మనలో కలిగిన స్పందనను ఇంకోడికి చెప్పుకో బుద్ధేస్తుంది.

'కళ సామూహిక కల' అన్నాడు ఫ్రాయిడ్. సినిమా థియేటర్లో - అపరిచితులైనా - వందలాది సహ ప్రేక్షకుల మధ్య కూచుని చూడడం ఒక అనుభవంగా మిగులుతుంది. అనుభూతి వైయక్తికం అని ఒప్పుకుంటూనే సమూహంతో ఎంజాయ్ చేసే వాస్తవాన్ని కూడా మనం ఒప్పుకుని తీరాలి. మొన్న ఫుట్‌బాల్ సీరీస్ జరిగేటప్పుడు కేరళలో కొన్ని సినిమాహాళ్లు వాటిని సినిమా తెరమీద చూపించి హౌస్‌ఫుల్స్ చేయించుకున్నారు. గతంలో క్రికెట్ సీరీస్ చూపించినప్పుడు కొన్ని బార్‌లు, రెస్టారెంట్‌లు టీవీల్లోనే చూపించారు. ఇంట్లో హాయిగా కాళ్లు జాపుకుని టీవీలో చూడగలిగిన అవకాశం ఉన్నా ప్రజలు అటువంటి చోట్లకు వెళ్లి, ఎంతో ఖర్చు పెట్టి మరీ చూశారు.

అంటే కష్టపడుతున్నా, నష్టపోతున్నా కూడా ఇచ్చి పుచ్చుకోవడంలో ఉన్న హాయి వేరేచ్చటా లేదన్నమాట! మన దగ్గిర ఏదైనా అరుదైన వస్తువు సమకూరినప్పుడు దాన్ని ఆత్మీయులకు - లైక్‌మైండెడ్ అని తెలిస్తే చాలు, కట్టుకున్నవాళ్లో, కన్నవాళ్లో కానక్కరలేదు - చూపించి, వాళ్లు సంతోషిస్తే మనం ఇంకా సంతోషిస్తాం.

మనకు నచ్చినవాటిని స్వంతం చేసుకుందామనే దశలో స్వార్థం బాగా పని చేస్తుంది. అరుదైన పుస్తకమో, ఫోటోనో ఒకే కాపీ కంటబడ్డప్పుడు పక్కనున్న అతి సన్నిహితుడైన మిత్రుణ్ణి కూడా "నువ్వేమీ అనుకోకు. ఈసారి మళ్లీ వెతికి నీకు ఇంకోటి కొనిపెడతాను" అంటూ దాన్ని స్వంతం చేసుకుంటాం. అయితే కొన్నాళ్ళు గడిచేసరికి, 'మనవద్దే ఉంటే ఏం లాభం? పదిమందికి దాని ప్రతిభ చాటిచెప్పాలి గానీ' అనిపిస్తుంది. 'అభినివేశం లేని వారసులకు అప్పగించేబదులు జనసామాన్యానికి అందించి సాంస్కృతికంగా వారి ఎదుగుదలకు దోహద పడవచ్చుగా! మనలాటి ఇష్టాయిష్టాలు ఉన్న వ్యక్తిని మనం చూడకపోయినా, మనకు పరాయివాడు కాదుగా!' అనిపిస్తుంది.

ఈ దృక్పథంతోనే ఎందరో మహానుభావులు జీవితాంతం కష్టపడి సేకరించిన కళాసంపదను లైబ్రరీలకు, ఆర్టు గ్యాలరీలకు, మ్యూజియంలకు ఇచ్చివేయడం జరుగుతుంది. అయితే ఇవాళ గ్రంథాలయాలకు వెళ్లడం, రోజుల తరబడి ఉద్గ్రంథాలు చదవడం తగ్గిపోయింది. చిన్నచిన్న మోతాదుల్లో దిన, వారపత్రికలు అందిస్తున్నదే ఆస్వాదించే రోజులు వచ్చాయి.

ఈ పరిస్థితిని గమనించే కాబోలు తమ సేకరణను పదిమందితో పంచుకునే ఉద్దేశ్యం ఉన్న అభిమానులు కొందరు "హాసం" పత్రికను అందుకు వేదికగా ఉపయోగించుకుంటున్నారు. "మా వద్ద ఇదిగో ఈ పాటల పుస్తకం ఉంది". "1950ల నాటి ఈ ప్రత్యేక సంచిక ఉంది", "ఈ అరుదైన ఫోటో మీ దగ్గర ఉందో, లేదో తీసుకోండి". "మీ ఆర్కైవ్స్‌లో పెట్టుకోండి. ఎప్పటికైనా పనికి వస్తుంది. మీ ద్వారా అందరికీ అందుతుందని మా నమ్మకం" అంటూ వారి ఖర్చులతో మాకు పంపిస్తున్నారు. వచ్చి స్వయంగా ఇస్తున్నారు. తక్కిన పత్రికలకు ఇలా ఇచ్చే సంఘటనలు మా ఎరికలో లేవు. "హాసం"ను ఒక పత్రికగా కాక, ఒక ఉద్యమంలా భావించి వారందరూ కురిపించే ఆదరాభిమానాలకు ఎలా స్పందించాలో కూడా తెలియక తబ్బిబ్బివుతున్నాం. వారి నమ్మకాన్ని వమ్ము చేయకుండా మెలగాలని మరింత కృతనిశ్చయులవుతున్నాం.



అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన
శైలిలో తెలిపే

## క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

-ఆచార్య తిరుమల

## వస్త్ర సాహిత్యంలో చమత్కారాలు

వస్త్ర ప్రపంచంలోలా వస్త్ర సాహిత్యంలో కూడా ఎన్నెన్నో ఆకర్షణీయమైన చమత్కార విశేషాలున్నాయి. వేష భాషల్లో వేషం నాగరికతకు సంబంధించింది కాగా భాష సంస్కృతికి సంబంధించింది. అలాగే వేషం బాహ్యజీవిత విధానానికి చెందింది కాగా భాష ఆంతరంగిక ప్రకృతికి సంబంధించింది. ఒకడు ఎన్నెన్ని వేషాలైనా వేయవచ్చును గానీ ఎన్నెన్నో భాషల్ని మాత్రం మాట్లాడలేడు. ఎందుకంటె భాషకి అభ్యాసం కావాలి, వేషానికి అనుకరణ కావాలి. వాక్కు భాషకి మూలాధారమైనట్లు వస్త్రం వేషానికి ప్రధానం. కట్టుగుడ్డలేని నిరుపేద భాషాపరంగా మహాపండితుడు కావచ్చునేమో కానీ ఎంత గొప్పవాడైనా కట్టుబట్ట విలువైనది గాక తగిన గుర్తింపుని, గౌరవాన్ని పొందలేడు. ఈ విషయాన్నొక పూర్వకవి పౌరాణికంగా కూడా ఋజువు చేశాడు. అతడి చమత్కారం చూడండి:-

**కిం వాససైవం న విచారణీయం**
**వాసః ప్రధానం ఖలు యోగ్యతాయాః**
**పీతాంబరం వీక్ష్య దదౌ తనూజం**
**దిగంబరం వీక్ష్య విషం సముద్రః!!**

అంటే- వస్త్రమే యోగ్యతకి ప్రధానం. సముద్రుడంతటి వాడే పీతాంబరం కట్టుకున్న విష్ణువుకి కూతురైన లక్ష్మినిచ్చి, దిగంబరుడైన శివుడికి విషమిచ్చాడు కదా! అన్నాడు. క్షీరసాగర మథన సందర్భం నుండి కవి యీ చమత్కారాన్ని సాధించాడు. ఈ చమత్కారాన్ని మరికాస్త సాగదీసి ఉండేల మాలకొండా రెడ్డిగారు తమ 'మడివేలు' కవితలో ఇలా అన్నారు:-

**పీతాంబరుని బిల్చి పిల్లనిచ్చిన మామ**
**గజ చర్మ ధారికి గరళ మిచ్చె**
**దొర వేషమునకు విందుల నొసంగు గేస్తు**
**చింపి గుడ్డల వాని సీత్కరించె**
**అద్దె గుడ్డల వాని కర్థాసనం బిచ్చె**
**కౌపీన ధారిని కసరి కొట్టె**
**జలతారు ముసుగున్న శిలను దైవమ్మనె**
**త్రోవ కడ్డంబైన తొలగదన్నె**
**వలువలను బట్టి లోకాన విలువ హెచ్చు**
**వలువలకు విల్వ హెచ్చు నీ చలువ వలన**
**అట్టి నీ చేతి చలువ మహత్వ మెరుగు**
**ఘనులకే గదా నేడు సత్కార సభలు!!**

ఈ పద్యంలోని చమత్కార గర్భితమైన పరమ సత్యాన్ని ఎవరూ కాదనలేరు. లోకంలో వలువల్ని బట్టి విలువలుంటే, మడివేలు చలువ వల్ల వలువలకి విలువ హెచ్చుతుందని ఉండేల వారంటే-పూర్వకవి ఒకడు మరోలా చమత్కరించాడు. దేవుళ్లకి, దేవతలకి నాలు బట్టలు లేవా? పీతాంబరమో, శుక్లాంబరమో రెండే బట్టలా? ఎందుకిలా వుంటారంటే. యీ విధంగా సమాధానం చెప్పాడా కవి:

**చాకివాని తోడ జగడాలు పడలేక**
**సిరిగలాడు పట్టు చీర గట్టె**
**శివుడు తోలు గట్టె 'సీ'యని మదిరోసి**
**బైరవుండు చీర పారవేసె!!**

రజకునితో పోట్లాట పెట్టుకోలేక వస్త్రధారణలో దేవతలలా వుంటారట. తప్పంతా రజకుని మీద నెట్టేశాడు కానీ రజకుడెంత గొప్పవాడో ఉండేల వారే చెప్పారు. అలాంటి పద్యం తెలుగు సాహిత్యంలో ఎక్కడా కనిపించదు. అంతగొప్ప పద్యమది. ఆ పద్యం చూడండి:-



**నీరదావృతమైన నీలాంబరమ్మును**
**కౌముదీ జలముతో కడుగు నెవడు**
**చంద్రికా సరసిలో శరదభ్ర శకలములే**
**పిండి, గాలికి ఆరవేయునెవడు**
**దెసమొలతో నున్న తీవపూబోండ్లకు**
**చిగురు చీరల నందజేయునెవడు**
**భూదేవి పదముల పొరలాడు కడలేని**
**కడలి కుచ్చెళ్లను మడచునెవడు**
**యుగ యుగమ్ముల నొక్క మారుదయమంది**
**కలుష హృదయాల నమృతాన కడుగు నెవడు**
**విశ్వకర్త అతండు నీ వృత్తివాడు**
**ఇంత గౌరవ భాగ్యమింకెవరి కబ్బు!!**

రజకునికి విశ్వకర్త స్థానాన్నిచ్చి గౌరవించిన ఉండేల వారి విశాల హృదయానికి జోహార్లు. మురికి వొదిలించి బట్టల్ని రంజింపజేయటం వల్ల మడివేలు రంజకుడై, రజకుడయ్యాడు. ఆ మాలిన్య ప్రక్షాళనా సామర్థ్యం వల్లనేనేమో నారద మహర్షిని రజకుడని చెప్తారు.

శ్రీరాముని ధర్మనిష్ఠనే నిలదీసి ప్రశ్నించిన ధీరుడు రజకుడు. అతని జీవితం ఇతివృత్తంగా "చాకిరేవు" అనే కావ్యాన్ని రచించి ఊట్ల కొండయ్య గారు పేరు కెక్కారు.

విలువలకి వలువలకి వున్న సంబంధాన్ని దృష్టిలో పెట్టుకుని మాట్లాడ వలసి వస్తే 'భారత కోకిల' సరోజినీ నాయుడు సమాధానాని కెంతో ప్రాధాన్యముంది. "ఈ ప్రపంచంలోని యిన్ని చెట్లల్లో మీకు ఏ చెట్టంటే యిష్ట"మని సరోజినీ దేవిని అడిగితే ఆమె తడుము కోకుండా "పత్తి చెట్టు" అని చెప్పింది. ఎందుకుటంటే మానాన్ని కాపాడేది పత్తి చెట్టు ఒక్కటేనట! వలువల గొప్పదనానికి యింతకంటె విలువైన మాట దొరుకుతుందా!?!

వస్త్రధారణకు సంబంధించిన కొన్ని జోక్సుతో యీ వ్యాసం ముగిస్తాను.

ఆచార్య యస్వీ జోగారావు గారి "అపూర్వ కాకలి" చాటు పద్య కావ్యంలోంచి ఒక పద్యం:

**తదజ్ఞ! కొంగలు సర్వసాధారణముగ**
**తెల్లగానుండు నేలకో? తెలియజెపుడు**
**-అవ్వి పూర్వ జన్మమున బ్రాహ్మణ వితంతు**
**వులయి యుండనోపును సుమా పలితకేశ!**

సాధారణంగా కొంగలు తెల్లగా వుండటానికి కారణం అవి పూర్వ జన్మలో తెల్లముసుగులు వేసుకున్న బ్రాహ్మణ వితంతువులేమోనట! కొంగల్ని చూసినప్పుడీ పద్యం గుర్తుకొచ్చి నవ్వు రాక మానదు.

బండ మీద బట్టలుతికే ఒక రజకుని చూపించి మార్క్‌ట్వెయిన్ అనే హాస్య రచయిత -- "ఏమిటండీ అది! అతడు గుడ్డ ముక్కతో బండను బద్దలు చేయాలని చూస్తున్నాడు" అన్నాడట. సామాన్య విషయం నుండి పిండిన యీ హాస్యానికి ఎవరు పొంగిపోరు చెప్పండి.

'ధ్వన్యనుకరణ సమ్రాట్' నేరెళ్ల వేణుమాధవ్ గారు వ్యాకరణాంశంతో ఈ జోక్ చెప్పి సభను నవ్విస్తుంటారు. తెలుగు టీచరు ఏకవచన, బహువచనాల్ని గురించి పాఠం చెప్పి - ఓ కుర్రాణ్ని "నిక్కరు ఏ వచన"మని అడిగితే వాడు కొంచెం సేపు ఆలోచించి - "పైన ఏకవచనం, కింద బహువచనం సార్" అన్నాడట. ఆయన హాస్య సృజన కెవరు పులకించరు చెప్పండి!



నేను ఎం.ఏ. చదువు తున్నప్పుడు నాకో శిష్యుడి లాంటి స్నేహితుడుండే వాడు. వాడెప్పుడూ కవిత్వం జోలికి పోయినవాడు కాదుగానీ ఆధునిక కవిత్వాన్ని గూర్చి చెప్పి ఆటలు పట్టిస్తూ వుండే వాడు. అతగా డొకనాడు రాత్రి నా రూంకి వచ్చి "గురువు గారూ! నేనో కవిత రాశాను. రెండు లైన్లే. దాన్ని మీరు విని నన్ను ఆశీర్వ దించా"లన్నాడు. నేను కొంచెం అనుమానంతో ఆశ్చర్యపోతూనే "ఏదీ చదువు!" అన్నాను. చేతిలో మడుచు కొచ్చిన కాగితాన్ని తీసి కంటికి కాస్తంత దూరంగా పెట్టుకుని గొంతు పెద్దది చేసి "నేనొక లుంగీ కొన్నాను" అని మొదటి పాదం చదివాడు. తర్వాత నాకు అర్థం కాలేదన్నట్టు ఆ వాక్యాన్నే రెండు, మూడు సార్లు బలంగా చదివాడు. నాకు చిరాకేసి 'సరేలే. ఇంతకీ ఏమంటా"'వన్నాను. వాడు వొంగి నవ్వుతూ నాకు నమస్కరిస్తూ - దాన్నిలా పూర్తి చేశాడు.

"నేనొక లుంగీ కొన్నాను.
నేనందులోనే ఉన్నాను"

వాడి కొంటె తనానికి నేను నవ్వాపుకోలేక పోయాను. సభల్లో తమాషాగా నేనీ కవిత వినిపిస్తే శ్రోతలంతా ఘొల్లు మంటూనే ఉంటారు.



సీరియల్

2

# సినీతిచంద్రిక

రావి కొండలరావు



**జరిగిన కథ**

**ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టు బడతాడు. ఒక మాజీ దర్శక నిర్మాత వచ్చి వాళ్లకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగాడు - ముందుగా 'చిత్రలాభము' కథ. "మద్రాసులో నేనుండే రోజుల్లో విశ్వాస్ అనే బొంబాయి అతనూ, నేను హోటల్ కెళ్లి కాఫీ తాగేసి డబ్బుల్లేవని చెప్పి వీధిన పడ్డాం..."**

(ఇక చదవండి)

"బాగానే సినిమా తీశామే" అన్నాను నవ్వుతూ, జేబులో రూపాయి తీసి సిగరెట్టు పెట్టెకని ఇస్తూ.

"లేకపోతే ఎట్లా?" అన్నాడు విశ్వాస్ తనూ డబ్బులు తీసి చేతిలో పోసుకుని ఎగరేస్తూ.

విశ్వాస్ చాలా సరదా ఐనవాడు. "హౌటు టేక్ పిక్చర్?" అని అడిగేవాడు. నేను "మామూలుగా కెమెరాలో ఫిల్ము లోడ్‌చేసి" అనేవాడిని. అతను నవ్వేవాడు. నాలుగు రోజులదాకా నన్ను 'జీ' అనేవాడు. నాలో అప్పుడు హాస్యరసం కూడా మిగతా జఠరరసం ఈ రసం ఆ రసాలతో పాటు ఉండేది. ఇప్పుడు అన్నిరసాలు గోవిందాకొట్టేశాయ్; జఠరరసం మాత్రం ఫ్లడ్స్‌లా ప్రవహిస్తోంది.

అవాళ ఇద్దరం కలిసి సముద్రతీరంలో కూచున్నాము. విశాలమైన సముద్రం, చల్లనిగాలీ. దూరంగా నీట్లో తేల్తున్న తెప్పలూ, మాకు కొద్ది దూరంలో కొత్త దంపతుల జంటా. సుదూరంలో వేరుసెనగకాయలు అమ్మే అబ్బీ, వాడికి గజన్నర దూరంలో మిఠాయి, అంటే పీచుమిఠాయి మనిషీ -- ఎక్కడో కారు హారన్ల మోతలూ --ఇట్లా ఆనందకరంగా వుంది. నాకు ఆలోచన్ల మీద ఆలోచన్లు 'కెరటాల' వలె లేవసాగాయి. సినిమా కథలు అల్లసాగాను. కొంతసేపు పోయాక విశ్వాస్ వెర్రిగా నవ్వి లేచాడు.

"క్యా మా రాజ్!" అన్నాను.

"లేవయ్యా పద పోదాం. సినిమాలేదు. గినిమా లేదు. మనతరం కాదు... లేలే".

"ఇప్పుడు నేను లేవలేను సుమా. కథలు అల్లుకుంటున్నాను".

"ఐతే అట్లాగే అల్లుకుంటూ కూచో!" అని గిరిక్కున తిరిగి పోసాగాడు.

విశ్వాస్ వెళ్ళిపోతే ఎట్లా? బస్సు టిక్కెట్టు ఖర్చు నాకు దండగవదూ!ఆగమని అరిచాను. విశ్వాస్ అట్లా మిడ్‌లోంచి మిడ్ లాంగ్‌లోకి, లాంగ్‌లోకి, లాంగ్‌లోంచి డిస్టెన్ట్‌లోకి పోయి డిసాల్వ్ అయిచక్కాపోయాడు. నేను లేచి పరుగెత్తాను. 'విశ్వాస్' అని అరిచాను. గంభీరమైన సముద్రం 'విశ్వాస్' అని ప్రతిధ్వనించింది! మళ్ళీ అరిచాను. ఇంతలో ఒకతను 'యారు?' అన్నాడు.

"విశ్వాస్".

"ఎంద విశ్వాస్?"

"నా బొంద విశ్వాస్. వస్తా" అని వెళ్ళిపోయి బస్సుస్టాండులో వెతికాను. ఎక్కడా అతను కనిపించలేదు. ఏమైపోయాడో నా కర్థం కాలేదు. విశ్వాస్ లేకుండా నేనెట్లా సినిమా తియ్యను?.

'నా విశ్వాస్' అనుకుంటూ బస్సెక్కి గది చేరాను.

ఆ గదిలో ఇంకో పదిమంది ఉండేవాళ్లు. అంటే వున్నవాడు ఒక్కడే. కాని పదిమంది పెట్టు. ఒక్క కంఠంతో పదిరకాలుగా మాట్లాడేవాడు. పదిమందితో పందెం వేసి ఆ ఒక్కడే అందరికంటే ఎక్కువగా గోలచేసి గెలిచేవాడు. అతను హాస్యగాడు. సినిమాలో హాస్యవేషాలు గాని, హీరోలుగాని వేద్దామని అనుకునేవాడు. 'నేను తీస్తే



నీకిస్తాను' అనేవాడిని. అందుకని నన్ను తొందరగా సినిమా తియ్యమనే వాడు. లేకపోతే తనకు ఇబ్బందిగా ఉందట! అతను



తమిళుడు. కాని, ఆంధ్రదేశంలో చాలాకాలం ఉండటం వల్ల తెలుగువాడల్లేనే ఐపోయినాడు. నేను వెళ్లేసరికి ముఖం నిండా రంగు పూసుకుని, మీసాలు అంటించుకుని విరిగిపోయిన అద్దం ముక్కలో చూసుకుంటూ యాక్టు చేసేస్తున్నాడు.

"కట్" అన్నాను నేను వెళుతూనే.

"రీ టేక్" అని తిరిగి ప్రారంభించబోయాడు.

"డోంటాక్, అయామ్ టైర్డ్"

''దెన్ రిటైర్!'' అని తన సొద మొదలెట్టబోయాడు.

"ఆపవయ్యా యాక్షను" అని అరిచాను.

"మరెట్టాగయ్యా మహాశయ్యా! నువ్వేమో సినిమాతియ్యవు. తియ్యకపోతే మనకు వేరే పనిలేదు. ఈ విధంగా నేనే యాక్టు చేసుకుంటూ, దాంతోపాటే నా యాక్టింగు బొమ్మను తెరపై చూపినట్టుగా -- వెంటనే చూసుకునే పద్ధతిని కనిపెట్టాను. కావాలంటే ఎక్కడన్నా ఏరుకుని నువ్వూ అద్దం ముక్కోటి తెచ్చుకో. ఇంకా కావాలంటే అందులో చూసుకుని. కట్ చెప్పు" అన్నాడు.

"హాస్యం కాదబ్బాయ్. విశ్వాస్ కనిపించడం లేదు" అన్నాడు.

"విశ్వాస్! విశ్వాస్! కనిపించడం లేదు! ఏమైపోయాడు? మూడింటికి చూశానుగా, నన్నే అణో అర్ధణో ఇమ్మంటున్నప్పుడు".

"అప్పుడు కాదు. ఇప్పుడు".

"ఐతే వాళ్ళ ఊరెల్లి పోయుంటాడు. ఇక్కడ సినిమా తియ్యటం కాదనీ, అక్కడైతే అవుతుందని అన్నాళ్ళే."

ఇట్లా ఏదో మాట్లాడుకున్నాం. ఆ మర్నాడు... ఆ మర్నాడు కూడా చూశాను. విశ్వాస్ కనిపించ లేదు. నాకు ప్రపంచం అంతా గుండ్రంగా తిరగటం వృథా అనిపించింది. ఆగిపోతే బావుణ్ణు అనిపించింది. మూడు రోజులు గడిచాయి. గదిలో ఆకలితో నాలుగు గ్లాసుల నీళ్ళుమింగి చాపగుడ్డ మీద పొర్లుతున్నాను. బయట విశ్వాస్ గొంతు:

''లేవోయ్ నా సామీ, మహాశయా, ఉలో'' అన్నాడు.

"ఏమై పోయావు జీ, ఏమైపోయావు! నీకోసం ఎన్నెన్ని చోట్లలో.. ఎన్నెన్ని..."

''ఆల్‌రైట్ ఒప్పుకున్నాం. నేను కనిపించలేదంటే, దానికి ఏదో కారణం ఉంటుంది. ఆ మాత్రం ఊహించుకోలేక పోయావ్!"

"ఏం జరిగింది?" అన్నాను నేను ఆత్రుతగా.

"చెబుతా పద. బీచికి పోదాం పట్టు" అన్నాడు.

'బీచికి' అనగానే నాగుండె ఝల్లుమంది.

"అక్కడికి రాను. అయినా ఈ ఎండలో బీచికన్నా పార్కే బెటరు".

ఇద్దరమూ పార్కులో కూచున్నాము. విశ్వాస్ పెద్దరకం సిగరెట్టు కాలుస్తూ చెప్పసాగాడు.

2

"కోటలో పాగావేశాం బ్రదర్ "నీకేం భయంలేదు - అంతా నేనే చేసేట్టూ, పేరు నీపేరు వేసేట్టూ మాట్లాడివచ్చాను. వాడికి... ఏం లేదులే. హీరోయిన్ వేసే అమ్మాయితో మాట్లాడనిస్తే చాలుట".

నాకు కోపం వచ్చింది.

"నా పేరూ నీచేతా ఎందుకూ? బోడి మేళం?" అన్నాను.

"ఏదో ఒకటయ్యా - వాడికి నా మీద గురి. నాకు నీమీద గురి. ఏం ఫరవాలేదు. వాడు తీస్తాడు. వట్టి ఆడపిచ్చివాడు. హీరోయిన్ కార్లో కూచోనివ్వాలట - అన్నీ యిటు వంటి కోర్కెలే కోరాడు. అన్నిటికి యస్ అన్నాను.

"నో" అన్నాను నేను. "ఏమంటే, వాడికా హీరోయిన్ ధ్యాస తప్ప పిక్చరుధ్యాస ఉండదు. ఎంతసేపూ వాడిగొడవే వాడిది. కొన్నాళ్ళకా హీరోయిన్ కాస్తా వాడి పరమయితే, మనం చిప్పపుచ్చుకోవాలి."



"నీకేం భయంలేదు మహాశయా! చూడు, వాడిగోలా, ఆనందమూ సాగనిస్తామా? మనం మాత్రం పథకాలు వెయ్యమూ? ఉదాహరణగా నీకో కథ చెపుతాను విను. హాలీవుడ్‌లో జరిగింది. నువ్వు జన్మించి వుండవనుకుంటాను. ఐనా, అంత మరీ పాతకథ కాదు. హెన్రీఫోర్డ్ అని ఒకతను. పెద్ద క్రోరియర్. వాళ్ళభాషలో మిలియనీరు. అతనికో సినిమా తార మీద మోజు కలిగింది. ఒకరోజు సాయంత్రం ఆమె యింటికి వెళ్ళి -- "తారా తారా, నన్ను పెళ్ళాడూ' అన్నాడు. తార చిరాగ్గా లేచింది. 'ఎవరు నువ్వా?' అని లిప్‌స్టిక్ తడుపుకుంది. 'నేనే తారా. నీ కోసం నా సర్వస్వం ఇచ్చేస్తాను. నువ్వు నా దానివి కావాలి' అన్నాడు. తన ఆస్తిపాస్తులూ అన్నీ వివరించాడు. తార అందికదా, 'కోటీశ్వరా, నా ప్రాణేశ్వరా, నాకు రోజూ పగళ్ళూ, రాత్రులు కాలుషీట్లున్నై -- ఈ సంగతి తెలుస్తే ఇచ్చివుండేదాన్నికాను. ఎట్లా మైడియర్?" అని అడిగింది. అతను ఎన్నాళ్ళు అన్నాడు. కొన్నాళ్ళందామె. ఫరవాలేదన్నా డతను. 'ఐతే, మీ మేడా అదీ నా పరం చెయ్యండి. నేనక్కడే ఉంటాను' అంది. అతను "యా" అన్నాడు. ఇద్దరూ కలిసి అక్కడికి వెళ్ళిపోయారు. అతని సర్వస్వమూ తనపరం చేసుకున్నంత వరకు కాలుషీట్లు అని బెదిరించి తిరగసాగింది. ఆ తర్వాత 'గోవిందో గోవిందా' అని అతన్ని పొమ్మని తన స్వభర్తతో ఆ మేడలోనే కాపురం చెయ్యసాగింది. కోటీశ్వరుడు ఏం చెయ్యగలడు? అట్లాగా -- మనమూ మన చిత్రం కోసం ఏవో పథకాలు వేదాం. చిత్రం పూర్తయేదాకా ఆమె మాటాడదు అందాం. ఆమెకో వ్రతం ఉన్నదంటే సరి" అన్నాడు విశ్వాస్.

"అది సరేగాని -- ఆమె మహాపతివ్రత గదా" అన్నా.

"ఏమా?"

"ఆ హాలివుడ్ ఆమె! తన పతిని తప్ప అన్యుని దరిచేర నీయకుండా అన్యుని అస్తి హస్తగతం చేసుకోగలిగింది.... ఆమెకూ జై" అని అరిచాను.

"ఇంక పద. నిన్ను పరిచయం చేస్తాను"

"ఈ గుడ్డలతోనే!" అన్నాను. అతను నా చెవిలో ఏదో చెప్పాడు. ఇద్దరమూ కలిసి లాండ్రీలో శుభ్రమైన గుడ్డలు అద్దెకు తీసుకుని, డొక్కు కారొకటి కట్టించుకుని బుర్రమని అతని యింటి ముందు దిగాం. అతని యిల్లు పాత కట్టడం. ఇవతలకు చూట్టానికి చాలా పాడయిపోయి శిథిలావస్థలో ఉన్నట్టు కనిపించింది. లోపల చాలా బావుంది. అందంగా, చక్కగా వుంది. అతనూ అట్లానే ఉన్నాడు - చింకిచొక్కా వేసుకుని. కాని లోలోపల చాలా తెలివైనవాడట!

విశ్వాస్ నన్ను పరిచయం చేశాడు. అతని పేరు రత్నాలు. అతన్ని కలుసుకోవడంలో నాకు సంతోషం అని అతనితో అన్నాను.

"ఏం పిక్చరు తియ్యాలనీ?" అన్నాను.

"శకుంతల లాంటి పిక్చరు. డాన్సులూ, నృత్యాలూ కావాలి" అన్నాడు రత్నాలు.

అబ్బో! చాలా ఊహలే అనుకున్నాను.

"హీరోయిన్ యింటికి పోదాం... లెండి" అన్నాడు విశ్వాస్.

రత్నాలు లేచి లోపలకు వెళ్ళి గుడ్డలు మార్చుకుని సెంటూ గింటూ పూసుకుని వచ్చాడు - టింగూ, పూల రంగళ్ళలే. ఇంత మంచి డ్రెస్సులూ లోపల ఉంచేశాడన్నమాట!

"చూడండి రత్నాలు గారూ. మీ పేరు మార్చి - అంటే పెద్దమార్పేం వుండదు. "లు" తీసేదాం. మిస్టర్ రత్నా... అందాం" అన్నాడు విశ్వాస్.

"పేరు మార్చుకుంటే మాత్రం నా గుణాలు నావేగా" అన్నాడు రత్న. "వెనుకటి కథలాగా"

"ఏమిటండీ ఆ వెనకటి కథ?" అన్నాను.

"ఏం లేదు. వెనుకటికి - నే చూళ్ళేదు సుమండీ.... చెప్పుకోటమే! బొంబాయిలో అనుకుంటాను. షీలా అని ఒకామె ఉండేది. ఆమె భర్తను వదిలేసి ఒకనాటి అర్ధరాత్రి వేళ ఒంటరిగా లేచిపోయింది.తెల్లారేసరికి బొంబాయిలో మకాం పెట్టింది. ఆమెకు సినిమా పిచ్చి. సినిమాలో వేషాలు వెయ్యాలని మహ ఇదయ్యేది. ఎవరూ ఇచ్చేవాళ్ళు కాదు. ఎంతో ప్రయత్నించింది. అందర్నీ అర్థించింది. ప్రార్థించింది. ఎట్‌లీస్ట్ -- హీరోయిన్ వేషమయినా యిమ్మంది. హీరో అయినా ఇవ్వం పొమ్మన్నారు. కొన్నాళ్ళకు నాబోటి సలహారాయుడు -- సారీ మీబోటి అనుకుందాం, వచ్చాడు. వచ్చి 'అసలు చిక్కంతా మీ పేరుతో ఉంది. అది మార్చుకుంటే సరి. పేరులో ఆకర్షణ లేదు. షీలా ఏమిటి షీలా! -- అంతకన్నా 'ఉప్పు' అన్నమాట గొప్పదన్నమాట. అందువల్ల మీరేం చెయ్యాలన్న మాట? పేరు మార్చుకోవాలన్నమాట. మీ పేరు గుమ్‌గుమ్ ఇట్లా మార్చండి, గుమ్మగా ఉంది. ప్రొడ్యూసర్లు తెల్లవారేసరికి ఆరుమైళ్ళ క్యూలో ఉంటారు." అని సలహా చెప్పాడు. పైగా -- "నూరు రూపాయల విలువైన సలహా చెప్పాను. కనీసం యాభై అయినా ఇవ్వండి" అని ముప్పై రూపాయలు పట్టుకు పోయాడు. తెల్లవారి లేస్తూనే గుమ్‌గుమ్ గుమ్మంలోకి వెళ్ళి చూసింది. ఆరంగుళాల పొడవుల చీమలబారు వరుసగా వాళ్ళింట్లోకి ప్రవేశిస్తోంది తప్ప ఇంకే క్యూ లేదు, గూ లేదు. ఆ తర్వాత తానే క్యూలలో నించుని ప్రొడ్యూసర్లనూ, డైరెక్టర్లను చూసింది. ఈ పేరు కాదంది. --గగన్‌లాణి అని మార్చింది. ఊహుఁ! తర్వాత మళ్ళీ మార్చింది. మళ్ళీ మార్చింది. ఎన్ని చేసినా ఎన్నిపేర్లు మార్చినా -- ఛాన్సురాలేదు. 'ఛా! పేరులో ఏంలేదు. నాకు అదృష్టం లేదు. పేరేం చేసిందిలే. అనవసరంగా మార్చుకొంటినే" అని గదిలో కూచుని, గాలివానలో, అద్దాల కిటికీలోంచి చూస్తూ మెరుపులు మెరుస్తూ ఉండగా దాంతో శృతికలిపి భోరున పాడింది. అట్లాగ, అంత మాత్రాన ఏముందిలెండి! ఐనా మీరు ఉచితంగా నేనే సలహాయిస్తా కానీ ఖర్చుకాని భాగోతం, పదండి" అని లేచాడు రత్నా. ముగ్గు రం కలిసి హీరోయిన్ యింటికి దారితీశాము.

"సరేలెండి హీరోయిన్‌ను బుక్ చేశారు" అని పూర్తి చేశాడు, కుమారరత్నం.

"ఉండు నాయినా -- ట్రీట్‌మెంటు ఒక్క ముక్కలో చెప్పేస్తే రసం రసాభాస ఐపోదూ" అన్నాడు మహాశయుడు.

"ఏమిటో, 'డ్రాగ్' కొడుతోంది. మీకు కథ చెప్పటం తెలీదు. ఈ పాటికల్లా ఇంటర్వెల్ వచ్చేయాలి. చెబితే తొందరగా చెప్పండి. లేకపోతే నావి నాకిచ్చేయండి" అన్నాడు కుమారరత్నం.

-(ఇంకా వుంది)



సరదా కథ

# బిన్‌లాడెన్ - పెండ్లాడెన్

-జనార్దన మహర్షి





జనార్దన మహర్షి
జి 2, కృష్ణా అపార్ట్‌మెంట్స్
ఎల్లారెడ్డిగూడ, అమీర్‌పేట క్రాస్‌రోడ్స్
హైదరాబాద్ - 73

ఆమె పేరు ఏదైనా...

అందరూ ఆమెని 'దురదృష్టిణి' అని పిలుస్తుంటారు. దానికి కారణం ఉంది. ఆమెకి వయసొచ్చాక, పెళ్ళి చేయాలని పెద్దలు నిర్ణయించారు. మొదటిసారిగా ఆమె పెళ్ళి చూపులకి సిద్ధం అవుతోంది. ఆమె అంతవరకు రాసిన మార్చి ఇంటర్‌నీ, సెప్టెంబర్ ఇంటర్‌నీ మించిన అతిపెద్ద, ఆఖరి పరీక్షలోకి ఎంటర్ అవుతున్న క్షణాలవి.

అతని పేరు ఏమైనప్పటికీ...

పెళ్ళి చూపులకి ఆమెని చూడటానికి బయలుదేరిన అతను దారిలో దారుణంగా యాక్సిడెంట్ జరిగి చనిపోయాడు.

కేవలం, ఇంతే అయితే ఆమెని అందరూ పేరు పెట్టే పిలిచేవారు. కానీ... ఆ పెళ్ళి చూపులు జరిగిపోయి అతను పోయిన కొన్నాళ్ళు తర్వాత ఆమెను సూపర్‌బజార్లో చూసి తెగ ఇష్ట పడిన ఇంకో అతను ఏకంగా తాంబూలాలు తీసుకోవడానికి సిద్ధపడిపోయాడు. ఆవిషయం తెలుసుకొని ఆమె పొంగిపోయింది. మరో గంటలో... నిశ్చితార్థం అనగా అతన్ని ఫాక్షనిస్ట్‌లు గొడ్డలితో నరికారు.

కేవలం...ఇంతే అయితే ఆమెని పేరు పెట్టే పిలిచేవారు. కానీ ఆ తర్వాత మళ్ళీ ఇంకో 'అతను' వచ్చాడు... ఏ మూఢ నమ్మకాలు, జాతకాల మీద నమ్మకం లేని అతను ఆమె మెడలో తాళి కట్టాడు.

ఆ రాత్రి శోభనం అనగా...

మల్లెపూలు తీసుకొస్తూ హార్ట్ ఎటాక్ వచ్చి పోయాడు. అదిగో ఇది కూడా జరిగాక జనం ఖాళీగా ఎందుకు కూర్చుంటారు? అందుకే... ఆమెకు 'దురదృష్టిణి' అని బిరుదిచ్చారు. ఆమె కూడా ఆ బిరుదు తనకే కరెక్ట్ అని నమ్మింది.

అందుకే 'విధిలేని సన్యాసిని' అవతారం దాల్చింది. ఆమె కష్టం అలా ఉండగా... అంతకంటే పెద్దకష్టం అమెరికాకి వచ్చింది. ట్రేడ్ సెంటర్ కుప్ప కూలింది. బిన్‌లాడెన్ వేట ప్రారంభమయ్యింది.

అతను బ్రతికితే చాలా మందికి ప్రమాదం, కానీ అతను మృత్యుంజయుడని అన్ని దేశాలు నమ్ముతున్నాయి. అతని దారుణాల్ని... ఆమె ఓరోజు పేపర్‌లో చదివింది. లాడెన్ గురించి బాగా అర్థం చేసుకొంది.

సరిగ్గా నెల తిరక్కుండా...

"లాడెన్ చనిపోయాడు"

సంచలన వార్త.

అన్ని పేపర్లు ప్రముఖంగా రాశాయి. ఎందరో సంతోషించారు అతన్ని కన్న దేశం తప్ప, అన్ని దేశాలు పండుగ చేసుకున్నాయి. ఆ ఆనందంలో అతను అసలు ఎలా చనిపోయాడో ఎవ్వరూ పట్టించుకోలేదు... కానీ అతను అర్జంట్‌గా చనిపోవడానికి కారణం...

'బిన్‌లాడెన్...పెళ్ళాడెన్'

అర్థం కాలేదు... కదూ?

'దురదృష్టిణి' లాడెన్‌కి చాలామంది పెళ్ళాలున్నారన్న విషయం తెల్సుకుంది. అతను 'ఆడ వీక్' గాడని అర్థం చేసుకొని... అతి కష్టం మీద వెళ్ళింది. ఎవ్వడి కంటా పడని 'అతడి' కంట 'ఆమె' పడింది.

ఒప్పించి పెళ్ళి చేసుకొంది.

అందుకే బిన్‌లాడెన్ చనిపోయాడు.

ఆమెని ఇప్పుడు 'దురదృష్టిణి' అని ఎవరైనా పిలిస్తే వాళ్ళ శవం లేస్తుంది.

ఇంకో విషయం. ఎవరైనా అన్యాయం చేశారో...

ఖబడ్దార్- ఆమె గుట్టుగా పెళ్ళి చేసుకుంటుంది. అంత మంచి ఆమెని ఏమైనాచెయ్యండి... కానీ- 'దీర్ఘ సుమంగళీభవ' అని మాత్రం ఆశీర్వదించకండి.

- శుభం -

సీరియల్

3

# మా మామయ్య ఘంటసాల కథ

-శ్రీమతి ఘంటసాల సావిత్రి



## మామయ్యపట్ల ఉత్తరాది వారి అభిమానము

ఆ రోజుల్లో ప్రఖ్యాత నటుడు, నిర్మాత అయిన రాజ్‌కపూర్ గారి దగ్గర సి.వెంకటేశ్వరరావుగారని డాన్స్ మాస్టరు ఉండే వారు. వారు మాకు బాగా పరిచయస్తులు. బొంబాయిలోనే వుండేవారు. సినిమా షూటింగు విరామ సమయాలలో అద్వైతమూర్తి, సాంధ్యశ్రీ రికార్డులు వింటుండేవారట. రాజ్‌కపూర్, శంకర్‌జైకిషన్ మొదలైన వారు ఈ రికార్డులు విని "ఎవరీయన? ఏం కంఠం! ఎంత గొప్పగా కంపోజ్ చేశారు" అని అడిగారట. అప్పుడు వెంకటేశ్వరరావుగారు "మా గురువుగారు ఘంటసాల గారు పాడారని" చెపితే, యింకా ఏం రికార్డులు వచ్చాయని అడిగి రికార్డులు వచ్చినప్పుడల్లా కొనుక్కునేవారట. సి.రామచంద్ర, నౌషాద్, సాహుమోడి మొదలైనవారు పాటల కంపోజింగ్ జరిగేటప్పుడు ఖాళీ దొరికినప్పుడల్లా మా మామయ్య పద్యాలు, పాటలు వినేవారట. బొంబాయిలో మావయ్య పాటలు బాగా పాపులరై రికార్డులు బాగా అమ్ముడుపోయాయి.

హిందీ నటుడు, నిర్మాత జయరాజ్‌గారు 'సాగర్' అనే సినిమా తీసేటప్పుడు ఆ చిత్రానికి సంగీత దర్శకత్వం వహించమని కోరుతూ ఉత్తరం రాసారు. అప్పుడు మావయ్య చేతిలో పదిహేను సినిమాలదాకా ఒప్పుకున్నవి ఉన్నాయి. ఈ హిందీ సినిమా ఒప్పుకుంటే యిక్కడ పదిహేను సినిమాలు ఒదులు కోవాలి ఏం చెయ్యాలా అని ఆలోచించి ఆచార్యులుగారిని అడిగితే "ఈ పదిహేను సినిమాలకి ఎంత వస్తుందో అంత డబ్బు ఆ సినిమాకి డిమాండ్ చెయ్యి" అన్నారు. లక్ష రూపాయలిస్తే వస్తానని రాయమన్నారు. "పదిహేను సినిమాల డబ్బులు మిగలాలి. బొంబాయిలో నిలదొక్కుకుంటే నీ అదృష్టం బాగానే వుంటుందిగానీ ముందుగా చేతిలో వున్న సినిమాలు వదులుకోవద్దు" అని చెప్పారు. మావయ్య ఈమాటే వాళ్లకి రాసారు. వాళ్ల దగ్గరి నుంచి సమాధానం రాలేదు. ఒక సినిమాకి లక్ష రూపాయలంటే బొంబాయిలో కూడా అంత మార్కెట్ లేదు.

## సొంత యిల్లు - కొత్తకారు

1950 నాటికి కొంత డబ్బు జమ అయింది. ఏదైనా చిన్న యిల్లు పదివేల రూపాయలలో కొందాము అంటే ఒక యిల్లు చూపించారు. కానీ అది నచ్చలేదు. ఒక రోజు "మంచి ఇల్లు చూపిస్తాను రా" అని ఉస్మాన్‌రోడ్‌లో వున్న ఇల్లు చూపించారు. అది ఒక ఇంగ్లీషు దొరగారది. చాలా ఖాళీ స్థలం, పోర్టికో, హాలు అన్ని వసతులతో ఇల్లు పెద్దదిగా వుంది. మాకు నచ్చింది. సరే అని సెటిల్ చేసుకున్నాము. పదివేలనుకున్నది కాస్తా నలభై ఐదు వేలు అయింది. అప్పుతో పెద్ద యిల్లు కొన్నారు. 1951లో గృహప్రవేశం చేసుకున్నాము. అప్పటిదాకా మోతీలాల్ స్ట్రీట్‌లో సుబ్బుపిన్నిగారి యింట్లో ఒక చిన్న వాటాలో అద్దెకి ఉండేవాళ్లం.

## మల్లీశ్వరి పాటలు

మావయ్యకి సైగల్ పాడిన పాటలు వినడం యిష్టంగా వుండేది. ముఖ్యంగా 'మల్లీశ్వరి' సినిమాలో 'ఔనా నిజమేనా' పాటలో "గుజర్ గయా జమానా కైసా" అనే పాట మధ్యలో సైగల్ నవ్వినట్టుగా వేదాంత ధోరణి ప్రస్ఫుట మయ్యేలా నవ్వాలని పదే పదే ఆ రికార్డు పెట్టుకుని ప్రాక్టీసు చేస్తూ నవ్వు సరిగ్గా వచ్చిందా అని అడిగేవారు. ఆయన సాధన చేసిన ఆ నవ్వు ఏదో నవ్వులాటలా వుండేది కాదు.



చాలా బరువుగా బాధ, విరక్తి తొంగిచూస్తున్నట్టు వుండేది. దేవదాసులో జగమేయామ పాట చివర్లో కూడా అలాగే నవ్వారు. పాడిన పాట ఏదైనా ఆయనకి నచ్చితే యింటికి వచ్చిన వెంటనే పాడి వినిపించేవారు.

## దేవదాసు సినిమా పాటలు

1950లోనే 'దేవదాసు' కంపోజింగ్ అయి కొన్ని పాటలు రికార్డు చేసారు. ఇప్పుడు కాంగ్రెస్ (గ్రౌండ్స్) వున్నచోట యిదివరకు ఒక స్టూడియో వుండేది. అక్కడే రికార్డు చేసారు. ఒకరోజు చీకటి పడినా ఆయన ఇంటికి రాలేదు. నేను పని ముగించుకొని మావయ్యకోసం ఎదురుచూస్తూ సుబ్బు పిన్నిగారింటి వరండాలో వాళ్లు కబుర్లు చెప్పు కుంటుంటే వెళ్లి అక్కడ కూర్చున్నాను. అప్పుడు రాత్రి పది గంటలయింది పి.చెంగయ్యగారు సుబ్బు పిన్నిగారి బంధువు. వినోదాలో అసిస్టెంట్ డైరెక్టరుగా పని చేసేవారు. ఆయన ఇక్కడికి వచ్చి "మీ ఆయన స్టూడియోలో అందరిని తెగ ఏడిపించేస్తున్నాడమ్మా ఇవాళ కుడి ఎడమైతే పొరపాటు లేదోయ్, కలయిదని నిజమిదని తెలియదులే బ్రతుకింతేనులే అని రెండు పాటలు రికార్డు చేస్తున్నారు. అక్కడ ఆ పాటలు విని కంటతడి పెట్టనివాడు లేడు. మీ ఆయన అందరినీ ఏడిపించేశాడమ్మా! ఇంక అక్కడ వుండలేక దుఃఖం ఆపుకోలేక బస్సుకోసం కూడా చూడక వస్తున్నాను" అంటూ ఎంతో గొప్పగా చెప్పారు. ఆ మాటలు విన్నప్పుడు గర్వంగా అనిపించింది. 1951లో సుబ్బరామన్ గారు పోవడం, జగమే మాయ రికార్డు చెయ్యడం జరిగింది.



## విజయ సంస్థతో అనుబంధం

51లోనే మాకు పెద్దబ్బాయి పుట్టాడు. ఆస్పత్రికి నన్ను, మా అబ్బాయిని చూడటానికి నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు వచ్చారు. "మీ అబ్బాయికి ఏం పేరు పెడతారు" అని అడిగితే యింకా ఏమీ అనుకోలేదని చెప్పారు. విజయా సంస్థ పేరు వచ్చేట్టుగా పెట్టుకోరాదా అని వారన్నారు. మావయ్య నాతో సంప్రదించి మా అబ్బాయికి "విజయకుమార్" అని పేరు పెట్టారు. అందుకు నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు చాలా సంతోషించారు.

## సొంత పిక్చర్ల నిర్మాణం

1952 నుంచి విజయావారి అనుమతితో ఇతరుల చిత్రాలకు పని చెయ్యటం ప్రారంభించారు. బ్రతుకుతెరువు, పల్లెటూరు సినిమాలకి మ్యూజిక్ చేశారు. 52లోనే శోభ పిక్చర్స్ అనే సంస్థని ప్రారంభించి సొంతంగా "పరోపకారం" అనే సినిమా తీసారు. అందులో ముక్కామల హీరో. ఆ చిత్రం బాగా ఆడలేదు. ఆర్థికంగా బాగా దెబ్బతిన్నాము. సంస్థలో భాగస్తులైన కమల్‌ఘోష్‌గారు, పాపారావుగారు మావయ్యని బాగా యిరికించి మెల్లగా వాళ్లు పక్కకి తప్పుకున్నారు. "వాళ్లందరికీ లేని బాధ మీకెందుకు?" అంటే "నువు చిన్నదానివి. నాకు సలహాలిస్తున్నావా? అందరూ ఘంటసాల సినిమా మొదలు పెట్టాడు. అది ఆగిపోయిందంటారు కానీ కమల్‌ఘోష్‌గారి నంటారా?" అనే వారు. అరవం, తెలుగు రెండు భాషల్లో తీసారు. రెండు ఫ్లాపయ్యాయి. ఆరు లక్షలు అప్పుకట్టవలసి వచ్చింది. ఇంటిమీద కూడా అప్పైంది. అప్పుడు డబ్బింగ్ పాటలు మూడు వందల రూపాయలకి పాడారు. నాటకాలు ఒప్పుకుని చింతామణిలో బిళ్వమంగళుడు, సక్కుబాయిలో యోగి వేషాలు వేశారు. మధ్యాహ్నం విశ్రాంతి తీసుకునేటప్పుడు నాటకంలో పోర్షను నేను చదువుతుంటే వినేవారు. అలా చాలా కష్టపడి అప్పులు తీర్చారు.

కొంత పుంజుకున్న తర్వాత "సొంతవూరు" సినిమా తియ్యటానికి పూనుకున్నారు. అప్పుడు నేను చాలా భయపడ్డాను. "ఒకసారి దారుణంగా దెబ్బతిన్నాం కదా! మళ్లీ ఎందుకు చిత్ర నిర్మాణం వైపు వెళతారు" అనే దాన్ని. దానికి ఆయన నవ్వుతూ "ఈసారి తప్పకుండా విజయం సాధిస్తాను చూడు" అని రామారావు, రాజసులోచన జంటగా సినిమా తీసారు. ఆ సినిమా కూడా బాగా దెబ్బతిని మళ్లీ అప్పుల పాలయ్యాము.

## బడేగులాం అలీఖాన్

1953-54లో అనుకుంటాను నేను మా అమ్మ వాళ్లింటికి వెళ్లాను. ఎప్పుడు ఊరికి వెళ్ళినా పదిరోజులలో తిరిగి వచ్చేదాన్ని. నేను తిరిగి వస్తున్నానని ఆయన రైల్వేస్టేషన్‌కి వచ్చారు. నన్ను చూస్తూనే ఆయన "నువ్వు యింటికి వెళ్లాక చాలా ఆశ్చర్యపోతా"వన్నారు. ఏమిటంటే "చెప్పను నువ్వు యింటికి వచ్చాక చూడాలి" అన్నారు. సరే అని యింటికి వెళ్లేటప్పటికి యింటి నిండా చాలామంది మనుషులున్నారు. కిటకిట లాడుతున్నారు. నేను వెనుకవైపు నుంచి యింట్లోకి వెళ్లాను. "ఎవరు? ఏమిటి? మన యింటికి చుట్టాలొచ్చారా?" అని అడిగాను. చుట్టాలు కాదు. బడే గులాం అలీఖాన్ అనే ఆయన పాకిస్థాన్ నుంచి వచ్చాడని, చాలా గొప్ప గాయకుడని, ఉండటానికి ఎక్కడా చోటు దొరకకపోతే యిక్కడికి తీసుకొచ్చానని చెప్పారు. బడేగులాం అలీఖాన్‌గారు తనని పిలవడానికి వచ్చిన కార్యకర్తలతో ముందుగానే చెప్పారట "నేను మొదటిసారిగా దక్షిణ దేశం వస్తున్నాను. అవకాశం వుంటే కొన్ని చోట్ల పాడాలని అనుకుంటున్నాను. దానికిగాను నెల, రెండు నెలలు ఉంటాను. నేను ఏ హోటల్లోనూ ఉండను. ఏదైనా ఇల్లు ఏర్పాటు చెయ్య"మని. కానీ ఆయన ఉండటానికి తగిన వసతి దొరకలేదు. అందులో ఆయన వంటవాడితో సహా ఎనిమిది మంది వచ్చారు. ఆ కార్యకర్తలు రెండు రూములున్న యిల్లు తీసుకున్నారు. అదీ రెండు, మూడు రోజులలోనే ఖాళీ చెయ్యాలన్నారట. సాయంత్రం ప్రోగ్రాము. "మీరు ఉండటానికి ఇల్లు దొరకటం లేదు. ఈ రెండు రూములు అతి కష్టం మీద సంపాదించాము. మీ కచేరీ అవంగానే వెళ్లిపోవాలి." అని టిక్కెట్లు తెప్పించి యిచ్చారట.

ఆ ప్రోగ్రాములో ఆయన అద్వితీయంగా పాడారుట. అది విన్న మావయ్యకి ఒక్కసారి అలీఖాన్ గారికి పాదాభివందనం చెయ్యాలని అనిపించి స్టేజీ మీదకి వెళ్తే ఆయన చాలా విచారంగా, కంగారుగా వున్నారుట. "ఇవాళ మనం వెళ్లి పోవలసిందేనా? ఇంటి దగ్గర రెండు నెలల దాకా రామని చెప్పి వచ్చాం. ఇక్కడికి వస్తే యివాళే వెళ్లిపొమ్మన్నారు. ఎట్లాగ? ఏమిటి పరిస్థితి? ఎక్కడైనా ప్రయ్నుతం చెయ్యండిరా" అని ఆయన ఆందోళనగా అన్నారుట. సామానుతో స్టేజీ దగ్గరకు వచ్చారుట. మావయ్య ఆయనకి



ఘంటసాల, పి.లీల, సావిత్రి, బడే గులాం ఆలీఖాన్,
చిత్తూరు నాగయ్య తదితరులు

నమస్కారం పెట్టుతున్నా అలీఖాన్ గారు అస్సలు చూడలేదుట. వాళ్ల ఆందోళన చూసి "ఏమిటి? ఎందుకు అలా బాధపడుతున్నారు? ఏ విషయం చెప్పండి" అని అడిగితే "మేము యిక్కడ కొన్ని రోజులు ఉండాలని అనుకున్నాము. కానీ మేము ఉండడానికి యింత పెద్ద మద్రాసులో చోటే దొరకలేదు" అన్నారట. దానికి మావయ్య "మీకు అభ్యంతరం లేకపోతే మా యింటికి రండి. మా ఇంట్లో ఎన్నిరోజులైనా సంతోషంగా ఉండవచ్చు" అంటే "నువ్వు అంటున్నావు. ఇంటికి వెళ్లిన తరువాత మీ ఆవిడ ఏమంటుందో? మీ ఇల్లు ఎలా ఉంటుందో? ఏవో చిన్న రెండు రూములు చూపించి ఉండమంటే చాలదు. మేము 8 మంది ఉన్నాము. రెండు గదుల్లో సర్దుకోవటం కాని పని. ఇంటికి వెళ్ళిన తరువాత మీ ఆవిడ వీళ్లందరినీ ఎందుకు తీసుకొచ్చావు అంటే మళ్లీ సామాన్లు నెత్తిన పెట్టుకొని నేనెక్కడికి పోతాను? నువ్వు సరిగ్గా ఆలోచించుకుని చెప్పవయ్యా" అన్నారుట ఖాన్‌గారు. "అలా కాదు. నా భార్య అలా అనదు. మీరు తప్పకుండా రావచ్చు. మీరు వచ్చి చూడండి. నచ్చితేనే ఉందురుగాని" అని నచ్చచెపితే "సరే రా పోదాం" అంటూ ఎలా వచ్చావని అడిగారుట. మావయ్య "నా కారుంది. అందులో వచ్చాను" అంటే మిగిలిన వాళ్లందరినీ స్టేజీ దగ్గరే వుండమని ఖాన్‌గారు ఒక్కరూ వచ్చారుట. అప్పుడు రాత్రి పదిన్నర అయిందట.

ఇంటికి రాగానే, నేను కూడా లేను కదా, గేటు, పోర్టికో, పెద్ద ఇల్లు, ఖాళీగా ఉంది, పెద్ద కాంపౌండ్ అదీ చూసి "నాకు చాలా నచ్చింది కానీ మీ ఆవిడ వెళ్లిపొమ్మని అనకూడదు. అది నువ్వు బాగా ఆలోచించు" అంటే 'మాకేమీ అభ్యంతరం ఉండదు' అన్నారట. ఆయన హాల్లో కూర్చుని కారు పంపించి సామాన్లని, మిగిలిన వాళ్లని తీసుకువచ్చారుట. ప్రస్తుతం మీరు

కింద ఉండండి. తర్వాత మేడమీదికి వెళ్లి వుందురుగాని అని చెప్పారట. ఆ తరువాత నేను వచ్చానన్నమాట. వాళ్లకి కావలసిన వంట అంతా వాళ్లే చేసుకునే వారు. నేను ఉదయం సాయంత్రం 40 రొట్టెలు చేసి యిచ్చేదాన్ని. ఖాన్‌గారు మెలకువగా వున్నంతసేపూ అలా ఏదో ఒకటి పాడుతూనే వుండే వారు. ఆయనని కలుసుకోటానికి పెద్దపెద్ద విద్వాంసులు, ఎంతో పేరు ప్రఖ్యాతులున్న వాళ్లు వస్తుండే వారు. ఎం.ఎల్.వసంత కుమారి, ఎం.ఎస్.సుబ్బులక్ష్మి, జి.ఎన్.బి.సుబ్రహ్మణ్యం అయ్యర్ (జిఎన్‌బి) ఒక్కరని ఏమిటి? నగరంలో వున్న ప్రతి ఒక్క సంగీత కళాకారుడు ఖాన్‌గారి కోసం ప్రతి రోజూ విధిగా ఉదయం సాయంత్రం వచ్చేవారు. సంగీత సాహిత్యాల గురించి చర్చలు చేస్తుండే వారు. పాడుతూ వుండే వారు. వీళ్లందరి రాకపోకలతో యిల్లు నిత్యం పెళ్లివారిల్లులా సందడిగా వుండేది. ఆదివారాలు బిరియానీ వండుకునే వాళ్లు, ఆ రోజు రొట్టెలు చేసే పని వుండేది కాదు. ఆదివారం సాయంత్రం బయటివాళ్ల నెవ్వరినీ రానిచ్చే వారు కాదు. నన్ను మాత్రం త్వరగా పని ముగించుకుని పైకి రమ్మనే వారు. నేను వెళ్లేసరికి అందరూ సిద్ధంగా వుండి, నన్ను కూర్చోమని "బహూ! ఇప్పుడు నీ ఒక్కదాని కోసం పాడతానమ్మా!" అని దాదాపు మూడు నాలుగు గంటల సేపు పాడేవారు. నాకు సంగీతం గురించి ఏమీ తెలియక పోయినా వినడం యిష్టం. పెద్దాయన అలా పాడుతుంటే అలౌకికమైన ఆనందం కలిగేది. ఖాన్‌గారిని మేము 'పెద్దాయన' అనే వాళ్లం. ఒక రోజు మా యింటికి దగ్గరలో వున్న కృష్ణగాన సభలో కచేరీ అయింది. దానికి పెద్దాయన నన్ను, మావయ్యని యిద్దరినీ రమ్మన్నారు. కానీ మావయ్యకి వేరే పని వుండడం వల్ల రాలేనంటే పెద్దాయన "అయితే కోడలిని తీసుకు వెళతాను" అని నన్ను తీసుకు వెళ్లారు. తీరా అక్కడికి వెళ్ళేసరికి ముందు వరుసలో ఒక పెద్ద సోఫా వేసి అందులో కూర్చోపెట్టారు. నాకు చాలా మొహమాటంగా అనిపించింది. కానీ ఏం చేసేది, అలాగే కూర్చున్నాను. ఆ రోజు ఖాన్‌గారు ఐదు గంటలు కచేరీ చేసారు. ఒక్కళ్లు కూడా కదలకుండా అలాగే కూర్చుని విన్నారు. అలా ఖాన్‌గారు మా యింట్లో రెండు నెలలు వున్నారు. బడేగులాం ఆలీఖాన్ గారితో మా యింటికి వచ్చి కొలువు చేసిన ఆ సరస్వతీ దేవి మా యింట్లో స్థిరంగా వుండిపోయింది అనిపించింది, నాకు, మెలకువగా వున్న ప్రతిక్షణం ఏదో ఒకటి అలాపిస్తూ వుండే ఖాన్‌గారికి చివరలో గొంతు పడిపోయింది. చాలా రోజులలా మంచాన పడి వున్నారు. ఆయన హైదరాబాదులో వున్నారని తెలిసి మావయ్య ఆయనని చూడటానికి ఆస్పత్రికి వెళితే పెద్దాయన మావయ్యని పక్కలో కూర్చోపెట్టుకుని చెయ్యి గట్టిగా గుండెలకి తాకించి పట్టుకుని చాలా సేపు ఏడుస్తూ వుండిపోయారట. ఏదో చెప్పాలన్న ఆరాటం, పాడాలన్న తపన, ఏమీ చెయ్యలేని నిస్సహాయతతో కుమిలి కుమిలి ఏడ్చారట. మావయ్య తిరిగి వచ్చిన వారం రోజులకే పెద్దాయన పోయారు. ఆ వార్త తెలిసినప్పుడు అత్యంత ఆత్మీయుడిని పోగొట్టుకున్నామన్న దుఃఖంతో ఎన్నో రోజులు బాధపడ్డాము. బహుశా తను పాడగలిగినంత కాలమే బ్రతికి వుండాలన్న కోరిక మావయ్యకి పెద్దాయనని అంత బాధలో చూసినప్పుడే బలంగా కలిగిందని అనిపిస్తుంది.

## హిందీభాష

మావయ్యకి తెలుగు తప్ప మరో భాష రాదు. మద్రాసులో అన్నేళ్లు వున్నా అరవం ఏదో పొడిమాటలు మాట్లాడే వారు. హిందీ పలకటం కష్టం అనుకునే వారు. మోటూరి సత్యనారాయణగారి మేనల్లుడు దాసుగారని వుండేవారు. ఆయన మావయ్యతో "మీ కంఠం ఎంతో బాగుంటుంది. హిందీలో పాటలు పాడితే అద్భుతంగా వుంటుంది. మీకు హిందీ రాకపోతే నేను నేర్పుతాను. రోజూ అరగంట నేర్చుకోండి. నాతో మాట్లాడండి. హిందీ బాగా వస్తుంద"ని చెప్పి, అన్నమాట ప్రకారం చాలా సిన్సియర్‌గా వచ్చేవారు. నాలుగు రోజులు ఆయన అక్షరాలు రాసిచ్చి చెప్పుకున్నారు. ఆ తరువాత దాసుగారు పొద్దుట వచ్చేసరికి నేను "ఏవండీ! దాసుగారు వచ్చారు" అంటే చిన్నపిల్లలు బళ్లోకి వెళ్ళడానికి మారాం చేసినట్టు "నువ్వు నేర్చుకో. నాకు కడుపులో నొప్పి అని చెప్పు ఒంట్లో బాగుండలేదని చెప్పు" అనేవారు. చిన్నపిల్లలని మనం కోప్పడతాం గానీ ఆయన్ని నేనెలా కోప్పడను! సరే. చేసేదిలేక నేనే పలక, పుస్తకం పుచ్చుకుని తయారయేదాన్ని. హిందీ మాష్టారు వచ్చే వేళకి నేను చాపమీద కూర్చుని సిద్ధంగా వుండేదాన్ని. దాసుగారు "మాష్టారికి కడుపులో నొప్పిగా వుందా?" అనే వారు. నేను ఔననేదాన్ని. సరే అని నాకు పాఠం చెప్పేవారు. ఓ రెండు నెలలు అలా చదువుకున్న తరువాత నాకు సిగ్గువేసింది. ఆయనకి చెప్పటానికి వస్తే నేను చెప్పించుకోవటం ఏం న్యాయం? ఘంటసాల గారికి చెప్తే గొప్ప. నాకు చెప్తే ఏం వస్తుంది? దాసుగారు నాతో మధ్యమ పరీక్షకు కట్టిస్తానంటే, నేనలా అనుకోవడం లేదని, యింక చదువుకోను అని దాసుగారితో చెప్పి మానేసాను.

## ఘంటసాల - నందమూరి తారకరామారావు

"పెళ్లి చేసి చూడు" సినిమా నిర్మాణంలో వున్నప్పుడు రామారావు గారు మావయ్యతో "మీకు అభ్యంతరం లేకపోతే మీరు మ్యూజిక్ రిహార్సల్స్ చేసేటప్పుడు నేను కూడా వస్తాను. మిమ్మల్ని చూసి పాటెలా పాడాలో



'పెళ్లి చేసి చూడు'లో హార్మోనియం వాయిస్తూ రామారావు

నేర్చుకుంటాను." అంటే మావయ్య సరేనన్నారు. అలా ఆ సినిమా మ్యూజిక్ సిటింగ్‌లో కూర్చుని హార్మోనియం ఎలా పట్టుకోవాలో, ఎలా వాయించాలో మావయ్యని చూసి నేర్చుకుని ఆ సినిమాలో అలాగే చేసారు.

మావయ్యని ఎంతోమంది సినిమాలలో నటించమని అడిగితే "నేను నటిస్తే మరొక నటుడికి అవకాశం పోతుంది. ఆ నటుడి పొట్టకొట్ట కూడదు. నేను పాటలు పాడి బతుకుతున్నాను చాలు" అనేవారు. మనం బతకడం మాత్రమే ముఖ్యం కాదు. మనకు వీలైనంతవరకు, యితరులు కూడా బతకడానికి మనవంతు కృషి మనం చెయ్యాలి అనే మనస్తత్వం మావయ్యది. పి.పుల్లయ్య గారి బలవంతం మీద శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యంలో వేషం వేసారు. అది కూడా మావయ్యకి యిష్టదైవమైన వేంకటేశ్వరస్వామి వారి ముందు కాబట్టి ఒప్పుకుని నటించారు. మావయ్యతో పాటు సంగీత దర్శకుడు పెండ్యాల, వేణువు వాయించే నంజప్ప కూడా ఆ పాటలో నటించారు. ఈ సినిమా తరువాత కూడా చాలామంది నటించమంటే "ఇంకో నటుడి పొట్టకొట్టను. వేషాలు వేసి దాని మీదే బ్రతికే వారు వున్నారు. వాళ్లకి అవకాశం యివ్వండి" అనే వారు.

పాట కచేరీలు చేయటమంటే ఆయనకి చాలా యిష్టం. పాటలు పాడి రికార్డు చేస్తే అది ప్రజలలోకి వెళ్లాకగానీ ఆ పాటలకు ప్రజల స్పందన

ఎలా వుందో తెలీదు. అదే కచేరీలు చేస్తే, జడ్జిమెంట్ అప్పటికప్పుడు తెలుస్తుంది. తనమీద ప్రజలకుండే ప్రేమ ఎలాంటిది, ప్రజలు తనని ఎలా రిసీవ్ చేసుకుంటారు అన్నది కచేరీలకు వెళ్తేకానీ తెలీదు. శ్రోతల ముఖాలలో కనిపించే భావాలని గమనించినప్పుడు మనని మనం మెరుగుపరుచుకునే అవకాశం వుంటుంది అనే వారు. ప్రజలలోకి వెళ్లి పబ్లిక్‌లో పాడుతూ వుంటే జనం చప్పట్లు కొట్టి, ఈలలు వేసి, వన్స్‌మోర్ అంటుంటే ఆయనకి అది చాలా సంతోషాన్నిచ్చేది. అందుకోసమని కచేరీలు చాలా చేస్తుండే వారు. పెళ్లిళ్లలో కూడా పాడేవారు. కొంతమంది కట్నంతో పాటు మావయ్య పాటకచేరీ కూడా అడిగేవారు. ఆడపెళ్లివారు వచ్చి కచేరీకి ఎంత యివ్వాలి అని అడిగితే నాకు యిచ్చినా యివ్వకపోయినా పరవాలేదు కానీ నా ఆర్కెస్ట్రా వాళ్లకి మాత్రం వాళ్ల ఖర్చులు భరించాలి అనేవారు. పేదవారి దగ్గర అసలేమీ తీసుకునేవారు కాదు. ఈ కచేరీల కోసం మావయ్య ఎన్నో సినిమా పాటలు ఒదులుకునే వారు.

1951-52లో మా మరిది సదాశివుడు, అన్నయ్య సుబ్బారావు యిద్దరినీ వైజాగ్‌లో హాస్టల్ వుంచి ఇంటర్ చదివించారు. ప్రతి నెల వాళ్లకి డబ్బులు పంపించేవారు. 1953లో మరిది సదాశివుడికి మా పెద్దాడపడుచు కూతురు సుబ్బలక్ష్మి నిచ్చి పెళ్లిచేసారు. 5 రోజుల పెళ్లి. ఇప్పటికీ చౌటుపల్లిలో బాగా ముసలివాళ్లని అడిగితే తాతబ్బాయి (మా మరిదిని అందరూ తాత అని పిలిచేవాళ్లు) గారి పెళ్లిలాంటి పెళ్లి మళ్లీ జరగలేదు అంటారు. అంత వైభవంగా చేసారు. బందరునించి మందుగుండు సామాను, రాజమండ్రి నుంచి భోగం మేళం, పూసలపల్లకీలో ఊరేగింపు, 5 రోజులూ ఉదయం సాహిత్య సభ, సాయంత్రం సంగీత సభ, రాత్రికి హరికథ పెట్టించారు. ఆ 5 రోజులూ మూడు పూటలా బంధు మిత్రులకే కాక చుట్టుప్రక్కల ఊళ్ల వాళ్లకి కూడా భోజనాలు పెట్టారు. పెళ్లికి ఊళ్లో చిన్నచిన్న దుకాణాలు, సోడాకొట్లు వెలిశాయి. ఒక తిరణాలలాగా జరిగింది. 5వ రోజు సాయంత్రం మావయ్య కచేరీ చేశారు. ఆ రోజుల్లో ఆ పెళ్లికి 20 వేలదాకా ఖర్చయింది. 1954లో మా తోటికోడలు పాప (సుబ్బలక్ష్మి)ని కాపురానికి తీసుకువచ్చారు. అప్పటికి ప్రొడక్షన్ ప్రారంభించడం ఆ పనులు చూసుకోవలసి రావడం వల్ల వాళ్లని యిక్కడే వుండమన్నారు.

1951లో గృహప్రవేశం అయిన తరువాత గురువుగారు పట్రాయని సీతారామ శాస్త్రిగారు రెండు నెలలు ఉండి వెళ్లారు.

1954లో గురువుగారు మావయ్యకి ఉత్తరం రాసారు. వాళ్ల అబ్బాయికి ఏదైనా జీవనోపాధి కల్పించమని వెంటనే మావయ్య జవాబు రాసారు. ఫలితంగా సంగీతరావు గారు మద్రాసుకి వచ్చి మా యింట్లో వున్నారు. మావయ్య ఆయన్ని తన దగ్గర హార్మోనియం వాయించడానికి పెట్టుకున్నారు. అలా రెండు సంవత్సరాలు మా యింట్లోనే వుండి కొంత స్థిరపడిన తరువాత 1956లో ఆయన భార్య శ్రీ లక్ష్మమ్మ, వాళ్ల యిద్దరు పిల్లలతో మద్రాసు వచ్చి మా ఔట్‌హౌస్‌లో కాపురం వున్నారు. అలా వచ్చిన వారు 28 సంవత్సరాలు వున్నారు.

ద్వారం వెంకటస్వామి నాయుడుగారు ప్రతి సంవత్సరం మూడు నాలుగు సార్లు కచేరీల కోసం 7గురితో వచ్చేవారు. రెండు వారాలుండే వారు. ఎప్పుడు వచ్చినా మా యింట్లోనే దిగేవారు. ఒకసారి నాయుడుగారికి మద్రాసులో ఒక కమిటీ ఏర్పడి సన్మానం చేసి 25000 రూపాయలతో పర్సు యిచ్చారు. నాయుడుగారు ఆ డబ్బు అలాగే మావయ్య చేతికిచ్చి ఏదైనా మంచిఇల్లు చూసి కొనిపెట్టమని చెప్పారు. ఆయన చెప్పినట్టే ట్రిప్లికేన్‌లో యిల్లు కొన్నారు. ఆ ఇంటికి కావలసిన పనులన్నీ మావయ్యే దగ్గరుండి చేయించారు. గృహప్రవేశానికి కావలసిన ఏర్పాట్లు కూడా మావయ్యే చేశారు. మా యింట్లో వుండే బజారు పనులన్నీ చేసుకొని మా యింటి నుంచే వెళ్లి, గృహప్రవేశం చేసుకున్నారు. ఇప్పటిలా అప్పుడు గాస్‌స్టౌవ్‌లు లేవు. కుంపట్లతో, కట్టెల పొయ్యిలతో చేసుకొనే వాళ్లం. మా ఇంట్లో అప్పుడు, ఇప్పుడు ఎప్పుడూ వంటవాళ్లు లేరు. ఏవేళ ఎంతమంది వచ్చినా నేనే చేసేదాన్ని.

ఎన్.టి.రామారావుగారు మా యింటికి అప్పుడప్పుడు భోజనానికి వచ్చేవారు. అలాగే నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు కూడా వాళ్ల చెవర్లెట్ కారు మాకు వదిలి మా అంబాసిడర్ కారు తీసుకువెళ్లే వారు. తరచుగా మా యింటికి భోజనానికి వచ్చి వారి కిష్టమైనవి అడిగి చేయించుకుని తినేవారు. నాగిరెడ్డిగారికి పాయసం అంటే చాలా యిష్టం.

మద్రాసుకి ఎవరైనా పండితులుగానీ, విద్వాంసులుగానీ వస్తే వారిని తప్పనిసరిగా యింటికి తీసుకువచ్చేవారు. మా ఇంట్లో తరుచుగా సాహిత్య సమావేశాలు జరుగుతుండేవి. యామిజాల పద్మనాభ స్వామిగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, సముద్రాల రాఘవాచారిగారు, రామానుజం గారు, కొసరాజుగారు, దాశరథిగారు, ఆత్రేయగారు, ఆరుద్ర, నారాయణరెడ్డిగారు, కేశవదాస్‌జీ, పుష్పగిరి స్వామీజీ, శృంగేరి స్వామీజీ, బెజవాడ గోపాలరెడ్డిగారు, టంగుటూరి ప్రకాశం పంతులుగారు, పొట్టి శ్రీరాములుగారు - ఇలా గొప్పగొప్పవాళ్లు, మహానుభావులు ఎందరో యింటికి వస్తుండే వారు. ఎందరి కచేరీలకో మావయ్య వెళ్లేవారు. అలా వెళ్లొచ్చినపుడల్లా వారి సంగీతాన్ని తలుచుకుని తలుచుకుని పొంగిపోయేవారు. తను ఎప్పటికైనా వాళ్లంత పేరు ప్రఖ్యాతులు సంపాదించగలనా? అని తపన పడేవారు. వాళ్లెంత పుణ్యం చేసుకున్నారో, సరస్వతీదేవి వాళ్లని అంత అనుగ్రహించింది. తను అంత పుణ్యం చేయ్యలేదమోనని బాధపడేవారు.

మావయ్య క్రికెట్ మాచ్‌లకి తరుచుగా వెళ్లేవారు. వెళ్లడం కుదరకపోతే కామెంటరీ వినేవారు. ఇంటిదగ్గర షటిల్ ఆడేవారు. రెజిలింగ్ అంటే చాలా యిష్టం. దారాసింగ్, కింగ్‌కాంగ్, అజిత్‌సింగ్‌ల పోటీలకి వెళ్లేవారు. నన్ను కూడా తీసుకువెళ్లేవారు. నాటకాలకి, నాటక పోటీలకి వెళ్లేవారు. రెజిలర్ అజిత్ సింగ్ పాండవ వనవాసంలో ఆంజనేయుడి వేషం వేసారు. అతను ఆ సినిమా చూసి "పాటలు అద్భుతంగా వున్నాయి. ఎవరు పాడారు" అని అడిగితే జి.వరలక్ష్మి అతన్ని మా యింటికి తీసుకువచ్చి పరిచయం చేసింది. మావయ్య ఆంధ్రా క్లబ్‌లో లైఫ్ మెంబరు.

1963లో వారు నాటక పోటీలు, సంగీతంలో పోటీలు జరిపారు. ఉత్సాహం గల ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం నెల్లూరు నుంచి వచ్చి ఆ పోటీల్లో పాల్గొన్నాడు. పాటల పోటీల్లో బాలసుబ్రహ్మణ్యానికి మొదటి మార్కు వేసిన ముగ్గురు జడ్జీలలో మావయ్య ఒకరు. మిగిలిన ఇద్దరు జడ్జీలు పెండ్యాల, సుసర్ల దక్షిణామూర్తి గార్లు.

## దేశభక్తి

అప్పట్లో మావయ్య చాలా సినిమాలలో పాడుతూ చాలా బిజీగా వుండే వారు. దేశానికి తన సేవ అవసరం అయినప్పుడు అన్నిటినీ వదిలి వెళ్లే వారు. రాయలసీమలో కరువు వచ్చినప్పుడు, రక్షణ నిధికి విరాళాలు సేకరించాలనుకున్నప్పుడు ఎన్.టి.రామారావు గారు మా యింటికి వచ్చి "మాష్టారూ! చిత్ర పరిశ్రమ తరపున అందరం కలిసి నిధిని ప్రజల దగ్గర నుంచి వసూలు చేసి ప్రభుత్వానికి అందజేస్తే బాగుంటుందని తోచింది. ముందుగా మీ దగ్గరకే వచ్చాను. మంచి సలహా చెప్పమని అడిగారు. యిద్దరూ కూచుని చాలాసేపు మాట్లాడుకున్నారు. "ఎవరు వచ్చినా రాకపోయినా కంజీర పట్టుకుని నేను పాడతాను, మీరు జోలె పట్టుకోండి. ఊరూరా తిరుగుదాం" అన్నారు. ఆ మాటలకి రామారావుగారు మామయ్యకి సాష్టాంగ నమస్కారం చేసి వెళ్లారు. ఆ తరవాత అందరూ కలిసి వచ్చారు. మావయ్య మంచి కార్యానికి ముందుండేవారు.

(-ఇంకా వుంది)



# రాంపండు లీలలు

## రాంపండూ - గాన కౌశలమూ

"మళ్లీ మళ్లీ పాడుతా, మల్లి మనసు నాదేననీ..."

అనంత్ బాత్‌రూమ్‌లో కూనిరాగం తీస్తూండగా అచలపతి పిలుపు వినబడింది.

"సర్, మీ స్నానం, పాట అయిపోతే బయటకు రావచ్చు. రాంపండుగారు మీ కోసం వెయిట్ చేస్తున్నారు."

అనంత్‌కి సమాధానం ఇవ్వక తప్పింది కాదు. "చూడు అచలపతీ, స్నానం అయిపోతే పాట ఆపేస్తానని తెలిసికూడా నువ్వలా అనడం బాగాలేదు. రాంపండు వచ్చాడంటున్నావు కాబట్టి త్వరగా స్నానం ముగించి వచ్చేస్తాను. ఉండమను."

అనంత్ చెప్పినది నిజమే. అనంత్ బాత్‌రూమ్ సింగరే కానీ బాల్‌రూమ్ సింగరు కాడు. పాట పూర్తిగా పాడేవరకూ స్నానం చేయాలని వాళ్ళ అమ్మ చిన్నప్పుడు నేర్పించింది. అనంత్‌కు ఏ పాటా - లిరిక్ గానీ, ట్యూన్ గానీ సరిగ్గా గుర్తుండవు. అవన్నీ గుర్తుకు తెచ్చుకుని పాట పూర్తి చేసేసరికి కాస్త ఎక్కువసేపు స్నానం చేయవలసి వస్తుంది. అదే వాళ్ల అమ్మ కోరుకున్నది కూడా. స్నానం అంటే రెండు చెంబుల నీళ్లు పోసుకుని పరిగెట్టుకురాకుండా ఆవిడ ఈ ఉపాయం కనిపెట్టింది. ప్రస్తుతం ఆంధ్రప్రదేశం అంతా ఊపేస్తున్న పాట కాబట్టి "మళ్లీ మళ్లీ పాడుతా..'' అనంత్‌ను పట్టేసుకుని వదలనంటోంది.

స్నానం ముగించి అనంత్ వచ్చేసరికి రాంపండు బల్లమీద దరువులు వేస్తున్నాడు. పాట అదే - "మళ్లీ మళ్లీ పాడుతా, మల్లి మనసు నాదేనని.."

"ఏం గిరాకీ?"

"అనంతూ, నాకు పెళ్లి కుదిరింది." అన్నాడు రాంపండు ఉత్సాహంగా.

"తిక్క కుదిరింది.. వీణాపాణేనా.?"

రాంపండుకు కోపం వచ్చింది. "ఏమిట్రా ఆ వీణాపాణి తప్ప వేరే ఆడదే నాకు దొరకదా? ఫుట్‌బాల్ మ్యాచ్ వ్యవహారంలో వేనక చెయ్యివ్వడంతో ఒళ్లు మండి మళ్లీ వీణాపాణి దగ్గరకు వెళ్లాను. నాలుగురోజులు సవ్యంగా నడిచాయో లేదో, మళ్లీ పోట్లాటేసుకుంది. నేను బొత్తిగా అలుసయిపోయాననుకో.."

"అయితే ఇప్పుడీ పెళ్లి ఎవరితో కుదిరినట్టు? కొత్త కాండిడేటా?" అడిగాడు అనంత్ నిర్లక్ష్యంగా.

"ఒరే, అంత తీసిపారేసినట్టు మాట్లాడకురా. ఈ కోకిల చాలా మంచిది తెలుసా. అస్సలు అహంభావం లేదు. - సంగీత విభావరులు అవీ ఉంటాయి చూడు, వాటిల్లో పాటలు పాడు తూంటుంది. భలే వాయిస్‌లే. చక్కగా మిలమిల లాడే కళ్లూ, కమ్మటి.."

రాంపండు మామూలు ట్రాక్‌లో పడిపోతున్నాడని తెలిసి అనంత్ భయపడ్డాడు. రాంపండుని ఆపబోయేడు - "సరే, ఇప్పటిదాకా మూడు డజన్ల మంది అమ్మాయిలలో ఈ లక్షణాలు కనబడ్డాయి నీకు. ఇంతకీ పెళ్లి నిజంగా కుదిరినట్టేనా? లేక.."




"నువ్వు తలచుకుంటే కుదిరినట్టే." అన్నాడు రాంపండు లౌక్యంగా.

"మధ్యలో నేనెక్కణ్ణుంచి వచ్చాను?" అనంత్ తికమక పడ్డాడు.

రాంపండు వివరించాడు - కోకిలకు రాంపండు నచ్చాడట. కానీ చిన్న చిన్న అభ్యంతరాలున్నాయిట. కోకిల చాలా సీరియస్ మనిషట. ప్రాక్టికల్ జోక్స్ వేసేవాళ్లని అసహ్యించుకుంటుందిట. రాంపండు ప్రాక్టికల్ జోక్స్ వేస్తాడని ఎవరో చెప్పారట. పైగా ఫలానా ఊళ్లో ఫలానా

రోజున అనంత్ తలకింద ఐసుదిండు పెట్టి ప్రాక్టికల్ జోక్ వేశాడు. కావాలంటే చెక్ చేసుకో. అని కూడా చెప్పారట. అంది నిజమో కాదో తెలుసుకుందామని అనంత్ ఇంటికి రాబోతోందట.

"ఒరేయ్, నా కథకు ముగింపు నీ చేతిలో ఉంది. నన్నో ఇంటివాణ్ణి చేసి ఈ కథ ముగిస్తావో, ఇలా సాగదీస్తావో నువ్వే తేల్చుకోవాలి. ఆ ఐసుదిండు విషయం నిజమేనని చెప్పావో నాకు శాశ్వతంగా టాటా



చెప్పేస్తుంది. అందుకని అదంతా గిట్టని వాళ్లు పుట్టించిన కట్టు కథ అని చెప్పేయి. పెళ్లి చేయడానికి లభించే వెయ్యి అబద్ధాల కోటాలో తక్కిన తొమ్మిది వందల తొంభై తొమ్మిది దాచుకో. ఇవాళ మధ్యాహ్నం నీ ఆహ్వానం మీద మీ ఇంటికి వచ్చి భోజనం చేసేటప్పుడు కోకిల ఆ విషయం ప్రస్తావిస్తే పగలపడి నవ్వేయి. 'జనాలు భలేవాళ్లే, ఎలాటెలాటి కథలు పుట్టిస్తారో', అందునా అతి సీరియస్ మనిషైన రాంపండు మీదనా!?' అనే వ్యాఖ్య కూడా జోడించు." రాంపండు బతిమాలు కున్నాడు.

"ఈ భోజనానికి నేనెప్పుడు ఆహ్వానించానుట?" మర్యాదగానే అడిగాడు అనంత్.

"నో ఫార్మాలిటీస్ మై డియర్. నేను అలాటివేవీ పెట్టుకోను. ఒంటి గంటన్నర కల్లా మేం ఇద్దరం వచ్చేస్తాం." హామీ ఇచ్చి రాంపండు పారిపోయాడు.

అనంత్ నిట్టూర్చి అచలపతి కేసి చూశాడు. "అచలపతీ, చూశావా విధివిలాసం! వీడి ప్రాక్టికల్ జోక్స్‌కి గురి కావడమే కాకుండా వీడు అతి గంభీరమైన మనిషినీ, సోక్రటీసుకి బాబనీ కాన్వాస్ చెయ్యాలట. పైగా వాడి ప్రియురాళ్లందరినీ పీకలదాకా మేపాలట. ఖర్మ!"

"జీవితమే అంత సర్!" అన్నాడు అచలపతి.

"నిజం. నిజం. కరెక్టుగా చెప్పావ్. అవునూ, ట్రేలో ఏమిటవి?"

"వేయించిన రొయ్యలు సర్."

అనంత్ ఫిలాసఫించాడు. "తరచి చూస్తే పాపం రొయ్యలక్కూడా వాటి రొయ్య

కష్టాలుంటాయి. ఏమంటావ్?"

అచలపతి కాదనలేదు. "ఉండవచ్చు సర్."

"అంటే నా ఉద్దేశ్యం - ఇలా వేయించబడడమే కాకుండా తక్కిన, ఇతర కష్టాలు కూడా నన్నమాట"

"తక్కిన ఇతర కష్టాలా సర్..?"

"అవును, ఇతర తక్కిన కష్టాలు"

"ఓకే సర్. నాకు సెలవిప్పిస్తే లంచ్ ఏర్పాట్లు చేస్తాను." అనంత్ ఫిలసాఫికల్ మూడ్ చూసి అచలపతి పారిపోయాడు.

***

లంచ్ తర్వాత కోకిలను ఆటో ఎక్కించి రాంపండు లోపలకు పరిగెట్టుకు వచ్చాడు - 'నేను చెప్పినది నిజమే కదూ, ఆమె భూలోకం మీద నడయాడే గంధర్వ కన్య కదూ" అని అడిగి చూశాడు.

"తక్కిన విషయాల మాట ఎలాగున్నా పాట మాత్రం ఆదరగొట్టేసింది. చూరుమీదనుంచి పెచ్చులింకా ఊడిపడుతూనే ఉన్నాయి!"

"నీ జోకులకేం గానీ ఏమైతేనేం ఓ అబద్ధం చెప్పి నా పెళ్లి కాపాడావు. ఋణం ఉంచుకోను. నువ్వు పెళ్లి చేసుకుందామనుకున్నప్పుడు చెప్పు. నువ్వు తెలివైనవాడివని అబద్ధం చెప్పి నిన్నూ ఓ ఇంటివాణ్ని.." అంటూ రాంపండు టేబుల్ మీద ఉన్న గ్లాసులోంచి విస్కీ ఓ గుక్క నోట్లో పోసుకున్నాడు.

"అదేమిట్రా, ఇందాకా ఆ అమ్మాయి ఎదురుగుండా విస్కీ వద్దనేశావ్!"

"అవును, విస్కీ తాగడం గురించి ఆ అమ్మాయి అభిప్రాయాలు పూర్తిగా తెలియకుండా రిస్కు తీసుకోలేం కదా. ప్రస్తుతం తనని ఇంప్రెస్ చేసే ప్రాసెస్‌లో ఓ ప్లాను వేశాను. మన గుర్నాధం గాడి పాటల ప్రోగ్రాంలో తనచేత పాడిస్తున్నాను. ఈ లోపున ఇంప్రెషన్ పాడుచేసుకోవడం ఎందుకు? గుర్నాధం గాడి ప్రోగ్రాం సంగతి విన్నావుగా?"

వినకపోవడమేం? తను చేపట్టిన సాంఘికసేవా కార్యక్రమాల గురించి గుర్నాధం అనంత్‌క్కూడా చెప్పాడు. ఊళ్లో వాడుండే లొకాలిటీలో ఉన్నవాళ్లందరూ కూలీనాలీ చేసుకునే మొరటు మనుష్యులే. కూరలమ్మే వాళ్లల్లోనూ, చేపలమ్మేవాళ్లలోనూ, మాంసం కొట్టేవాళ్లలోనూ కూడా కళాహృదయం ఉందని నిరూపించడానికి గుర్నాధం ఓ క్లబ్బుపెట్టి పుస్తకాలిచ్చి చదవమనడం, శాస్త్రీయ సంగీతం లాటివి వినమనడం చేస్తున్నాడు. స్కూలుకు వెళ్లేందుకు మొరాయించే పిల్లల్లా వాళ్లు కాస్సేపు మారాం చేసినా చివరికి గుర్నాధం మాట కొట్టేయలేక ఆ కార్యక్రమాలకు హాజరయి, తాము సంస్కారం నేర్చుకున్నామని అతనికి ధైర్యం చెబుతూ ఉంటారు. ఆ కార్యక్రమాలకు గుర్నాధం అనంత్ దగ్గర అప్పుడప్పుడు విరాళాలు వసూలు చేస్తూ ఉంటాడు కూడా. వారం రోజుల తర్వాత జరగపోయే ప్రోగ్రాంలో కోకిల చేత ఓ పాట పాడిస్తాడట. అంతకంటె దారుణం - తను కూడా ఓ పాట పాడతాడట! మధ్యలో అదెందుకురా? అనడిగాడు అనంత్.

"నీకు తెలియదులే. నేను పాడబోయే పాట వింటే నా హృదయంలో చాలా లోతులూ, లోయలూ ఉన్నాయని తెలుస్తుందన్న మాట. వాటి గురించి కోకిలకు ఇంకా ఏమీ తెలియదు. అటువంటివి వున్నాయని అనుమానం కూడా లేదు తనకి ఇప్పటిదాకా. కానీ నా పాట విన్నాక ఆ స్థానిక

రౌడీలందరూ కరిగి, కళ్లు తుడుచుకుంటూ ఉంటే అప్పుడు తెలిసొస్తుంది ఆమెకి - 'ఈ రాంపండు గాడికి చాలా ఉదాత్తమైన భావాలు, లోతైన అనుభూతులు ఉన్నాయి' అని ఆ పాట కూడా నువ్వు పాడే జూలాయి, ఆకతాయి పాటల్లాటిది కాదు. చాలా భావగర్భితమైన భావగీతం లాటిది. నీవు విన్నావో, లేదో?"

అనంత్ కెవ్వుమన్నాడు. "కొంపదీసి నువ్వు 'మళ్లీ మళ్లీ పాడుతా, మళ్లి మనసు..' పాడటం లేదు కదా!

"కొంపదీయటం లేదు. ఖచ్చితంగా అదే పాట పాడుతున్నాను." అనంత్‌కు కూడా ఖచ్చితమైన అభిప్రాయం ఉంది - అలాటి పాట రాంపండు లాటివాళ్లు పాడకూడదని. అంటే తనలాటి వాళ్లు పాడవచ్చని కాదు. అయినా తనూ పాడవలసి వచ్చింది. ఆ సందర్భం ఇలా వచ్చింది-

రాంపండు వెళ్లిన కాసేపటికి మాంకాళి అత్తయ్య వచ్చింది. వీణాపాణి తల్లి తన ఫ్రెండు. రాంపండు వీణాపాణిని వదిలేసి ఇంకోదాని వెంట పడుతున్నాడని విని వాడికి బుద్ధి చెబుదామని వచ్చింది. కాస్సేపటి క్రితమే రాంపండుకి అనంత్ లంచ్ ఇచ్చాడని విని మండిపడింది.

"వాడి సూప్‌లో ఇంత విషం కలపాల్సింది నువ్వు." అంది కసిగా.

"వాడు సూప్ తీసుకోలేదులే. ఆ కోకిల కళ్లలోని అమృతాన్ని జుర్రేస్తూ తన దాహాన్ని తీర్చుకున్నాడు. వదిలేయ్. ఇదిగో అచలపతీ, అత్తయ్య సమస్య విన్నావు కదా. రాంపండుని, కోకిలను విడగొట్టే ఉపాయం ఏదైనా చెప్పు." అన్నాడు అనంత్.

అచలపతి తలవూపాడు. "మేడమ్, ఉదహరించబడిన పరిస్థితులలో, మొట్టమొదటిగా మనం పరిగణనలోకి తీసుకోవలసినది ఆ వ్యక్తి యొక్క మనోవిశ్లేషణ."

"వ్యక్తి యొక్క ... ఏమిటది?" అంది మాంకాళి అత్తయ్య కంగారుపడి.

"మనోవిశ్లేషణ" అచలపతి జవాబు.

అనంత్ కలగజేసుకున్నాడు. "అర్థం కాలేదా అత్తయ్యా, మనోవిశ్లేషణ అన్నమాట! అవునూ, అచలపతీ, ఈ మనోవిశ్లేషణ అంటే అర్థం ఏమిటోయ్?"

"అంటే పరిశీలనలలో ఉన్న వ్యక్తుల యొక్క నైసర్గిక స్వభావము, మానసిక స్థితి అన్నమాట సర్"

"అంటే వాళ్ల తత్త్వం అన్నమాట"

"అలా కూడా అనచ్చండి."

అత్తయ్య ఇద్దరికేసి అదోలా చూసింది. "ఒరే అనంతూ, మీరిద్దరూ మాత్రమే ఉన్నప్పుడు కూడా అతనిలాగే మాట్లాడతాడా?" అని అడిగింది.

"ఒక్కోసారి. ఒక్కోసారి ఇలా మాట్లాడడు



కూడా. అంటే కొన్ని సార్లు మామూలుగా మాట్లాడతాడు. కొన్నిసార్లు మామూలుగా మాట్లాడడు అన్నమాట. అర్థమయ్యింది కదూ. అచలపతీ, నువ్వు ముందుకు సాగిపో!"

"సరే సర్, కోకిల మేడమ్ నా పరిశీలనలో ఉన్న సమయంలో నాపై గాఢంగా వేసిన ముద్ర ఏమిటంటే - ఆమెది కఠినమైన స్వభావం. తప్పులు క్షమించలేని తత్త్వం. నా మనోఫలకంలో రూపుదిద్దుకున్న ఆమె వ్యక్తిత్వం విజయాన్ని హర్షించగలదు కానీ అపజయాన్ని సహించలేదు

బహుశా మీరూ గమనించేవుంటారు - రాంపండు సార్ తన ప్లేట్‌లోంచి ఫోర్క్‌తో ఆమె ప్లేటులోకి నూడుల్స్ కిందపడకుండా వేయబోయి రెండుసార్లు విఫలమయినప్పుడు ఆమె చూసిన చూపు!"

"ఓ గుర్తుంది! రాంపండు గాణ్ని విదిలించి పారేసింది. మీకు చేతకాకపోతే నాకివ్వండి గానీ కిందామీదా పొయ్యవద్దు అంది కూడా."

"సరిగ్గా వర్ణించారు సర్."

మధ్యలో అత్తయ్య కలగజేసుకుంది. "ఆగండాగండి. నా కర్థమయినంత వరకూ మీ ఇద్దరూ కలిసి మాట్లాడుకొన్నదాని భావమేమిటంటే రాంపండు కోకిల ప్లేటులోకి నూడుల్స్ వేయడానికి ప్రయత్నిస్తూ పోతే, చివరికి ఆమెకి ప్రాణం విసిగి 'నాకూ నూడిల్సూ వద్దు, నువ్వూ వద్దు వెళ్లిరా నాయనా' అంటుంది. అంతేనా?"

"మేడమ్, కోకిల గారి దయారాహిత్యానికి ఓ చిన్న ఉదాహరణగా మాత్రమే నూడిల్స్ ఉదంతం చెప్పాను కానీ.." అని అచలపతి అంటూండగానే అనంత్ ఎగిరి గంతేశాడు. "దయారాహిత్యం! అబ్బ ఇందాకటినుంచీ అదే మాట గురించి వెతుక్కుంటున్నానయ్యా! భలే చెప్పావు సుమా!"

అత్తయ్య అనంత్‌కేసి కోరగా చూస్తూ ఉండగానే అచలపతి తన ఐడియా వివరించాడు - 'సర్, రాంపండు గారు పదిమంది ఎదుట అపహాస్యం పాలయితే, అది కోకిల మేడమ్ కంటపడితే ఆమెకు ఆయనపై గల అభిమానం ఫ్లాష్‌బ్యాక్ అయిపోతుంది. ఉదాహరణకి మంగళవారం నాటి సాయంత్రం గుర్నాధం ఫంక్షన్‌లో రాంపండు ప్రేక్షకులను మెప్పించ లేకపోతే.."

అనంత్‌కి జ్ఞానోదయం అయింది. "అంటే జనాలు వాణ్ని మోసేస్తే వాడి ప్రేమాయణం అంతటితో సరి అంటావ్."

"అలా జరక్కపోతేనే ఆశ్చర్యపడాలి సర్."

అనంత్ కాస్త ఆలోచించాడు. "రాంపండు గాడు సరిగ్గా పాట పాడలేక కంపు కొట్టిస్తాడనుకో. కానీ ఆ బండవెధవలకి వాడి పాట నచ్చి చప్పట్లు కొడితే..? ఛాన్సు తీసుకోకూడదు."

"సర్, మనం అదృష్టాన్నే నమ్ముకుని కూచోనక్కరలేదు. గుర్నాధానికి చెప్పి రాంపండు పాటకు ముందు "మళ్లీ మళ్లీ పాడుతా" పాటను మీరు పాడేశారనుకోండి. రాంపండు పాట ఆరంభించే సమయానికి ఆ పాట మీద సభికులకు మోజు పోయి వాళ్ల అభిప్రాయాలను కాస్త ఘాటుగా వ్యక్తం చేసే అవకాశం ఉంది.

అత్తయ్య వెంటనే అరిచింది. "నీ బుర్ర అమోఘమోయ్, అచలపతీ" అని. అనంతూ అరిచాడు - "నీకు మతిపోయిందోయ్, పోయి పోయి నేను స్టేజిమీద పాట పాడడమేమిటి?" అని.



కానీ అత్తయ్య మాట వినిపించుకోలేదు. "అనంతూ, నువ్వు పాడబోతున్నావ్. లేకపోతే నేను శాపం ఇస్తానంతే!" అనేసింది. గుర్నాధానికి ఫోన్ చేయడం, అరగంటలోగా ప్రోగ్రాం ఫిక్స్ అయి పోవడం జరిగింది. మంగళవారం నాటి ప్రోగ్రాంలో ఇంటర్వెల్ తర్వాత అనంత్‌పాట, తర్వాత రాంపండుది. ఆ తర్వాత ప్రఖ్యాత గాయని కోకిల పాట!

***

మంగళవారం హాలు దగ్గరికి చేరేసరికి అన్నిటికీ తెగించే వచ్చాననుకున్న అనంత్ కూడా ఖంగు తిన్నాడు. సంగీతామృతంలో ఓలలాడడానికి అక్కడ చేరిన రసికశిఖామణుల పెర్సనాలిటీలు చూడగానే టాక్సీ పట్టుకుని వెనక్కి పారిపోయి నాగరీకుల మధ్య పడదామనిపించింది. నిప్పులో దూకే శలభం ఫీలింగు కలుగుతూండగానే - "హాలు బాగా నిండింది కదా సార్" అంది అతని మోచేయి.

తిరిగి చూస్తే అచలపతి. "నువ్వు ప్రోగ్రాం మొదటినుండీ ఉన్నట్టున్నావు - ఎవణ్నైనా మోసేశారా?" అని అడిగాడు.

"ఇంకా ఎవర్నీ.. లేదు సార్."

"అంటే నాతోనే ఆరంభమవుతుందన్నమాట"

"అబ్బే, అదేం కాదండి."

అనంత్‌కు కోపం వచ్చింది - "నీ ప్లాను ప్రకారం అంతా జరుగుతుందనుకుంటున్నావేమో! దాంట్లో ఓ పెద్ద లొసుగు ఉంది తెలుసా?"

"లొసుగా?"

"అవును. గట్టిగా మాట్లాడితే లొసుగున్నర! నేను పాడడం విన్నాక రాంపండు ఆ పాటే ఎందుకు పాడతాడు? పబ్లిక్‌మూడ్ గమనించి రంగం విడిచి పారిపోతాడు."

"రాంపండు గారికి మీ పాట గురించి తెలియడానికి అవకాశం లేదు సర్. నా సలహామేరకు ఆయన రోడ్డుకు అటుసైడున్న బార్‌లో కాస్త మందు పుచ్చుకుంటున్నారు. ఈ ప్రోగ్రాంలో ఆయన వంతు రాగానే నేను వెళ్లి చెప్పివస్తాను." అన్నాడు అచలపతి.

"ఓహో, ఇదో ఏర్పాటా?"

"అవునుసార్, మీరేమనుకోకపోతే, రోడ్డుకు ఇటుసైడున్న బార్‌లో మీరూ అదే పని చేయవచ్చు. స్టేజీ ఎక్కబోయేముందు కలిగే నెర్వస్‌నెస్ పారద్రోలడానికి..."

అచలపతి చెప్పిన విస్కీ చికిత్స అద్భుతంగా పనిచేసింది. ప్రపంచం యెడల అనంత్ దృక్పథాన్ని మార్చివేసింది. మోకాళ్లు పట్టుదప్పడం మానేశాయి. చేతులు వణకడం మానేసాయి. నాలుక ఫ్రీగా ఆడటం మొదలు పెట్టింది. వెన్నెముక దన్నుగా నిలిచింది. లోకంలో ఎటువంటి గూండా ఆడియన్స్‌నైనా ఎదుర్కోవడానికి ధైర్యం వచ్చింది. కాస్సేపట్లో అనంత్ స్టేజిమీద, ఓ లక్షకళ్లు అతని మీద. దేవుడి మీద భారం వేసి, గట్టిగా ఊపిరి పీల్చి, "మళ్లీ మళ్లీ పాడుతా.." పాట అందు కున్నాడు.

తరువాత ఏమయిందో అనంత్‌కు అంత స్పష్టంగా గుర్తులేదు. అంతా అలుక్కుపోయిన ఫీలింగ్. ఏదో గొణుగుడు, ఏదో సణుగుడు మాత్రం పాడుతున్నంతసేపూ వినబడింది. ప్రేక్షకశ్రోతలు అత్యుత్సాహంతో అతని పాటను బృందగానంగా మారుద్దామనుకున్నట్టు అనిపించిందతనికి. ఆ ఊపుతో ఒంట్లో శక్తినంతా గొంతులోకి తెచ్చుకుని అలా, అలా తారస్థాయికి వెళ్లి అలా పాడుతూనే తెర పక్కకి తప్పుకున్నాడు. పాట అయిపోయాక వంగి నమస్కారాలు పెట్టి, ప్రేక్షకుల అభినందనాలు స్వీకరించే ఉద్దేశ్యం ఎంతమాత్రం లేదతనికి. ఏమో, తన వీపు చూస్తే ఏ తుంటరికి ఏం బుద్ధి పుడుతుందో! అని అతని భయం.

స్టేజి దిగి అచలపతి వద్దకు రాగానే డిక్లేర్ చేసేశాడు - "ఇక నేను జన్మలో స్టేజి ఎక్కడం జరగదు. ఇకమీద ఎవరైనా నా పాట వినాలనుకుంటే నా బాత్‌రూమ్ బయట నిలబడి చెవి తలుపు కాన్చాల్సిందే! ఇవాళ కూడా పాట చివరికి వచ్చేసరికి శ్రోతలు కాస్త చికాకు పడుతున్నట్లు అనిపించిందెందుకో. బహుశా నా భ్రమోనేమో - మోసేయడానికి బోయీలు 'బొహోం, బొహోం' అంటున్న ఫీలింగు కలిగింది. అంతా వట్టి ఊహే కదూ!"

"ప్రేక్షకులు అంత సంతోషంగా లేనట్టు నాకూ అనిపించింది సర్. అదెంత గొప్పపాటైనా జనాలకి మొహం మొత్తినట్టనిపించింది నాకు."

"అదేమిటి?"

"నేను ముందే చెప్పి వుండాల్సింది సర్. ఆ పాట అప్పటికే మీరొచ్చేముందు ఓ ఇద్దరు పాడారండి."

"అమ్మనాయనోయ్.."

"..ఒక అమ్మాయి. ఒక అబ్బాయి. ఒకరి తర్వాత ఒకరు. అది చాలా ప్రజాదరణ పొందిన గీతం కదా సర్." అనంత్ అచలపతికేసి నోరు తెరిచి చూస్తూ ఉండిపోయేడు. అన్నీ తెలిసి తన యజమానిని మొసళ్లకు ఆహారంగా వేయడానికి కూడా వెనకాడని మనిషన్నమాట! ప్రభుభక్తి లాటి మాటలు రాజుల కాలంలోనే అంతరించాయా? అని అనుకుంటూండగానే రాంపండు స్టేజెక్కడం కనబడింది. బార్ నుండి వచ్చిన రాంపండు బార్ నుండి వచ్చినట్టే ఉన్నాడు. ఆడియన్స్‌లో వాడి ఫ్రెండ్స్ ఉన్నారేమో చప్పట్లు కొట్టి కేకలు వేశారు. రాంపండు మొహం ఇంతయింది. అయి, అయి తలకాయ వెనకభాగం తగ్గిపోయేటంతయింది. ఆనందంతో తేలిపోతున్న మనిషి నేలమీద ఎంత బాగా నిలబడగలడో అంత బాగా నిలబడి, తన ప్రజలనుండి వందనాలు, అభివందనలు స్వీకరించే రాజుగారి స్టయిల్లో చేతులూపాడు. ఆర్కెస్ట్రా వాళ్లకు ఏ పాట వాయించాలో చెబుతూండగానే వాళ్లూ తెల్లబోయారు. కానీ అదేమీ పట్టించుకోకుండా రాంపండు బెలూన్లా ఉబ్బి, చేతులు జోడించి, కళ్లు గిరగిరా పైకి తిప్పి వాసాలకేసి చూసి పాట లంకించుకున్నాడు. 'మళ్లీ మళ్లీ పాడతాను, మళ్లి మనసు నాదేనని.."

హాల్లో ఉన్న జనాలకి రిమ్మ తిరిగి పోయుంటుంది. వాళ్లు ఏం చెయ్యాలో ఒక నిర్ణయానికి రావడానికి కాస్త టైము పట్టింది. మొత్తమంతా అయిన తర్వాత గుర్తు చేసుకుంటే అనంత్‌కు ఒక విషయం మాత్రం బాగా నాటుకుపోయింది - రాంపండు పల్లవి పూర్తి చేసేదాకా సభలో కలకలం కూడా లేదు. ఆ తర్వాతే ప్రజల్లో చైతన్యం రగిలింది. 'జనంలో చైతన్యం రావాలి. రావాలి' అంటాం గానీ అది వస్తే ఎలా ఉంటుందో మనం ఊహించలేం. అవాళ అనంత్‌కి అది చూసే సందర్భం పడింది. ఫ్రెంచి

విప్లవం ఎలా జరిగి ఉంటుందో ఓ అయిడియా వచ్చిందతనికి. కుస్తీపోటీల్లో రిఫరీ అన్యాయం చేసినప్పుడు ప్రేక్షకులు చేసే శబ్దం లాటిది హాలు అన్ని మూలలనుండీ బయలుదేరి హాలంతా వ్యాపించింది. ఆ తర్వాత మాటలతో సరిపెట్టకుండా కార్యక్రమంలో కూరగాయల అంశం కూడా ప్రవేశపెట్టారు కొంతమంది.

మనసు గారడీలు చేస్తూంటుంది. ఎందుకో తెలియదు కానీ రాంపండు మీద మొదటపడింది బంగాళాదుంప అనే ఒక ఊహ అనంత్ మనస్సులో తిష్ఠవేసుకుని ఉండిపోయింది. నిజానికి మొదట పడినది అరటిపండు! అరటిపండు విసిరిన తీరు చూస్తే నచ్చని కళాకారుణ్ని ఎలా సత్కరించాలో, ఏ కూరగాయ ఎటువంటి శక్తి కలిగి ఉంటుందో తెలిసి చిన్నప్పటి నుండీ బాగా తర్ఫీదు పొందినవాళ్లనిపించింది అనంత్‌కి. ఆ అరటిపండు రాంపండు చొక్కామీద పడగానే బంగాళాదుంప కంటె అది ఎంత కళాత్మక మైనదో అనంత్‌కి తెలిసివచ్చింది. అంతమాత్రాన బంగాళాదుంప భక్తులను తక్కువగా అంచనా వేయడానికి లేదు. బంగాళా దుంప విసిరేవాళ్లలోనూ అతనికి కళాభిరుచిగల ముఖాలు కనబడ్డాయి.

రాంపండు మీద దీనిప్రభావం చెప్పుకోదగ్గది. కళ్లు ఉబ్బాయి. జుట్టు నిలబడింది. అయినా నోరుమాత్రం తెరుచుకుంటూ, మూతబడుతూ దానంతట అదే పాటపాడుతూ పోయింది. హఠాత్తుగా స్పృహలోకి వచ్చి పక్కకు పారిపోయే టప్పుడు మాత్రం ఫుట్‌బాల్‌కి 'హెడ్' ఇచ్చినట్టు ఓ పెద్ద బంగాళాదుంపకు హెడ్డిచ్చి వెళ్లిపోయాడు.

జనం చల్లబడ్డాక అనంత్ అన్నాడు - "అచలపతీ, రాంపండు గురించి బాధపడకు. ఆపరేషన్ చేసేటప్పుడు కత్తి ఉపయోగించడానికి వెరవకూడదు. ఇది తన స్వంత కళ్లతో చూశాక కోకిల 'రాంపండూ, నీకూ నాకూ రాంరాం' అని ఉత్తరం రాయకపోతే నన్నడుగు.'

అచలపతి ఔనని సమాధానం చెపుతూండ గానే గుర్నాథం స్టేజిమీదకు వచ్చాడు. "ప్రేక్షకులు మన్నించాలి. తర్వాత పాడవలసిన కోకిల గారు దారిలో కారు చెడిపోవడం వలన కాస్త ఆలస్యంగా వస్తానని ఇప్పుడే ఫోన్ చేశారు. ఈ లోపున మన మిత్రుడు సూరిబాబు.."

అనంత్ పడిపోబోయి అచలపతి భుజం పట్టుకుని తమాయించుకున్నాడు. "విన్నావా, ఆ అమ్మాయి రానే లేదుట. నేను ప్రాణాలకు తెగించి చేసిన త్యాగం వేస్టయిపోయింది. రాంపండు పరాభవం ఆమె కంటబడనే లేదు. ఇక అత్తయ్యకు మొహం ఎలా చూపించగలను? ఇంకోసారి బార్‌కు వెళ్లి అక్కణ్నుంచి ఇంటికి వెళ్లిపోతాను. కావాలంటే నువ్వు తర్వాత రా." అని వెళ్లిపోయాడు.

***

రాత్రి పదిన్నర అయివుంటుంది. రాంపండు వచ్చాడు. మృత్యుముఖంలోంచి తప్పించుకుని వచ్చినట్టున్నాడు. ఎడం కన్ను 'వాయనా? వద్దా?' అని ఆలోచిస్తోంది.

"గుర్నాథం ప్రోగ్రాంకు నువ్వు వచ్చినట్టు లేదే! నేను పాటపాడి వచ్చాను. అదిరిపోయింది. పాట విని ఎవరూ తేరుకోలేకపోయారు. కంటతడి పెట్టనివారు లేరనుకో" అన్నాడు.

'హరి అబద్ధాల కోరా!' అనుకుని "ఇంతకీ మీ కోకిల ఏమందేమిటి?" అన్నాడు అనంత్.

"చాలా సంతోషించిందనుకో. కానీ ఆలోచించి చూస్తే తనకీ, నాకూ కొన్ని విషయాల్లో పొత్తు కుదరదేమో ననిపిస్తోంది. వీణాపాణియే బెటరనిపిస్తోంది. రేపే వాళ్ల ఊరు వెళ్లాలి. నీ దగ్గర కాస్త చిల్లరేమైనా ఉంటే..?" అన్నాడు రాంపండు.

'హమ్మయ్య, అత్తయ్య దగ్గిర మాట దక్కితే చిల్లరేమిటి? నోట్లే ఇస్తాననుకుంటూ అనంత్ డబ్బు ఇవ్వడం, క్షణంలో రాంపండు మాయం కావడం, ఆ తర్వాత ఐదు నిమిషాలకు అచలపతి ఇంటికి తిరిగిరావడం చకచక జరిగాయి.

"అచలపతీ విన్నావా? రాంపండుకి, కోకిలకు చెడిందట!.. అదేమిటి? నువ్వు ఆశ్చర్యపడినట్టు లేదే!" అన్నాడు అనంత్.

"కోకిల మేడమ్ రాంపండు గారి ఎడమ చెంప వాయగొట్టినప్పుడే అలాటిదేదో జరుగుతుందని పించింది సర్"

"కొట్టడమా? ఆమెకేం వచ్చింది?"

"తన పాటకు జనం ప్రతిస్పందించిన విధానం వల్ల ఆవిడ మనసు చెదిరినట్లయింది సర్."

"చచ్చాం పో, కొంపదీసి జనాలు ఆమెను కూడా మోసేయలేదు కదా!?"

"అలాటిదే జరిగింది సార్."

"అదేమిటయ్యా, తనది బ్రహ్మాండమైన వాయిస్ అయితేనూ."

"కరెక్టేనండి. కానీ ఆమె ఎన్నుకున్న పాట ప్రజలకు నచ్చలేదు లాగుంది."

అనంత్‌కు అనుమానం వచ్చింది. "కొంపదీసి.. కోకిల కూడా 'మళ్లీ మళ్లీ పాడుతాను..' పాట పాడలేదు కదా!"

"ఎస్‌సర్, అదే పాట పాడారు. అంతే కాకుండా, అదేమిటో గానీ, ఓ పెద్ద టెడ్డీబేర్ స్టేజిమీదకు తెచ్చి దాన్ని ఉద్దేశించి మరీ పాడారు. జనం ఆ బొమ్మ చూసి మిమిక్రీ చేస్తారని ఆశపెట్టుకున్నారు లాగుంది. మళ్లీ 'మళ్లీ మళ్లీ' పాట పాడడం వారిని మండించినట్టుంది.

"ఇకచాలు బాబూ, నాకు అర్థం అయి పోయింది. జనం ఎలా రియాక్ట్ అయివుంటారో నేనూహించగలను. విధివిలాసం కాకపోతే తను కూడా ఇదే పాట ఎంచుకోవడం ఏమిటి చెప్పు." అని వాపోయాడు అనంత్.

"ఈ విషయంలో విధికి తక్కువ పాత్రే ఉందండి. నేను కాస్త చొరవ తీసుకోవలసి వచ్చింది. కోకిలమేడమ్ కారులోంచి దిగగానే రాంపండు గారు ఈ పాటే పాడమని తన రిక్వెస్టుగా చెప్పమన్నారని చెప్పానండి. రాంపండు గారు ఆ టైములో బార్‌లో సెకండ్ రౌండ్‌కి వెళ్లివున్నారండి. ప్రేక్షకుల గొడవ భరించలేక కోకిల మేడమ్ పాట మధ్యలో ఆపి వచ్చేసరికి రాంపండు గారు ఎదురుగా కనబడ్డారండి. ఆవిణ్ని చూసి పలకరింపుగా నవ్వారండి. దాంతో ఇది రాంపండు గారు చేసిన ప్రాక్టికల్‌జోక్ అని ఆవిడ భావించి, ఎడమ చెంపమీద.. ఈ సమాచారం చాలా సర్?" అన్నాడు అచలపతి.

"ఇక చెప్పనక్కరలేదు మహాప్రభో చాలు. ఏమైతేనేం మా అత్తయ్య శాపం బారినుండి నన్ను రక్షించావ్. చాలు గుడ్‌నైట్" అన్నాడు అనంత్ ఆనందంగా.

- ఎమ్బీయస్ ప్రసాద్

**(పిజి ఉడ్‌హవుస్ రాసిన 'జీవ్స్ అండ్ సాంగ్ ఆఫ్ సాంగ్స్' అనే కథ అధారంగా)**





# లలిత సంగీతం

## ఎవరేమన్నా ఏమనుకున్నా చంద్రా ఆగక



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

సాకి: జాబిలీ నీగాథ ఒక వింతగాథ
నీ వెలుగులోనే తొలగు మా బాధ

ప॥ ఎవరేమన్నా ఏమనుకున్నా చంద్రా ఆగకు-నీ
మదిలో నమ్మిన దానిని నీవు
చేయుట మానకు

1.చ॥ నినుచూడగనే కమల కాంతలు రుసరుసలాడినా
నినుగని కలువ కన్నెల మనసు మిసమిసలాడినా
వెన్నెలలో నవ ప్రేమికులెంతో సంతోషించినా
వెలుగును చూసి కన్నపుదొంగలు కడు దూషించినా ॥ఎవరేమన్నా॥

2.చ॥ తారాసతిమది దొంగిలించితే మునులూ దేవతలూ
నేరాన్నేదో చేశావని నిను నిందించారోయీ
హాలాహలమును మ్రింగిన శివునకు చలువ కూర్చగానే
చాలా యోగ్యుడవని నినువారే సన్నుతించిరోయీ ॥ఎవరేమన్నా॥

| | | |
|---|---|---|
| రచన | : | కీ॥శే॥ ఆరుద్ర |
| గానం, సంగీతం | : | కీ॥శే॥మల్లిక్ |
| రాగం | : | అభేరి |
| | | -భీంపలాస్ (హిందుస్తాని సం॥) |
| | | -కహరువా (హిందుస్తాని సం॥) |
| తాళం | : | ఆది(కర్ణాటక సం॥) |
| ఆరోహణ | : | సగమపనిస |
| అవరోహణ | : | సనిదపమగరిస |

-షడ్జము, సాధారణగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, కైశికి నిషాదం- ఆరోహణలోను

-కైశికి నిషాదం, చతుశృతి దైవతం, పంచమం, శుద్ధమధ్యమం, సాధారణగాంధారం, చతుశృతి రిషభం, షడ్జము- అవరోహణలోను వుండే యీరాగంలోని స్వరాలు.

కర్ణాటక సంగీతంలో అభేరి చాలా ప్రఖ్యాతి పొందిన రాగం. హిందుస్తాని సంగీతంలో కూడా భీంపలాస్ అనే పేరుతో పిలువబడే యీ రాగం అందరికీ సుపరిచితమైనదే. 'నగుమోముగనలేని' అనే త్యాగరాజ కీర్తన అమిత ప్రాచుర్యాన్ని పొందినది. లలిత సంగీతంలో కూడా చాలా విరివిగా వాడబడే రాగాలలో అభేరికూడా ఒకటి. ఆకాశవాణిలోను, చలనచిత్రాలలోను కూడా యీ రాగంలో మనకెన్నో పాటలు ప్రతిరోజూ వినిపిస్తూనే వుంటాయి.

ఎదుటివ్యక్తుల బాధలు తొలగించ ప్రయత్నించే ఉత్తములు దారిలో రాళ్ళు వున్నా, ముళ్ళు వున్నా ముందుకే సాగాలిగాని ఆగిపోరాదు. మానవ లోకం స్వార్థ ప్రయోజనాలకోసం ఎదుటివారు చేసే పనిలో దోషాలెన్నటానికి ప్రయత్నం చేస్తుంది. తమ మంచి లోకానికే మంచి, తమ కష్టం లోకానికే నష్టం అనే ప్రవృత్తి గలవారిని గురించి ఉత్తములు ఆలోచించరాదు. వారి అభిప్రాయాలు పరిగణనలోకి తీసుకోకూడదు కూడా. 'కర్మణ్యే వాధి కారస్తే' అంటూ గీతాచార్యుడు బోధించిన స్థితప్రజ్ఞతతో ప్రవర్తించాలంటూ చంద్రుని పరంగా లోకానికి ధ్వనింపచేశారు ఆరుద్ర యీగీతంలో. మల్లిక్ యీగేయానికి కూర్చిన బాణీ ఆయన కంఠంలోనే బాగా జనాదరణ పొందింది.

సాకీ: గామపాసా నిరిసనిదపా.... దానిద <u>పాదప</u> <u>మాపమమా</u> మగా
జాబిలీ . . . . . . . . . . నీ . . గా . . . . . . . ఢ .

మగ గమగ గరిసరిస సా.... రిస సమమమా పపమమగామగ
ఒక విం . త గా . . . . ధ . . . నీ వెలుగులో నే . . . . . .

గగమ గమ గమపని సనిదపా పా.... మగ గామనిప పమమగ
తొలగు మా . జా . . . . . . . . ధా . . . . . . . . . .

గరిసరి సమగరిసా
. . . . . . . . .

ప॥ ; పమాగమా పనిపమ గామా । ; సా, పమా । గపమగ గరిరిస ॥
. ఎవ రే . మ . . . న్నా . । . ఏ . మను । కు . . . న్నా . . ॥

; సా, సని ; గా ; రి । సా ; ; ; । ; ; రిససని ॥
. చం . ద్రు . . ఆ . గ । కు . . . । . . నీ . . ॥

సామా పమమగ గామపాపనిప । పమగమాగగా । గా, మ గామా ॥
మది లో . . . . . న . చ్చిన . । దా . . . . . ని । నా . నే . వు ॥

పానిసాసని పా, గా, రి । సా ; సా, ద । పా, మ గమపా ॥
చే . యుట . . . మా . న । కు . . . । . . . . . . . ॥

॥ ఎవరేమన్నా... పసనిగ సనిపమ । గపమగ గరిరిస । చంద్రుఆగకు ॥
ఏ . . . . . మను । కు . . . న్నా . . ।

1.చ॥ ; నిపా నిసా సాసా <u>రిససా</u> నిస । నిస రిరి రిస । సని సారి ; ॥
. నిను చూ . డ గ నే . . . . । . కమల తాం . । . . త లు . ॥

; పగా గరి రిససని సాసా । రి ; ; రిగ । సరిగరి రిససని ॥
. రుస రుస లా . . . . డి । నా . . . . । . . . . . . . ॥

; గారి గస సా, నిసని । సరిరి సని దా । నిససని దదపా ॥
. నినుగ . ని . తలువ । తే . . . న్నెల । మ . న . సు . . ॥

; పసానిదా పనిపమగామా । గమపని సా, ని । పసా పా ; గ ॥
. మిసమిస లా . . . . డి । నా . . . . . । . . . . నో ॥

మాపసనిదాపనిపమగాగా । మాపసని దా । పనిపమ గామా ॥
. వె . న్నెల లో . . . . న । త త్రే . మి కు । వెం . . . లో . ॥

; పాసపా మాగాగాపా । మా ; ; పమ । గమపమ గాగా ॥
. సం . తో . షిం . చి । నా . . . . । . . . . . నే ॥

; గమాప గా గరిరిస సా ; । ; నిసా ని దా । పనిపమ గామా ॥
. వెలుగును చూ . . . సి । . కే . న్నవు । దాం . . . గలు ॥

; నిపా గా, గరిసా సామగ । రిసా ; ; । సగ <u>మాపమ</u> గమపా ॥
. కడు దూ . షిం . . . చి । నా . . . । . . . . . . . ॥ ఎవరేమన్నా ॥

2వ చరణం కూడా మొదటి చరణం వలె పాడుకోవాలి.



## కీ॥శే॥ మల్లిక్

'మల్లిక్' గా ఆకాశవాణి శ్రోతలకు, దూరదర్శన్ ప్రేక్షకులకు సుపరిచితులైన శ్రీ కందుల మల్లికార్జునరావు సంగీతంలో అభిరుచిగల కుటుంబంలో శ్రీవెంకటాచలం, లక్ష్మీ నరసమ్మ దంపతులకు జన్మించారు. 1921లో మచిలీపట్నంలో జన్మించిన మల్లిక్ పిన్న వయసులోనే శ్రీ క్రోవి సత్యనారాయణ శాస్త్రి గారి కర్ణాటక సంగీతాన్ని అభ్యసించారు. 1941లో ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో స్వరకర్తగా (మ్యూజిక్ కంపోజర్) ఉద్యోగంలో చేరి, ఆనాటి నుండి ఎన్నో గేయాలకు సంగీతం సమకూర్చి శ్రోతల మన్ననలు పొందారు. మద్రాసులో వుండడం చేత తమిళ, మలయాళ భాషలలో కూడా పాటలు పాడారు.

ఆదిలో అన్నమాచార్య సంకీర్తనలను విశేషంగా గానం చేసి ఎంతో ప్రాచుర్యాన్ని కలిగించారు. "అదివో అల్లదివో శ్రీహరివాసము", "తందనానా ఆహి", "గురుతెరిగిన దొంగ

కూగూగూ'' మొదలగు కీర్తనలకు మల్లిక్ గారు కూర్చిన బాణీలు యీ నాటికీ గాయనీ గాయకులు పాడుతూనే వున్నారు. కలకాలం ప్రజలు గుర్తుంచుకునే మనోజ్ఞమైన బాణీలు.

భాగ్యరేఖ, బంగారుపాప, సంసారం, లవకుశ మొదలగు తెలుగు చిత్రాలలో వీరు పాటలు పాడారు. తమిళ సినిమా రంగంలో తొలినేపథ్య గాయకుడు మల్లిక్ గారే. 1972 లో ఆకాశవాణి విజయవాడ కేంద్రానికి బదలీ అయిన వీరు ఆ కేంద్రంలో ఎంతోమంది కవుల లలిత గీతాలకు స్వరరచన చేసి గానం చేశారు.

నృత్య సంగీతంలో వీరికి ఎంతో అనుభవం వున్నది. ప్రఖ్యాత నాట్యాచార్యులు, పద్మభూషణ్ డా॥ వెంపటి చిన సత్యంగారి ట్రూప్‌లో ఎంతోకాలం గాత్ర సహకారాన్ని అందించారు మల్లిక్. ప్రముఖ నర్తకీమణులు. శ్రీమతి రాజసులోచన, పద్మశ్రీ శోభానాయుడు, శ్రీమతి మంజుభార్గవి, చంద్రకళ, కొత్తపల్లి పద్మ, రత్నపాప మొదలగువారి నృత్య ప్రదర్శనలకు నేపథ్యగానం చేశారు. శ్రీనివాస కల్యాణం, చండాలిక, శ్రీకృష్ణపారిజాతం, మోహినీ భస్మాసుర, వాల్మీకి మొదలగు నృత్యరూపకాలకు సంగీతం సమకూర్చారు. 1981లో పదవీ విరమణ గావించిన మల్లిక్ ఆకాశవాణి గాయకుడుగా, సంగీత దర్శకుడుగా "టాప్ గ్రేడ్'' కళా కారులుగా గౌరవాన్ని పొందారు. "మధుర గాయకుడు", "నాదకౌముది'' మొదలగు బిరుదులతో సత్కరించబడిన శ్రీమల్లిక్ సంగీతానికి అపారమైన సేవలందించి 1996లో స్వర్గస్థులైనారు.



**'హాసం' ఫిబ్రవరి 16-28 సంచికలో అభేరిరాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలను పేర్కొనడం జరిగింది.**

**మరికొన్ని చిత్రగీతాలు (అభేరిరాగం ఆధారంగా)**

| | | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | రాగమయీ రావె | జయభేరి | ఘంటసాల | పెండ్యాల |
| 2. | స్వాతంత్ర్యమె నా జన్మ హక్కని చాటండి | ప్రైవేటు రికార్డు | ఘంటసాల | ఘంటసాల |
| 3. | ఓ నెలరాజా వెన్నెల రాజా నీ వన్నెలన్ని చిన్నెలన్ని | భట్టివిక్రమార్క | ఘంటసాల, సుశీల | పెండ్యాల |
| 4. | తలుపుతీయునంతలోనె | ప్రైవేటు రికార్డు | ఆర్.బాలసరస్వతి | సి.ఆర్.సుబ్బరామన్ |

**హిందీ (భీంపలాస్ రాగం ఆధారంగా)**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | దేఖోఓచాంద్ చుప్‌కే కర్‌తాహై క్యాఇషారే | షర్త్ | హేమంతకుమార్, లత | హేమంత్‌కుమార్ |
| 2. | జాయే తోజాయేఁకహాఁ | టాక్సీడ్రైవర్ | తలత్ మహమూద్/లత | ఎస్.డి.బర్మన్ |
| 3. | జల్‌తేహైఁ జిస్ కేలియే | సుజాతా | తలత్ మహమూద్ | ఎస్.డి.బర్మన్ |




**ఇది వ్రతాల సీజను. సినీ నిర్మాణ వ్రతం ఆచరించగోరే వారు సూతుని వద్దకు శౌనకాది మునులవలె వెళితే...? ఆయన చెప్పే 'టెన్ కమాండ్‌మెంట్స్' (దశ ఆదేశాలు) ఎలా ఉంటాయి? రమణ 1958 నాటి రచన ఇది.**

సాంఘిక పౌరాణిక జానపద కథా లక్షణ లక్షితములె పారాంభిక చిత్రములను పేరంబరుగుచు, రెండేసి మూడేసి హీరోళ్లు, పుష్క - లంగా డాన్సులు, రెండర్థంబుల, కొండొకచో మెండర్థంబుల సంభాషణంబులతో నలరారుచు బుష్కలంబుగా ధనమును, అటు బిమ్మట రుణమును గడించుకొన్న అనేక చిత్ర విచిత్రంబులస్రష్టయగు దర్శక నిర్మాత యొకరుండు, దుర్లభుండగు వాడొక నాడొక చిత్రమున కొట్‌డోర్ షూటింగేర్పరచుకొని, వర్షపాతముంజేసియది గాన్నిలు గాగా జేయునది లేక నింట గూర్చుండె. ఇవ్వార్త యొక్కవరి గుప్పుమనగానే వర్ధమాన నిర్మాత లిరువురు, దర్శకులు మరిద్దరు, పంకాలు బన్నిద్దరు బరుగున నేతెంచిరి. నిర్మాతలకు ఈ దర్శకుల వారి నెట్లేని తమ చిత్రమునకు దర్శకత్వము వహింపజేయ సంకల్ప మొదవి వెయిన్నూట పదారులు బజానాకూడ కొని తెచ్చిరి. వారందరూ దర్శకులవారి సన్నిధిని పైకము నుంచి నమస్కరించి-

"హేమా హేమీ! హే! మీ
ధీమా భీమా యదెంత! ధీయెంతదహో!
హే! మా స్వామీ! తామీ
హేమాంజలిదయనుగొనుడు హేరాళముగా"
యని బరిపరి విధముల సంస్తుతించి -
"స్వామిన్! ఈ చలచ్చిత్ర
సీమన్ శ్రీ లక్ష్మిమార్గ
మేమీ? మీవద్ద నెరుగ
మేమీడకు వస్తిమి
మీ మేడకు వస్తిమి".




అల్ల కల్లోలంగా పోటానుపోటీగా ఉన్నట్టి ఈ
చలన చిత్ర పరిశ్రమలో చిత్రము తీసి
ధనమార్జించు అపాయము లేని
ఉపాయమెట్టిది? అందుకు ఏయే
మార్గములను అనుసరించవలను?
దానికేమైన నోములు వ్రతములూ
ఉన్నవా

అని యడిగిరి.
అంతట దర్శక నిర్మాత
నవ్వి, ఈ క్రింది
దశాదేశములను ప్రవచించిరి.

### జాతిరీతుల కతీతము:

వెర్రిబాగుల వారు కొందరు
పేరుమీద యపోహతో
సాంఘికము పౌరాణికమ్మని
చాలచాల శ్రమింతురు
మేటి చిత్రపుకథలవెప్పుడు
దేశకాలాతీతముల్
కాన తెలియుడు దీనినెల్లరు
కనక సాధక చిత్తులై.

### కథలు వ్రాయనేల?:

కథలనెపుడు 'వ్రాయకు' నీ
స్వేచ్ఛను ఎడబాయకు
మొదటవ్రాయనేల
పిదపమార్చనేల.

### 'ఖంగు'మనే సత్యం:

దేవుడనేవాడి కొఱకు దేవులాడబోకు
మార్కెట్‌లో 'లేడం' టే 'ఉన్నా' డనబోకు
'ఓం' కారం 'నోం' కారం కావు మనకు ముఖ్యం
'గీం' కారం - రూపాయం గీ(ం) కారమే నిత్యం -
అదే ఖంగుమనే సత్యం

### ని...... డి....... వి:

నిడివి నేటి చిత్రాలకు బాక్సాఫీస్ ఛత్రం
చదివి చదివి ఆర్గ్యుమెంట్లు చెడకు నువ్వుమాత్రం
పాపాపా డుడుడు గుగుయందున మనదే ముందడుగు
ఉడుగు శంక; కాపోతే నా సలహా అడుగు.

## అమావాస్యను ఆపకు:

అయ్యవచ్చేదాకా అమావాస్యని ఆపకు
అనవసరంగా చిత్రానికి ఆలస్యాన్ని మేపకు
హీరోలో - రోయిన్‌లో వేళకు రాపోతే
'జీరో'తో లాంగ్ షాట్ తీసెయ్ చేతైతే.

## తురుపుకార్డు:

మ్యూజిక్ డైరెక్షన్ అనేది తెలుగులో అచ్చుతప్పు
'మాజిక్' అని అనగనొప్పు; అదేమనకు నప్పు
సినీ వ్యాపార సరళీ స్వరాలలో
ఇమిడేవి సరాగాలు
హిందీలో హిట్ రికార్డు
మనకి తురుపుకార్డు.



## అవస - రాగాలు:

అనురాగాలను రాగాలు
ఆశించతగని భోగాలు
అవే అందరీ మనకందు
బాటలో ఉంచే అసలు రాగాలు;
అనురాగాలకు ప్రత్యామ్నాయా
లైన అవ - సరాగాలు.

## ఇంగ్లీషు:

ఇంగ్లీషు ప్రపంచభాష
దాన్ని గౌరవించు హమేష
అనవసరంగా ఇంగ్లీషు వాడకు
చేతి కింగ్లీషురాందే పని చెయ్యకు మాటాడకు.

☆ సినీజన పరిభాషలో 'ఇంగ్లీషు మాట్లాడడం, అంటే డబ్బు ఇచ్చిపుచ్చుకోవడం' అని సరదాగా చెబుతారు.

## సెన్సారం:

అసాధ్యమైనంతవరకూ సెక్స్‌ట్రార్డినరీగా తియ్యి
మెండుగా రెండర్థాల డైలాగులు తొయ్యి
సెన్సార్ బంధాలు అడ్డొస్తాయి వెయ్యి
అప్పీలుకేషన్ మీద గ్లిసరిన్ పొయ్యి
(కాదంటే సెన్సార్ పక్షంగానే కాలక్షేపం చెయ్యి)



## లేదు:

"అవ్వాబువ్వా కావాలనడం
'రెంటికీ చెడే రేవడం'
ఉన్నదొక్కటే తారకమంత్రం
లేదు భయ తారకమగుతంత్రం.
లేదుసుమీ, ఉన్నా
చేదుసుమీ, డబ్బసలు
రాదుసుమీ కీర్తి ఉన్నా పనికి
రాదుసుమీ"



## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

1. యామిని (సువర్ణ సుందరి -హాయి హాయిగ)
ఎ) భామిని బి) రాత్రి
సి) జాము డి) వసంతము

2. నిగమ (రహస్యం - శ్రీ లలిత)
ఎ) శాస్త్రము బి) వేదము
సి) వాస్తు డి) విద్య

3. మధుపాయి (దేవదాసు - తానే మారెనా)
ఎ) త్రాగేచోటు బి) త్రాగుబోతు
సి) త్రాగే పాత్ర డి) అంధకారం

4. తనియించి (మంచి మనసుకు మంచి రోజులు - ధరణికి గిరి భారమా)
ఎ) ఆచరించి బి) మెప్పించి
సి) తృప్తిపరచి డి) నిజము చేసి

5. తరువు (మంచి మనసుకు మంచి రోజులు - ధరణికి గిరి భారమా)
ఎ) రాయి బి) లత
సి) గుహ డి) చెట్టు

6. శారిక (రాధిక - గోపాల కృష్ణుడు)
ఎ) గోరువంక బి) చిలుక
సి) పావురము డి) కోకిల

7. తమకం (అల్లరి ప్రియుడు - కనులు విప్పి)
ఎ) మోహము బి) తన్మయత్వం
సి) తికమక డి) మైకం

8. తాట (సంబరాల రాంబాబు - పొరుగింటి)
ఎ) వస్త్రము బి) ముక్కెర
సి) చెవికమ్మ డి) హారము

9. సొక్కు (ఘరానా మొగుడు - పండు పండు)
ఎ) చిక్కిపోవు బి) నీరసించు
సి) పరవశమగు డి) అలంకారము

10. హాలా హలము (ముద్దు బిడ్డ - ఇటులేల చేశావయా)
ఎ) గందరగోళము బి) విషము
సి) మంట డి) నాగలి

### జవాబులు

1) b) 2) b 3) b
4) c 5) d 6) a
7) a 8) c 9) c
10) b



# నిబద్ధత గల గాత్రానికి నిదర్శనం ఏ.పి.కోమల

గతంలో ఏ భాషా చిత్రమైనా సరే ఆ సినిమాకి ఓ కథ ఉండడం, కథకీ అందులోని పాత్రలకీ సంబంధం ఉండడం, దాంతో పాటు ఆ పాత్రలకు ఓ సంప్రదాయమో, సంస్కృతో, కనీసం తెలుగుదనమో ఉండేది. ఆ సినిమాల్లో సందర్భానుసారంగా టైటిల్ మ్యూజిక్, బ్యాగ్రౌండ్ మ్యూజిక్ క్కాన్ని లలిత గీతాలు, ఓ జావళి, ఓ భజన, ఓ కృతి, ఓ తిల్లానా, ఓ జానపద గీతం... ఇలా ఉండేవి. అలా ఉండేవి కాబట్టే ఎమ్.ఎల్. వసంతకుమారి, రాధా జయలక్ష్మి, ఏ.పి.కోమల, పి.లీల వంటి గాయనీమణుల అవసరమూ ఉండేది.

కొందరంటారు - శాస్త్రీయ సంగీతాధ్యయనం చేస్తే, లలిత గీతాలకు కావాల్సిన రీతిలో తేలిక సంగతులు వేయలేరని. కానీ ఏ.పి.కోమలపరంగా ఆలోచిస్తే ఇది శుద్ధ అబద్ధం. చిన్ననాడే సలక్షణంగా శాస్త్రీయ సంగీత మభ్యసించిన కోమల మూడు గంటల సేపు కర్ణాటక సంగీతమూ పాడగలదు; మూడు నిముషాల సేపు సినిమా పాటలూ పాడి వినిపించగలదు. కోమల కంఠంలో లలిత సంగీత కళలు లలిత లలితంగా పలుకుతాయి. రేడియోలోనూ, తమిళ, కేరళ దేశాల సంగీత సభలలోనూ ఆమె కంఠం సంగీతపరంగా శుద్ధ ఛాందసులను కూడా సమ్మోహన పరుస్తూ ఉంటుందని వినేవారు చెబుతుంటారు.



సినిమా పాటలలో కూడా శాస్త్రీయ రీతికి చెందిన జావళులు (జయ మురళీలోల.... శ్రీరంజని రాగం; భక్త రఘునాథ్), ఏ పద్ధతికీ చెందని హాస్య గీతాలు ('ఓ పంతులుగారు' - పిచ్చిపుల్లయ్య,) భక్తిగీతాలు (పన్నగశయనా - రంగుల రాట్నం), భజనలు (పాండురంగ మహాత్మ్యం) నృత్యగీతాలు (ఆటలు సాగునటే - పెంకి పెళ్లాం), ఒకటేవిటి.... అన్ని రకాలైన పాటలూ కోమలకు కొట్టిన పిండే.

1935 సంవత్సరం ఆగష్టు 28న మద్రాసు నగరంలో జన్మించిన ఎ.పి. కోమల పూర్తి పేరు ఆర్కాటు పార్థసారధి కోమల. తల్లితండ్రులిద్దరూ సంగీతారాధకులే. తండ్రి క్రమశిక్షణ, తల్లి ప్రోత్సాహం కోమలకు సంగీతం పట్ల అభిమానం, అభినివేశం కలగడానికి దోహదం చేశాయి.

ఆమెను ఏడేళ్ళ వయసులోనే రాజమండ్రిలో నాదస్వర విద్వాన్ శ్రీ గాడవల్లి పైడిస్వామి వద్ద సంగీతాభ్యాసం కోసం గురుకుల వాసం పంపించారు. ప్రముఖ గాయని ఎస్.జానకి, రాజమండ్రిలో ఏ.పి.కోమల సహాధ్యాయి. పైడిస్వామి వద్ద శాస్త్రీయ సంగీతాన్ని క్షుణ్ణంగా నేర్చుకున్న తర్వాత, తన మేనత్త కొడుకు ప్రముఖ గాత్ర విద్వాంసులు, శ్రీ ఎస్.నరసింహులు దగ్గర కూడా గాత్రం నేర్చుకుంది కోమల. ఇంట్లో ఉంటూనే తెలుగు, తమిళ భాషలు, ఎస్.బాలచందర్ దగ్గర వీణకూడా నేర్చుకుంది.

కర్ణాటక సంగీత వేదికపై తొలిసారిగా 1943లో అంటే తొమ్మిదేళ్ళ ప్రాయంలోనే శ్రీ మంచాళ జగన్నాధరావు ప్రోత్సాహంతో బరంపురంలో జరిగిన ఓ శాస్త్రీయ సంగీతపు పోటీలో పాల్గొనడం జరిగింది. ఆ పోటీలో మైకు లేకపోయినా 'శ్రీ గణనాయకం' అనే దీక్షితార్ కృతి పాడి వెండి భరిణె బహుమతిగా గెల్చుకుందామె. ఆ సభకు అధ్యక్షత వహించిన శ్రీ దుర్గాబాయి దేశ్‌ముఖ్ కోమలను ఎంతగానో ప్రశంసించి ఆ కృతినే మళ్ళీ పాడించుకోవడాన్ని ఒక మధురమైన జ్ఞాపకంగా దాచుకున్నారామె.

అది 1940-1950 దశకాలు. ఆకాశవాణి విజయవాడ, మద్రాసు కేంద్రాలు సంగీతంలో చరిత్రను సృష్టిస్తున్న రోజులు. ఆ రోజుల్లో ఆలిండియా రేడియోలో "గానలహరి" అనే కార్యక్రమంలో సంగీత శిక్షణ ఉండేది. అందులో సంగీతం నేర్చుకునే శిష్యురాలిగా ఏ.పి.కోమల ఎన్నికైంది. ఆ కార్యక్రమంలో ఆమెకు గురువుగా వుండి సంగీతం నేర్పినవారు శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు గారు. అనతి కాలంలోనే కోమల తన ప్రతిభతో గుర్తింపు పొందింది. రేడియోలో సంగీత దర్శకులుగా ఉన్న మల్లిక్‌గారు కోమలకు లలిత సంగీతం నేర్పారు. వింజమూరి సోదరీమణులతో కలిసి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'ఆకులో ఆకునై' వంటి భావగీతాలు, గురజాడ అప్పారావు గారి 'దేశమును ప్రేమించుమన్నా' వంటి అభ్యుదయ గీతాలు ఆమె రేడియోలో పాడేది. అంతేగాకుండా తెలుగులోనూ, తమిళంలోనూ వచ్చే స్త్రీలు, బాలల కార్యక్రమంలో కూడా పాల్గొనేది. రేడియో కార్యక్రమాలు నిర్వహించే యండమూరి సత్యనారాయణగారు పది నిముషాలలో ఆరంభమయ్యే కార్యక్రమానికి అప్పటి కప్పుడు పాట రాసి ఆయనే వరసకట్టి కోమలకు చెప్పించే వారు. దాంతో అప్పటికప్పుడు నేర్చుకుని పాడడం అన్న విశేషమైన విద్యకూడా ఆమెకు అలవాటయ్యింది. ఆ తర్వాత రేడియోలో ఆర్టిస్టుగా నియమింపబడింది. అలా 25-09-1944లో కన్నమ్మ అనే విద్వాంసురాలి సిఫారసుతో రేడియోలో 50 రూపాయల పారితోషికంతో ప్రారంభమైన కోమల రేడియో జీవితం అంచెలంచెలుగా ఎదిగి ఉన్నత స్థాయి ఉద్యోగినిగా పదవీ విరమణ చేసే వరకూ నిరాటంకంగా సాగింది. ఒక విధంగా చెప్పాలంటే కోమల జీవితమంతా రసమయ సంగీతంలా సాగిపోయింది.

**ఎన్‌టిఆర్ - కోమల**

**ఎన్.టి.ఆర్ గారు - తమ బానర్‌క్రింద ఏ సినిమా నిర్మించినా షూటింగ్ మొదటిరోజు ప్రారంభగీతం నేను పాడాల్సిందే. పాట రికార్డింగ్ అయిన తర్వాత నేను ఇంటికి వచ్చేస్తే, ఆయనే స్వయంగా ఇంటికి వచ్చి 116 రూపాయలు ఇచ్చి వెళ్ళేవారు. అలాంటి రోజులు మళ్ళీరావు అని అంటుంది కోమల.**

## సినిమా గాయనిగా

రేడియోలో పని చేసే రోజుల్లో శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రిగారి సిఫారసు మేరకు చిత్తూరు వి.నాగయ్యగారు నిర్మించిన రేణుకా వారి 'త్యాగయ్య' (1946) చిత్రంలో తొలిసారిగా సినిమా పాట పాడింది కోమల. ఆ పాట 'మధురా నగరిలో చల్లనమ్మ బోదు' ఈ పాటను కె.జమునారాణితో కలిసి పాడిందామె. ఇదే పాటను మళ్ళీ శ్రీపిక్చర్స్ 'అభిమానం' (1960) చిత్రంలో పి.సుశీలతో కలిసి పాడింది కూడా. 'త్యాగయ్య' చిత్రంలో పాడినందుకు కోమల అందుకున్న పారితోషికం 250 రూపాయలు. ఆ రోజుల్లో 250 రూపాయలంటే చాలా పెద్దమొత్తమే మరి. ఆ డబ్బుతో 10 సవర్ల బంగారం కొనుక్కున్నానని అప్పుడప్పుడు సరదాగా చెప్తుంటుందామె. 'త్యాగయ్య' తర్వాత 'ఆత్మశాంతి' అనే తమిళ చిత్రంలో కూడా పాడింది. సారథి వారి "గృహప్రవేశం" చిత్రం సింహళ భాషలోకి డబ్ చేసినప్పుడు తెలుగులో పి.భానుమతి పాడిన పాటలన్నీ సింహళంలో కోమలే పాడింది. ఆ తర్వాత భానుమతి డబ్బింగ్ చిత్రాల్లో సైతం తన పాటలు తానే పాడుకునేటట్లు కాంట్రాక్టులు రాయించుకుంది.



కొన్నాళ్ళకు కోమల పేరు సంగీత ప్రియులందరికీ బాగా తెలిసింది. రేడియోలో పాడే పాటల ద్వారా, ప్రయివేటు రికార్డుల ద్వారా, సినిమాల ద్వారా, బయట కచేరీల ద్వారా మంచి పేరు లభించింది. కీ॥శే॥ కె.వి.మహదేవన్ సినిమాల్లోకి రాక పూర్వం అంటే గ్రామఫోను కంపెనీలో నెల జీతం మీదున్నప్పుడు ఆయనతో కలిసి ఎన్నో యుగళగీతాలు ప్రయివేటుగా ఇచ్చారు. అలాగే వెంకట్రాజుతో కలిసి కూడా ఎన్నో ప్రయివేటు గీతాలు పాడింది కోమల. అలా వెలువడిన రికార్డులలో 'వేసవి పున్నమి వెన్నెలలోన...' వంటి లలిత గీతాలు అందరినీ రంజింప జేశాయి. ఇంకా ఆమె ప్రైవేటుగా పాడిన క్రిస్టియన్ గీతాలు ఎన్నో ఉన్నాయి. ఇక తెలుగు, తమిళం, మలయాళం, కన్నడం భాషా చిత్రాల్లో ఆమె దాదాపు 4000 పై చిలుకు పాటలు పాడింది. 1000కి పైగా శాస్త్రీయ సంగీత కచేరీలు చేసింది... ఇంకా చేస్తూనే ఉంది.

### సుశీల - కోమల

ఎం.ఎస్.సుబ్బయ్య నాయుడు గారు సంగీత దర్శకత్వం వహించిన మన్నిప్పు చిత్రంలో శిష్యురాలి పాత్రకు ఏ.పి.కోమల, గురువు పాత్రకు పి.సుశీల ఒక శాస్త్రీయ గీతం పాడాల్సి వచ్చిందట - అప్పుడు పి.సుశీల సుబ్బయ్యనాయుడు గారితో "ఎ.పి.కోమల క్లాసికల్‌లో జీనియస్. అలాంటిది నేను ఎలా చెప్తే ఆమె అలా పాడడమేమిటి?" అని వెళ్ళిపోయారట. ఈ విషయాన్ని ఆ తర్వాత ఎం.ఎస్.సుబ్బయ్యనాయుడు గారే కోమలకు చెప్పారట. ఈ సంఘటన కూడా ఎప్పటికీ మరువలేనిదని కోమల అంటుంది. "ఇలా అందరు నన్ను బాగా ఆదరించిన వారే" అందామె అందరినీ గుర్తుచేసుకుంటూ.

"రక్షరేఖ" (1949)లో 'ఓహో రాజ సుకుమార' (ఘంటసాలతో కలిసి), "అమ్మలక్కలు" (1951)లో, "శ్రీలక్ష్మమ్మ కథ"లో 'తాళగజాలనురా' అన్న, జావళి, "ప్రేమ" (1952)లో 'ఓహో ఇదే కదా బ్యూటీ', 'కన్నమావి తోటలోన' (జిక్కితో కలిసి), "పెళ్లిచేసి చూడు" (1952)లో 'అమ్మా నొప్పులే' (సరోజిని, రాణిలతో కలసి), "పుట్టిల్లు" (1953)లో 'ఓహోహో బ్యూటీ, ది సీజ్ మై డ్యూటీ' "జయసింహ" (1955)లో "మురిపెము మీరా మీ కోరిక తీరా", 'మనసైన చెలీ పిలుపు' (రావు బాలసరస్వతితో కలిసి) "బాలసన్యాసమ్మ" (1956)లో "అడుగో అడుగో" (ఘంటసాలతో కలిసి), "దీపావళి" (1960)లో 'పోనీవోయ్ తాతా', "పరాశక్తి"లో 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' (శంకరంబాడి సుందరాచారి రాసిన ఈ తెలుగు తల్లి పాటకు మొదట ట్యూన్ చేసిన వారు ఏ.వి.ఎం. వారి పర్మనెంటు మ్యూజిక్ డైరెక్టరు సుదర్శనం గారు, కాగా దానిని రికార్డుగా పాడిన వారు టి.సూర్యకుమారి - ఆ తర్వాత 'పరాశక్తి' సినిమాలో ఇదే పాటను, వరసమార్చి రాగమాలికగా ఏ.పి.కోమల చేత పాడించిన వారు కూడా ఈ సుదర్శనమే) ఇలా కోమల పాడిన పాటలు ఎన్నో వున్నాయి.

విభిన్న భాషల్లో విభిన్న గాయనీ గాయకులతో కూడా పాడారు కోమల పాడింది. "చక్రవర్తి తిరుమగళ్", "వీరపాండ్యకట్టబొమ్మన్" (తమిళం) చిత్రాల్లో ఎస్.వరలక్ష్మి తోనూ, "పెళ్లికూతురు" చిత్రంలో ఎం.ఎల్.వసంత కుమారితోనూ, 'చల్లలమ్మే గొల్ల పిల్లలమోయీ' అంటూ వక్కలంక సరళతో (నవ్వితే నవరత్నాలు)ను, "సారంగధర" (తమిళం) చిత్రంలో పి.భానుమతితోనూ, "మరుమగళ్" (తమిళం) చిత్రంలో పెరియ నాయకి తోనూ, ఇంకా అనేక కన్నడ చిత్రాల్లో పి.బి.శ్రీనివాస్ తోనూ పాడారామె.

అశ్వరాజ్ వారి "దీపావళి" (1960)లో ఆఖరి ఘట్టంలో నరకాసురునితో సత్యభామ సమరం సాగించటానికి సన్నద్ధమయ్యే సన్నివేశంలో సముద్రాల రచించిన 'సరియా మాతో సమరాన నిలువ గలడా' అంటూ సత్యభామ (సావిత్రి)కు 'విరాళి సైపలేనురా' (కమలా లక్ష్మణ్ డాన్స్) అంటూ పాడిన నృత్యగీతం ప్రశంసించదగ్గదే. "భక్త రఘునాథ" (ఘంటసాల స్వంత చిత్రం)లో 'జయ మురళీలోలా' పాట కూడా మళ్లీమళ్లీ వినాలనిపిస్తుంది. విజయా వారి "చంద్రహారం" (1954)లో సావిత్రిపై చిత్రీకరించిన 'వలపు పాట వినగానే నిలువలేక చేరితినోయి' అన్న చరణాలకు తన గాన విన్యాసంతో ప్రాణం పోసింది కోమల. ఇక అన్నిటినీ మించి వాహినీ వారి "బంగారు పంజరం" (1969)లో 'పదములె చాలు రామా' అనే పాట. ఈ పాటను దేవులపల్లి ఎంత సున్నితంగా రాశారో, అంతే సున్నితంగా పాడింది కోమల. పాలగుమ్మి విశ్వనాథం రేడియో కోసమని వరసకట్టి పాడించిన

### లీల - కోమల

"కోమలకు తాను గొప్ప గాయకురాలిననే గర్వం ఏ కోశానా లేదు. అందుకే ఆమె అంటే నాకంత ఇష్టం. నేను ఎక్కడైనా అన్నమాచార్య సంకీర్తనలు పాడాల్సి వస్తే కోమల ఇంటికెళ్లి పాడే విధానం తలకెక్కించుకునే కచేరీలకు వెళ్లాను. ఇప్పటికీ నేను, కోమల కేరళ దేశంలో ఓణం పండుగకు కచేరీలకు కలిసే వెళ్తాం. మాది చాలా సుదీర్ఘమైన స్నేహం" అన్నారు పి.లీల.

పి.లీలతో కలిసి ఎన్నో సినిమాల్లో పాటలు కోమల పాడడం జరిగింది. "శాంతి నివాసం" (1961) చిత్రంలోని నృత్యగీతం 'సెలయేటి జోరులాగా, చిందేసే వాగులాగా' అనే గీతంలో పి.లీల, ఎ.పి.కోమల తమ గొంతుల్లో చిత్రవిచిత్ర గమకాల్ని నాట్యరీతులకనువైన విధంగా ఆలపించారు. ఘంటసాల మ్యూజిక్‌లో "పరమానంద శిష్యుల కథ" చిత్రంలో పోటీ నృత్యగీతంలో పి.లీలతో కలిసి పాడిన 'ఎంతమంది ప్రజ ఏమైపోయిన ఇంత నిరాదరణ' గీతంలో పాత్రోచిత భావం గళంలో పల్లవింపజేసింది కోమల.

ఇంకా "భట్టి విక్రమార్క", "సత్యనారాయణ వ్రత మహత్మ్యం", "లవకుశ" "రహస్యం", "గ్రామదేవతలు" మొదలైన చిత్రాల్లో పి.లీల, కోమల కలిసి పాడిన పాటలు వింటే కోయిలలు రెండూ, వసంతం వచ్చేవరకూ తమ గాత్ర మాధుర్యాన్ని ఈ ఇద్దరు గాయనీమణుల గొంతుల్లో దాచుకున్నాయేమోనని అనిపిస్తుంది.



అన్న గజపతి, చెల్లెలు గంగ లతో ఏ.పి. కోమల

కుమారి కోమల తన జీవితమంతా బ్రహ్మచారిణిగానే మిగిలి పోయింది. ఎక్కడికి వెళ్లినా ఆమెను వెన్నంటి ఉండే తన సోదరుడు గజపతి, చెల్లెలు గంగ ఆమెకు కొండంత అండ. సోదరునిగా కంటే స్నేహితునిగా ఆమెకు ఎన్నో సలహాలిచ్చేవారు ఆమె అన్నగారు. ఆయన స్వయంగా వయొలిన్ విద్వాంసులు కూడా. ఇక ఆమె చెల్లెలు గంగ అక్కగారికి ఎల్లప్పుడు సహాయ కారిగా ఉంటుంది. "వారిద్దరూ నన్ను బాగా చూసుకోవడం వల్లే నేనీ స్థితికి రాగలిగాను" అంటుందామె.

ఈ శ్రీరామ భక్తిగీతం ఆ తర్వాత ఎస్.రాజేశ్వరరావు, బి.గోపాలం గార్ల సంగీత నిర్దేశకత్వంలో వాహినీ వారి "బంగారు పంజరం"లో ఉపయోగించబడింది.ఈ పాటని సినిమాలో నిడివి ఎక్కువయ్యిందని తొలగించారు. ఈ చిత్రం తర్వాత కోమలకు సినిమాల్లో పాడే అవకాశం రాలేదు. ఎందుకని అడిగితే "కారణం ఏమిటో నాకు తెలీదండి. నా కంఠంలోని మాధుర్యం తగ్గిపోనూ లేదు, నేను పాడక పోవడమూ లేదు. ఏమిటో, సినిమా పరిశ్రమ పూర్వంలా లేదు -- ఆ ప్రేమలు, గౌరవాలు నేడు వెతికినా కనబడవు" అని అంటుంది కోమల.

పై విధంగా కోమల పాడిన పాటలు మిగతా వారితో పోల్చుకుంటే తక్కువ, అవి తక్కువే అయినా ఎన్నదగినవే. ఈనాడు పుంఖాను పుంఖాలుగా పాత సినిమా పాటల కలెక్షన్లు దొరుకుతున్నాయి. వాటిల్లోనూ పేరున్న గాయనీగాయకులవే విడుదలవుతున్నాయి. కానీ ఏ.పి. కోమల పాడిన పాటలు మరుగున పడి పోయిన మాణిక్యాలవలె ఉండి పోయాయి. వాటి బూజు దులిపి పునరుద్ధరించి మనకు వినిపించే నాధుడెవరు? ఇలాంటి అరుదైన కంఠాలకు శాశ్వతత్వం కలిగించే కంకణం ఎవరుకట్టుకుంటారు!?. కోమల పాడిన కమ్మటి పాటలు "కోమల హిట్స్" గా వస్తే ఎంత బాగుంటుంది!?

పబ్లిసిటీ అంటే ఏ మాత్రం ఇష్టపడని కోమల ఎప్పుడో గాని ఇంటర్వ్యూలు ఇవ్వదు. అతి సామాన్యంగా జీవిస్తూ, అంకిత భావంతో అవిరళ కృషితో నాదోపాసనను సాగిస్తూ అనేక మంది శిష్యులను తీర్చిదిద్దుతూ, సంగీత సరస్వతికి నిత్య నీరాజనాలర్పిస్తూ... 'సమకాలికులతో వివాదాలు పెట్టుకోకుండా ఉంటేనే కళ రాణిస్తుంది' అని చెప్పే ఈ కళాకారిణికి ఆమె అభిమానుల తరపున పుట్టిన రోజు శుభాకాంక్షలు చెప్పడం తప్ప మనమేమి అందించగలం!?...

**- కంపల్లె రవిచంద్రన్**



## పన్‌డితుడు శంకర నారాయణ



పన్ చేయడానికి భాషపై మంచి పట్టు ఉండాలి. మాటను విరిచో, వేరే అర్థంలో ప్రయోగించే చమత్కారాన్ని పన్‌డించడం అంత సులభ మేమీ కాదు. శంకరనారాయణ ఈ విద్యలో సిద్ధహస్తులని ఇప్పటికే బుజువు చేసుకున్నారు. తెలుగు, ఇంగ్లీషు కొండొకచో హిందీ, సంస్కృతం భాషా పరిజ్ఞానాలను కలగలపి ఈయన అనేక ప్రయోగాలు చేశారు. 'పన్‌పరాగ్' అనే ఆయన పుస్తకంలో వివిధ అధ్యాయాలను పరికించి చూస్తే పూర్తి ఇంగ్లీషు మాటనే విరిచి, లేదా వేరే అర్థంలో పుట్టించిన హాస్యం చూడండి.

### వృత్తులపై చెణుకులు

★ అన్నదాతలు 'ధాన్యజీవులు'
★ మత్స్యకారుల కంటబడితే చేపలకు పో'గాల'మే
★ పశువుల డాక్టర్లు చేసేది 'గొడ్డు చాకిరీ'
★ టైలరింగ్ అంటే 'కుట్టు చప్పుడు' వ్యవహారం
★ పరిశ్రమల పితామహుడు 'తాతా'
★ అరబ్ షేకులు ఇం'ధనవంతులు'
★ పాదరక్షల వ్యాపారంలో అన్నీ 'చెప్పు'డు మాటలే!
★ డాక్టర్లకు 'నయానా' డబ్బు 'భయానా' డబ్బు
★ హోటళ్లలో ఇడ్లీకి 'వడ'దెబ్బ
★ అందరినీ కొలిచేవాడు టైలర్
★ 'చెరిపినా' చెడనివాడు టీచరే!
★ కార్డియాలజిస్టులు 'గుండెలు తీసిన బంట్లు'
★ నేటి ధన్వంతరులు 'ధనవంత'రులు
★ గూఢచారులకు ఉండేది 'కూపీరైట్'
★ వాస్తు వేత్తలు 'వెయ్యిళ్ళ పూజారులు'
★ 'వెల'యాలు సతీ'మని'
★ సబ్ ఎడిటర్లు వేసేవి 'శీర్షికాసనాలు'
★ రక్తం కళ్ళజూసి సంతోషించేవి 'బ్లడ్ బ్యాంకులే'
★ గూండాలు చేసేది 'క్రైం'కర్యం
★ పశువుల పెంపకం ఒక 'పేడకల'

### దేవుళ్లపై

★ బ్రహ్మదేవుడూ 'గీత' కార్మికుడే!
★ సముద్రుడికి అంతా 'అల'జడి
★ వసుదేవుడు చేసింది 'ఖరసేవ'
★ భీముడు చేసింది 'దగాయుద్ధం'
★ అగ్నిదేవుడు 'భగభగవంతుడు'
★ చంద్రుడు గురువును 'ముంచిన' శిష్యుడు

### వ్యసనపరులపై

★ మద్యనిషేధం అంటే 'బుడ్డితక్కువ వ్యవహారం' అంటారు తాగుబోతులు
★ బార్లలో చేసేది 'చుక్కభజన'
★ 'క్లబ్బు, డబ్బు' అని కొట్టుకుంటుంది జూదరుల గుండె!
★ ధూమపానం 'పీకల'మీద వ్యవహారం
★ 'గుప్పు' చుప్పుగా రావటం 'మందు' బాబులకు సహజం

### ప్రాంతాలపై

★ 'పలక'లేని వారు మార్కాపురంలో దొరకరు
★ 'సీమ' వాసులు తెలుసుకునేవి 'క్షామ సమాచారాలు'

# రాగాల కోయిల రావు బాల “గాన” సరస్వతీదేవి



**ఆమె పాటల తోటలో విరబూసిన ఓ స్వరసుమం**
**ఆమె నడిచే పాటకు నిలువెత్తు నిజ స్వరూపం**
**ఆమె పాట ఒక్కటే ప్రాణంగా జీవిస్తున్న ఓ రాగాల కోయిల**
**ఆమె పేరే రావు బాల సరస్వతీదేవి.**

బాల సరస్వతీదేవి పేరు వినగానే మనకు ఓ మంద్ర స్వరగాత్ర మాధుర్యం గుర్తుకువస్తుంది. ఆమెది ఎవరికీ అనుకరణ కాని ఓ స్వంతగొంతుక. తెలుగు సినిమా సంగీతం తనకంటూ ఓ విభిన్నమైన ఉనికిని నిలబెట్టుకునే ప్రయత్నం చేస్తున్న తరుణం లోనే బాల సరస్వతి స్వరా విష్కరణ జరిగింది. ఈ నెల 28కి 75వ ఏట ప్రవేశిస్తున్న బాల సరస్వతీదేవి నాలుగు దశాబ్దాల నట, గాన కళా జీవనంలో ఒక కళాకారిణిగా చేరిన శిఖరాలు అత్యున్నత మైనవి.



‘బాల’ సరస్వతి

1928 ఆగస్టు 28న గుంటూరులో జన్మించిన బాల సరస్వతి తండ్రి పార్థసారథి గుంటూరులో “రత్నా” సినిమాహాలు నడిపే వారు. తల్లితండ్రు లిరువురూ సంగీతాభిమానులు మాత్రమే కాదు. వీణ, సితారలను వాయించేవారు. వారికి సంగీత పరికరాల షాపు ఉండేది. దాంతో ఎందరో సంగీతకారులు వారింటికి వచ్చేవారు. అలా చిన్ననాటనే ఆమెకు సంగీతం పట్ల ఆసక్తి ఏర్పడింది. తమ టాకీస్‌లో ప్రదర్శించే పాటలను అచ్చు అలాగే పాడేవారు. ఆమె తన ఆరోఏట 1934లో తొలిసారిగా హెచ్.ఎం.వి. వారికి “పరమపురుషా” అనే పద్యం, “దొరికే దొరికే నాకు” పాటను రికార్డుగా ఇచ్చారు. ఇంతలో సి.పుల్లయ్య గారు తన ‘సతీ అనసూయ’ (1936) కోసం పాడ గలిగే అమ్మాయికోసం అన్వేషిస్తూ బాల సరస్వతిని ‘గంగ’ పాత్రకు ఎంపిక చేశారు. అదే సమయంలో తమిళంలో “భక్త కుచేల” తీస్తున్న కె.సుబ్రహ్మణ్యం కృష్ణుడిగా నటింపజేశారు. ఆయన సరస్వతీ దేవికి ముందు “బాల” కలిపారు. వివాహానంతరం ‘బాల’కు ముందు “రావు” వచ్చి చేరింది. ‘రావు’ అనేది కోలంక ఎస్టేటు పేరు.

‘భక్తకుచేల’ (తమిళం) తరువాత బాలసరస్వతి ‘తుకారం’ (1937), ‘బాలయోగిని’ (తెలుగు, తమిళం) ‘మహానంద’ (1939) చిత్రాల్లో బాల తారగా నటించారు. మద్రాసులో అలత్తూరు సుబ్బయ్య వద్ద శాస్త్రీయ సంగీతం నేర్చుకున్నారు. ఇంతలో గూడవల్లి రామబ్రహ్మం ఇల్లాలు సినిమా తీస్తూ ఎస్.రాజేశ్వరరావు సరసన టీనేజ్ గర్ల్‌గా నటింపజేశారామెను. సాలూరు వారు కూడా పూర్తి స్థాయి సంగీత దర్శకుడైంది ఈ సినిమాతోనే. ఈ సినిమాలో సాలూరు వారితో బాలసరస్వతి పాడిన పాటలు గొప్ప హిట్ పొందాయి. ఈ సినిమా సెట్స్ మీద చూసిన నాటి మద్రాసు రేడియో అధికార బృంద సభ్యులు జనమంచి రామకృష్ణ, ఆచంట జానకిరాం తదితరులు వారిని రేడియో కేంద్రానికి తీసుకెళ్లి వారి పాటలను లైవ్‌బ్రాడ్ కాస్ట్ చేయించారు. అది మొదలు వారిని నెల నెలా పాడమని కాంట్రాక్టు ఇచ్చారు. అలా రేడియోతో ఏర్పడిన ఆమె అనుబంధం 1948లో విజయవాడ ఆకాశవాణి కేంద్రం ప్రారంభోత్సవానికి 1998 స్వర్ణోత్సవానికి



పాడేదాకా కొనసాగింది. ఈ ఘనత ఆమెకు మాత్రం దక్కింది.

సాలూరి రాజేశ్వరరావు, బాలసరస్వతి గారలు 'ఇల్లాలు'లో పాడిన 'కావ్యపానముచేసి', 'కలకాదనవా బాల' పాటలు బహుళ జనాదరణ పొందాయి. అదిచూసిన హెచ్.ఎం.వి. వారు 'తుమ్మెదా ఒకసారి', "కోపమేల రాధా" "పొదరింటిలో నుంచి పొంచి" వంటి పాటలతో ప్రైవేట్ రికార్డును వీరితో పాడించారు. అప్పటికి బాలసరస్వతి వయస్సు పన్నెండేళ్లే. ఇవి సినిమా పాటలకన్నా ఎక్కువ ఆదరణ పొందాయి. ప్రైవేటు రికార్డుల ప్రస్తావన వచ్చింది కనుక ఆమె లలిత సంగీతానికి చేసిన సేవను కూడా ఇక్కడే చెప్పుకోవాలి. హెచ్.ఎం.వి. వారికి పురుషులు పాడవలసినవి ఆమె, స్త్రీలు పాడవలసినవి సాలూరు వారు పాడటం ఆరోజుల్లో ఓ ప్రయోగం. "శశివదనము గనినే వికసితమందితినే", "చలిగాలి వీచింది తెల తెల్లవారింది ఇకనైన ఇలు చేరవా ఓ ప్రియ", "రావే రావే కోయిలా" వంటివి నేటికీ ఎప్పుడైనా రేడియోలో ప్రసారమైనప్పుడు అలనాటి శ్రోతలను ఆనందింప చేస్తాయి. ఆ రోజుల్లో ఆమె పాడిన "ఆ తోటలో అందగాడెవరే" రికార్డు విన్న చలం తన అభిమాన గాయని బాల సరస్వతి అని స్వయంగా రాసుకోవడం విశేషం.



భర్త కోలంక జమీందారుతో

మళ్లీ సినిమాల విషయానికి వస్తే 'ఇల్లాలు' తరువాత 'అపవాదు'లో కె.ఎస్.ప్రకాశరావు సోదరిగా నటించారు. 'దాసిపెణ్' తమిళ చిత్రంలో ఎం.జి.ఆర్. సరసన, "రాధిక" (1947)లో ఈలపాట రఘురామయ్య సరసన నటించారామె. ఇంకా ఆమె 'సువర్ణ మాల'(1948), తమిళంలో 'పరిబిల్హణ', "జ్యోతిమలర్," "తిరునీల కంఠన్" కన్నడంలో "చంద్రహాస" చిత్రాలలో నటించిగానం చేశారు.

1944లో కాకినాడకు చెందిన కోలంక జమిందారు 'రావు ప్రద్యుమ్న కృష్ణ మహీపతిరావు'తో వివాహం తరువాత బాలసరస్వతి సంగీత యాత్రలోని చివరి మజిలీలు దగ్గరవుతూ వచ్చాయి.'ఇంట్లో వారికి అయిష్టంగా ప్రవర్తించి బాధపెట్టడం ఇష్టంలేకనే పరిశ్రమకు దూరమయ్యా"నని చెప్పుకుంటారామె.

బాలసరస్వతి నటిగా కన్నా గాయనిగానే ప్రసిద్ధులయ్యారు. 1943లో నాగయ్య గారు తీసిన "భాగ్యలక్ష్మి"లో కమలా కోట్నీస్‌కు "తిన్నెమీద చిన్నోడా" పాడి తొలి నేపథ్యగాయని అయ్యారామె. సినిమాల్లో బాలసరస్వతిని గాయనిగా ప్రోత్సహించిన వారు సి.ఆర్. సుబ్బరామన్. 'నటనలు తెలిసెనులె' (స్వప్నసుందరి), "ఊగుదువే ఊయల" (శాంతి), 'తానే మారినా', 'అందం చిందెనయా', "ఇంత తెలిసి ఉండి ఈ గుణమేలరా" (దేవదాసు) పాటలు సుబ్బరామన్ సంగీతంలో పాడినవే. భానుమతి చిత్రాల్లో గాయనిగా మరొకరికి పెద్దగా అవకాశాలు అరుదు. కానీ సుబ్బరామన్ సంగీతం చేసిన ప్రేమ, కాదల్, లైలామజ్ను చిత్రాల్లో బాలసరస్వతి పాటలున్నాయి. బాలసరస్వతిపై సుబ్బరామన్ గారికున్న నమ్మకమది.

అయితే బాలసరస్వతి ఎదుగుదలకు నాటి కొందరు సంగీత దర్శకులు వనిగట్టుకుని వ్యతిరేకంగా పనిచేశారంటారు. "నేను మంద్రస్వరంలో పాడతానని గుర్తించి, నేనంటే గిట్టని సంగీత దర్శకులు తారాస్థాయిలో సంగీతం అందించి పాటను ఖూనీ చేసేవారు" అంటారామె. హిందీ "ఉడన్ కటోలా" తమిళ వెర్షన్‌కు నౌషాద్ సంగీతంలో పాడేందుకు బొంబాయి వెళ్లినప్పుడు రెండు పాటల రికార్డు కాగానే హిందీ వెర్షన్‌కు పాడిన లత "బాల"ను వెంటనే బొంబాయినుండి పంపించకపోతే నేను పాడనని అక్కడ సంగీత దర్శకుని శాసించిందట. అయినా నౌషాద్ "బాల"ను బొంబాయిలో స్థిరపడమని కోరినా ఈమె మద్రాసు తిరిగి వచ్చేశారు.

బాలసరస్వతి 1958 వరకు పాడిన పాటలన్నీ ఆణిముత్యాలనదగినవే. తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, సింహళ భాషల్లో కలిపి 2000 పైగా పాటలు పాడారు. వాటిలో "మల్లెపూలు మల్లెపూలు, కలువపూలు కావాలా" (రాజీనా ప్రాణం), "రావే ప్రేమలతా" (పెళ్లి సందడి), "గోపాలకృష్ణుడు నల్లన (రాధిక), "తానేమి తలంచెనో" (దాంపత్యం), "తనపంతమే" (మానవతి), "యదుకుమార గిరిధర" (సువర్ణ మాల), "అదిగదిగో గగనసీమ" (నాయిల్లు), "పలుక రాదటే చిలుకా" (షావుకారు), "ధరణికి గిరిభారమా" వంటివి మచ్చుకు కొన్ని కాగా తన కెరీర్‌ను ముగించిన తరువాత తన దగ్గరిబంధువు విజయనిర్మలకోసం "సంఘం చెక్కిన శిల్పాలు"లో అంపకాల పాట పాడారు.

బాలసరస్వతికి పరిశ్రమ, ప్రభుత్వం సరైన గుర్తింపు నివ్వడంలో నిర్లక్ష్యం చేశాయి. అయినా సేలం ఖాదీ చేనేత ప్రదర్శనలో (1956), బాంబినో వారి ఉత్తమ గాయని అవార్డులు, మద్రాసు ఐక్య అకాడమి సన్మానం, ఢిల్లీలోని అంబేద్కర్ భవన్‌లో ఉత్తమ గాయని అవార్డు (1985), మద్రాసు తెలుగు సంగీత అకాడమి పురస్కారం (1988), హైదరాబాదులో ఘంటసాల విగ్రహావిష్కరణ సందర్భంగా లతాచే సన్మానం(1993), నాటి ప్రధాని పి.వి.చే "జాతీయ సమైక్యతా అవార్డు" (1995), చంద్రముఖి ఆర్ట్స్ వారి స్వర్ణ పతకం (1998), పైడి లక్ష్మయ్య స్మారక అవార్డు, ఆంధ్ర రాష్ట్ర తెలుగు ఆత్మగౌరవ పురస్కారం (2000) ఆమెను వరించి తమ గౌరవాన్ని పెంచుకున్నాయి.

**- హెచ్. రమేష్‌బాబు**

(బాలసరస్వతి గీతాలు 74వ పేజీలో)






విడుదల : మ్యూజిక్ టుడే
వెల : రూ 45/




విడుదల : హెచ్.ఎం.వి
వెల : రూ 40/




'ఇండియాటుడే' గ్రూప్‌కి చెందిన 'మ్యూజిక్ టుడే' వారు భారతదేశ సంగీత సంప్రదాయ వారసత్వాన్ని సంగీత ప్రియులకు అందించే ప్రయత్నంలో భాగంగా 1990 నుండి - హిందుస్తాని, కర్ణాటక, శాస్త్రీయ సంగీతం, భక్తి, జానపద సంగీతాలు, సెమీ క్లాసికల్ మ్యూజిక్‌లకు సంబంధించి రకరకాల ప్రక్రియలలో ప్రామాణికత ఉన్న క్యాసెట్‌లను అందిస్తూ వచ్చారు. అందులోని భాగంగా 'కళ్యాణము చూతము రారండి' అనే మకుటంతో ఆంధ్రదేశంలోని పెళ్ళిపాటలలో ఓ 14టిని ఆడియో క్యాసెట్ గా విడుదల చేశారు. క్యాసెట్ ఇన్‌లే కవర్‌లో పేర్కొన్నట్టు - వివాహ సందర్భంగా జరిగే ప్రత్యేక కార్యక్రమాలను అపురూపంగా మలచుకుంటూ, నవరసాలను తనలో కలుపుకుంటూ కొన్ని వందల సంవత్సరాలుగా మౌఖికంగా తరాల తరబడి వస్తున్న కొన్ని పెళ్ళిపాటలు ఈ మధ్యనే లిఖితరూపంలో కనిపించటం ప్రారంభించాయి. వాటిలో కొన్నిటిని ఈ క్యాసెట్‌లో పొందుపరచటం జరిగింది.

ఇందుకు అభినందించదగ్గ వారిలో ప్రథమ తాంబూలం పొంద దగ్గవారు శ్రీమతి ఎ. అనసూయాదేవి, వింజమూరి సీతల సోదరీద్వయం. వీరితో పాటు 'ప్రియా సిస్టర్స్'గా పురుగాంచిన షణ్ముఖప్రియ, హరిప్రియ - ఈ పాటలను గానం చేయటం జరిగింది. మోహనరాగంలో కళ్యాణము చూతము రారమ్మ, మధ్యమావతి రాగంలో అల్లవూరి వారు పిల్లనడిగేరు, మాయా మాళవ గౌళ రాగచ్ఛాయలలో కొట్నుమ్ములు దంచరే, ఆనందభైరవి రాగంలో 'ఆనందమానందమాయెను', రాగమాలికలో సీతాకళ్యాణ వైభోగమే, రాగపరంగా స్వతంత్ర సంచారం చేస్తూ నలుగురు పెట్టరే వదినకు మొదలైన పాటలు 'ఎ' సైడులోనూ

దేశ్ రాగచ్ఛాయలలో పూలబంతులాడెనే బాలరుక్మిణి కృష్ణులు, స్వతంత్రరాగసంచారంతో చూడనెంతో శృంగారము సుదతీరోసీతా, ...ఇంకా... దండమురా కృష్ణా, పెళ్ళికూతురా పెంకితనమేలనే, ఏదేశాన్నుంచొచ్చారయ్యా మాదేశానికి, సీతమ్మ మీ అత్తవారింటికేగి, తర్లి వెళ్ళే పెళ్ళి కుమారుని పల్లకియా, ఘల్లు ఘల్లున మొదలైన పాటలు 'బి' సైడులోను ఉన్నాయి. పాటల ఎంపిక, గానం, ఆర్కెస్ట్రయిజేషన్, రికార్డింగ్ క్వాలిటీ ప్రతీ ఒక్కటీ మరొక దానితో పోటీ పడేలా ఈ క్యాసెట్‌ని తీర్చి దిద్దారు మ్యూజిక్ టుడేవారు. ప్రతి ఇంటా ఉండదగ్గది, ఇష్టమైన వారికి బహుమతిగా ఇవ్వదగ్గది అనే స్థాయిలో రూపొందిన ఈ క్యాసెట్‌లో ఇచ్చిన సమాచారం కూడా ఎంతో ఉపయుక్తంగా ఉంది.

కొన్ని దశాబ్దాలుగా జానపదగీతాలను పాడుతూ ప్రచారం చేస్తున్న సోదరీమణులు శ్రీమతి ఎ.అనసూయాదేవి, వింజమూరి సీతాదేవి (దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి మేనకోడళ్ళువీరు) సారథ్యంలో వారితోపాటు

— — — — — తరువాయి భాగం 36వ పేజీలో...



"మంచి మంచి సామాన్లు బోలెడన్ని అమ్ముతున్నావట కదా.... వ్యాపారం బాగా సాగుతున్నట్టేనా?"
"నేను అమ్ముకుంటున్నది నా సొంత సామాన్లయ్యా బాబూ" అన్నాడు సుబ్బారావు నెత్తీ నోరూ బాదుకుంటూ.



"ఒక నల్లపిల్లి విడవకుండా వెంబడించిందనుకో. నిజంగా అది అదృష్టమా, దురదృష్టమా" అడిగేడు పంత్.
"అది వెంబడించినది మనిషినా ఎలుకనా అనే దాని పట్టి ఆధారపడి వుంటుంది" చెప్పాడు సంపత్.



"ప్రపంచంలో అన్ని భాషల్ని ఒక్కసారి చెప్పగానే తిరిగి యథాతథంగా అప్పజెప్పగలిగేది ఏమిటో తెలుసా?"
"ప్రతిధ్వని....."






"ఇది చాలా మంచి పాలసీ బామ్మగారు. ఈ పాలసీలో విరిగిపోయిన చేతులకీ... కాళ్ళకీ వేలాది రూపాయలిస్తాం" చెప్పాడు బీమా ఏజెంట్.
"ఇస్తారు సరే ఆ విరిగిపోయిన వాటినన్నింటినీ మీరేం చేసుకుంటారయ్యా?"
అడిగింది ఆండాళమ్మ అర్థంకాక.



"ఒరేయ్ తమ్ముడెందుకు ఏడుస్తున్నాడో చూడమ్మా...."
"వాడికి నా బిస్కెట్ యివ్వలేదని..."
"మరి వాడి బిస్కెట్ ఏం చేశాడు? వాడికి ఎప్పుడు ఏడవాలో తెలీటం లేదే?".
"నేనూ అదే అనుకుంటున్నానమ్మా. నేను వాడి బిస్కెట్ తింటున్నప్పుడు కూడా యిలాగే ఏడ్చాడు."



"ఎవర్నువు?"
"మీ ఇంట్లో మ్యూజిక్ ఇన్‌స్ట్రుమెంట్స్ శృతి సరిగా చేయడానికి వచ్చానమ్మా"
"ఎవరు చెప్పారు నీకు మా ఇంట్లో మ్యూజిక్ ఇన్‌స్ట్రుమెంట్స్ శృతిలో లేవని"
"మీ పక్కింటి వాళ్ళండీ..."



"నువ్వీ రోజు మా యింటికి భోజనానికి రావాలోయ్..."
"ఎందుకురా?"
"మా ఆవిడకి పొట్లకాయ, కోడిగుడ్లు కలిపి వండినకూరతింటే చస్తారో లేదో చూడాలని వుందిట..."






"పౌరాణికం సినిమాలకి 'ఎ' సర్టిఫికెట్ రావడం ఏమిటండీ?"

"ద్రౌపది వస్త్రాపహరణం సీను కొంచెం నేచురల్‌గా తీశాంలెండి..."



"చెప్పేది కొంచెం జాగ్రత్తగా వినండి..."

"కొంచెం జాగ్రత్తగా వినటానికే ప్రయత్నిస్తున్నాం టీచర్".



"కప్పులో టీని ఎడం చేత్తో కలుపుకుంటావా? కుడి చేత్తోనా?"

"రెండిటితోనూ కాదు... చెంచాతో..."



"మొత్తం ప్రపంచంలో నా అంత అందగత్తె లేదంటారు... మా ఆయన"

"కళ్ళజోడు మార్పించుకోమని చెప్పలేక పోయావా".



తల్లి: లే... లే... లేచి తొందరగా తెములు. లేకపోతే స్కూలుకి ఆలస్యం అయిపోతుంది.

కొడుకు: నేను వెళ్ళను.

తల్లి: వెళ్ళి తీరాలి. లేకపోతే ఎలా?

నేనంటే ఎవరికీ యిష్టం లేదు.... అంతా నన్ను తిడుతున్నారు. మరి అలాంటప్పుడు నేను ఆ స్కూలుకి ఎందుకు వెళ్ళాలి?

తల్లి: ఎందుకు వెళ్ళాలంటే... నీకు నలభై రెండేళ్ళు కాబట్టి.... పై పెచ్చు ఆ స్కూలుకి నువ్వే హెడ్మాస్టరువి కాబట్టి...



"ఇదేనా నా రైలు?" అడిగేడు ఓ ప్రయాణికుడు.

"మీ రైలు కాదండీ భారత రైల్వేలకు సంబంధించింది" చెప్పాడు అక్కడున్న రైల్వే అధికారి.

"నాతో సరసాలాడకండ్సార్... నేనడిగేది ఏంటంటే దీనితో నేను విజయవాడ వెళ్ళవచ్చునా అని..." మళ్ళీ అన్నాడు ఆ ప్రయాణికుడు.

"దీనిలో వెళ్ళగలరు గాని దీనితో వెళ్ళలేరు సార్.... ఎందుకంటే ఇది చాలా బరువుగా వుంటుంది మీరు మొయ్యలేరు" నవ్వుతూ అన్నాడు రైల్వే అధికారి.

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : బంబైకా బాబూ |
| సంగీతం | : ఎస్.డి. బర్మన్ |
| రచన | : శైలేంద్ర |
| గానం | : ముకేశ్, బృందం |
| అభినయం | : దేవానంద్, సుచిత్రాసేన్ ఇతరులు |

## చల్‌రీ సజనీ




చల్‌రీ సజని అబ్ క్యా సోచే
కజ్‌రాన బహ్‌జాయె రోతే రోతే
బాబుల్ పఛతాయె హాథోంకో మల్‌కే
కాహే దియే పర్‌దేస్ టుక్‌డే కో దిల్‌కే ॥బాబుల్॥
ఆసూ లియే సోచ్‌రహా దూర్ ఖడారే ॥చల్‌రీ॥
మమతా కా ఆంచల్, గుడియోంకా కంగ్‌నా
ఛోటీబడీ సఖియాఁ, ఘర్ గలీ అంగ్‌నా ॥మమతా॥
ఛూట్‌గయా ఛూట్‌గయా ఛూట్‌గయారే ॥చల్‌రీ॥
దుల్హన్ బన్‌కే గోరి ఖడీహై
కోయీ నహీఁ అప్నా కైసీ ఘడీహై ॥దుల్హన్॥
కోయీ యహాఁ కోయీ వహాఁ కోయీ కహాఁరే ॥చల్‌రీ॥








ఎస్.డి. బర్మన్ సంగీత సారథ్యంలో ముకేశ్ పాడిన కోరస్ గీతాలలో రెండు చాలా బాగుంటాయి. ఒకటి 'బందినీ' లోని 'ఓ జానేవాలే' అయితే రెండోది ఇది. మొదటిది తన మూలంగా తన తండ్రి అపనిందల పాలవకూడదని హీరోయిన్ ఇల్లు వదిలి పోయేటపుడు వచ్చే నేపథ్యగీతం. రెండోది పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయే హీరోయిన్‌ని సాగనంపేటపుడు వచ్చే నేపథ్యగీతం. పెళ్ళి అయ్యాక అప్పగింతల సమయంలో వచ్చే ఇలాంటి పాటలు హిందీ సినిమాలలో మామూలే. వీటిని బిదాయీ (వీడ్కోలు) పాటలంటారు. అయితే 'చల్‌రీ సజనీ' మామూలు బిదాయీ పాట కాదు. చిత్రమైన ఈ సినిమా కథకు ముగింపుగా వచ్చే పాట.

ఈ చిత్రంలో దేవానంద్ ఒకతన్ని చంపి పోలీసుల నుండి తప్పించుకోవటానికి అతని స్థానంలో వాళ్ళ గ్రామానికి వెళతాడు.




అక్కడ హతుడి చెల్లెల్ని చూసి ఇష్టపడతాడు, ప్రేమ కనబరుస్తాడు. అతడు ఏనాడో ఇల్లు విడిచి వెళ్ళిపోయాడు కాబట్టి అతన్ని ఇంట్లో అందరూ ఆమెకి అన్నగానే చూస్తారు. ఆమె కూడా అతన్ని అన్నలాగే అభిమానిస్తుంది. అతను మాత్రం ఆమెను ప్రియురాలిగా చూస్తాడు. మనస్సులో కొంత ఘర్షణ జరిగాక దేవానంద్ ఆమెను వేరేవారితో పెళ్ళిచేసి పంపుతాడు.

దేవానంద్ పక్కన హీరోయిన్ కాని హీరోయిన్‌గా, చెల్లెలు కాని చెల్లెలిగా ఇలాటి పాత్ర వేయటానికి బొంబాయి హీరోయిన్‌లెవరూ ఒప్పుకోలేదో లేక దేవానంద్ ధైర్యం చేయలేదో గానీ ఈ పాత్రకు బెంగాల్‌లో టాప్ హీరోయిన్‌గా ఉన్న సుచిత్రాసేన్‌ను ఎంచుకున్నారు. వారిద్దరి మధ్య ఓ డ్యూయట్ కూడా ఉంది. 'దీవానా మస్తానా హువా దిల్'. అదీ బాగుంటుంది. కొంతకాలానికి బొంబాయి ఫీల్డుకి ధైర్యం వచ్చింది కాబోలు 'హరే రామా హరేకృష్ణ'లో దేవానంద్ చెల్లిగా నటించిన జీనత్ అమన్ తర్వాత అతని పక్కన హీరోయిన్‌గా పలు చిత్రాలలో నటించింది.

ఎన్నో విజయవంతమైన చిత్రాలకు దర్శకత్వం వహించిన రాజ్‌ఖోస్లాకు నిర్మాతగా ఇది తొలి చిత్రం. ఇలాంటి అసాధారణమైన కథను ఎంచుకోవటం ఆయన సాహసాన్ని తెలియజేస్తుంది. అయినా ప్రేక్షకులు ఈ చిత్రాన్ని ఆదరించలేదు. ఇలాంటి కథలను ప్రేక్షకులు తిరస్కరించడం భారతదేశంలో మామూలే. 1991లో యష్‌చోప్రా రూపొందించిన చిత్రమైన ప్రేమకథ 'లమ్హే' కూడా పరాజయం పొందింది.

ఈ 'చల్‌రీ సజనీ' పాట సుచిత్రాసేన్ పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయేటప్పుడు నేపథ్యంలో వినబడే పాట. అన్ని అప్పగింతల పాటల్లాగానే ఈ పాటలోనూ విషాదం ఉంది. కన్నవారిని వదిలి, కట్టుకున్నవాడి ఇంటికి ఆడపిల్ల వెళ్ళటం అందరికీ కంటతడి పెట్టించే దృశ్యం. ఆమెను ఉద్దేశించి ఓ చెలికత్తె ఓ పాడినట్టు సాగుతుందీ గీతం.











'చల్' అంటే 'పద' అని. దానికి 'రీ' జోడిస్తే చనువుగా 'పదవే' అన్నట్టు. 'సోచ్‌నా' అంటే 'ఆలోచించడం'. 'రోతే రోతే' అంటే 'ఏడ్చి ఏడ్చి' అని. 'కజ్‌రా' అంటే కాటుక. 'బహ్‌జానా' అంటే ప్రవహించటం, కొట్టుకుపోవడం. ఇక్కడ కాటుకకు వాడారు కాబట్టి దీని అర్థం 'కన్నీటితో కాటుక చెరిగిపోవటం'.

**'పదవే సఖీ, ఇప్పుడేం ఆలోచిస్తావు**
**ఏడ్చి ఏడ్చి కాటుక చెరిగిపోగలదు'**
**'ఇప్పుడేం ఆలోచిస్తావు సఖీ. వెళ్ళక తప్పదు.**
**ఏడ్చి ఏడ్చి కాటుక చెరిగిపోగలదు జాగ్రత్త'** అంటూంది.

'బాబుల్' అంటే తండ్రి. 'పఛ్‌తానా' అంటే పశ్చాత్తాపపడటం, బాధపడటం. 'హాథోంకో మల్‌కే' అంటే 'చేతులు నలుపుకుంటూ' అని. 'కాహే' అనేది 'క్యోం' అనే పదానికి మరో రూపం. 'ఎందుకు' అని అర్థం. 'పర్‌దేస్' అనేది 'పర్‌దేశ్' కి వికృతి. 'వేరే చోటు' అని అర్థం. 'దిల్‌కే టుక్‌డేకో' అంటే 'హృదయపు తునకను' అని. కవిత్వం పదాలను కొంచెం అటు ఇటుగా మార్చినా తరగని సొగసు హిందీ భాషది. ఇక్కడ 'టుక్‌డే కో దిల్‌కే' అనే ప్రయోగం అలాంటిదే. 'ఆఁసూ' అంటే కన్నీళ్ళు. 'దూర్ ఖడా' అంటే 'దూరంగా నిలబడి' అని. 'రే' అనేది కూడా 'రీ' లాగే చనువుగా వాడే పదం.

**'మీ నాన్న చేతులు నలుపుకుంటూ బాధపడుతున్నాడు**
**నా హృదయపు తునకను ఎందుకు వేరే చోటుకు ఇచ్చానా అని**
**కన్నీళ్ళు పెట్టుకుని దూరంగా నిలబడి ఆలోచిస్తున్నాడు'**

అంటూ కూతుర్ని సాగనంపేటపుడు తండ్రి బాధను వివరించారీ చరణంలో.

'ఆంచల్' అంటే పమిట. ఒడి అనే అర్థంలో కూడా వాడతారు. 'గుడియా' అంటే 'బొమ్మ'. 'కంగన్' అంటే గాజు. 'కంగ్‌నా' అంటే వధువుకి గాజులు తొడిగేటప్పుడు పాడే పాట. 'ఛోటీ బడీ' అంటే 'చిన్నా పెద్దా'. 'ఘర్' అంటే ఇల్లు. 'గలీ' అంటే వీధి. 'అంగనా' అంటే 'ఆంగన్' కు మరో రూపం. వాకిలి అని అర్థం. 'ఛూట్‌గయా' అంటే 'చేజారిపోయింది, దూరమయింది' అని.

**'మమత నిండిన ఒడి, బొమ్మల గాజులు**
**చిన్నాపెద్దా సఖులు, ఇల్లు వీధి వాకిలి**
**అన్నీ దూరమయ్యాయి'**
**ప్రేమతో సాకిన ఒడి, చిన్నప్పటి ఆటపాటలు,**
**చిన్నాపెద్దా చెలులు, ఇల్లు, వీధి,**
**వాకిలి అన్నీ దూరమవుతున్నాయి.**

'దుల్హన్' అంటే పెళ్ళికూతురు. 'గోరీ' అంటే తెల్లని అమ్మాయి. ఓ సుందరీ అనటానికి కూడా గోరీ అనేస్తారు. 'అప్నా కోయీ నహీఁ' అంటే 'తనవారు ఎవరూ లేరు' అని. 'ఘడీ' అంటే 'ఘడియ' 'యహాఁ' అంటే 'ఇక్కడ'. 'వహాఁ' అంటే అక్కడ. 'కహాఁ' అంటే ఎక్కడ.

**'పెళ్ళికూతురై చిన్నది నిలిచింది**
**తనవారెవరూ లేరు, ఎలాంటి ఘడియ ఇది**
**కొందరిక్కడ, కొందరక్కడ, కొందరెక్కడో'**

ఈ చరణంలో వధువు బాధ చెప్తున్నాడు. అమ్మాయి వధువుగా నిలిచింది. ఎటువంటి ఘడియ ఇది - పాతవాళ్ళతో బంధం తెగుతోంది. కొత్తవాళ్ళతో ఇంకా ఏర్పడలేదు. తనవాళ్ళంటూ ఎవరూ లేని సమయం ఇది. కొందరిక్కడున్నారు - అయిన వాళ్ళు. కొందరక్కడున్నారు - కావలసినవాళ్ళు. మరి కొందరు ఎక్కడో - ఒక స్పష్టమైన బంధమంటూ లేని హీరో కూడా ఉన్నాడు ఆమెకు.

ఈ చరణం వస్తున్నప్పుడు అన్నగాని అన్నగా దేవానంద్ మౌనంగా విలపిస్తుండగా సినిమా ముగుస్తుంది.

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

31వ పేజీ తరువాయి...




బి.వసంత, డి.పుష్పలత, టి.ఆర్.జయదేవ్, జి.ఆనంద్, వి.రామకృష్ణ, బి.గోపాలం, కె.మల్లికార్జునరావు, ప్రయాగ నరసింహశాస్త్రి, వి.పద్మశ్రీ, సీతారత్నకర్ పాడిన 17 పల్లెపదాలను ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి.వారు విడుదల చేశారు.

ఇందులో - తాలేలో లెల్లె ఏలో, ఎంత చల్లనీ తల్లివే, ఎంతటి వాడవోయ్, సందులోన బాయంటి పిల్లడో, మంచె దిగవె, అమ్మా మాయమ్మ, లాలి లాలమ్మలాలి, హోలీ హోలీరె రంగహోలి, అంబరాయె జగదంబరాయె, మందలోడా ఓరి మాయలోడా, గొబ్బియల్లో, రండిపుణ్యాత్ములారా, బండెనక బండికట్టి, శివ శివమూర్తి, నక్కలోళ్ళ చిన్నదాన్ని, చెంచిత ఏవూరిదానవే, లాలిముద్దుల గుమ్మ మొదలైన గీతాలున్నాయి.

మన సంస్కృతికి సంబంధించిన సంపద - రకరకాల ప్రభావాల మూలంగా - మనకి దూరమై పోతున్న రోజులివి. ఇటువంటి తరుణంలో అరుదైపోతూ దాదాపు అలభ్యం స్థాయికి చేరుకుంటున్నది ఏదైనా సరే మనకి అందితే - కంటి కన్నా ముందు గుండె చెమరుస్తుంది. అదే అనుభూతి కలుగుతుంది ఈ క్యాసెట్ వింటే.

ఈ క్యాసెట్‌లోని - తాలేలో, లాలి లాలమ్మ లాలి. రండి పుణ్యాత్ములారా, నక్కలోళ్ళ చిన్నదాన్ని, ఎంతటి వాడవోయ్, హోలి హోలిరె రంగహోలి, అంబరాయె, బండెనక బండి కట్టి, లాలీముద్దుల గుమ్మ వంటి పాటలు సూత్రధారులు, అందాల రాముడు, జైజవాన్, ఇంకా మరికొన్ని చిత్రాల ద్వారా వేరే రూపంలో మనల్ని అలరించాయి.

ఆయా చిత్రాలలోని తత్సంబంధిత గీతాలు విన్నవారు ఇప్పుడు ఈ పల్లె పదాలను వినగానే థ్రిల్ ఫీలయ్యే అవకాశం చాలా ఎక్కువ ఉంది కూడా! అంతేకాదు - ఇవాళ తెలుగు సినిమాకి ఒక మస్ట్‌గా అయిపోయిన ఫోక్ సాంగ్‌ల కోసం వెతుక్కునే వారికి ఒక ప్రేరణని, ఒకదారిని చూపిస్తుందీ క్యాసెట్.

కాలానికి ఎదురీది అప్పటి క్వాలిటీతో దొరికే పాటలని ఇప్పటి సౌండ్ సిస్టమ్స్‌కి అనువుగా తిరిగి మాస్టర్ చేయటం, వ్యాపారాత్మక ధోరణికి భిన్నంగా ఇటువంటి ప్రక్రియలతో క్యాసెట్‌లను విడుదల చేయటం. ఇవన్నీ అభినందించి ప్రోత్సహించదగ్గ ప్రయత్నాలు. ఒక్క ముక్కలో చెప్పాలంటే ఈ క్యాసెట్ - మంచి కలక్షన్లను పెంచుకునే వారింటనుండదగ్గది.




విడుదల : హెచ్.ఎం.వి

వెల : రూ.40/-

పౌరాణిక పాత్రలకు భారతదేశం మొత్తం మీద స్వర్గీయ ఎన్.టి.రామారావును మించిన వారు లేరన్నది నిర్వివాదాంశం. ఆయన నటించిన కొన్ని పురాణ పాత్రల సంభాషణలను ఒక ఆడియో క్యాసెట్‌గా తీసుకురావటమన్నది తెలుగువారి నాడిని కమ్మర్షియల్‌గా తెలుసుకున్న తెలివైన ఆలోచన.

'సీతారామకళ్యాణం' చిత్రం నుంచి రావణాసురుని పాత్ర, 'శ్రీకృష్ణార్జున యుద్ధం' చిత్రం నుంచి శ్రీకృష్ణుని పాత్ర, 'పాండవ వనవాసం' చిత్రం నుంచి భీముని పాత్ర, 'దాన వీర శూరకర్ణ' చిత్రం నుంచి దుర్యోధన - శ్రీకృష్ణ -కర్ణ పాత్రలు - పలికిన కొన్ని సంభాషణలను - ఆయా సన్నివేశాలలో పాల్గొన్న తదితర పాత్రధారుల సంభాషణలతోనూ, వీలయినంతవరకు అక్కడ ఉన్న పద్యాలతో సహా పొందుపరచారు ఈ క్యాసెట్‌లో.

చిత్రం, బ్యానర్, సంగీత దర్శకుడు, మాటల రచయితల పేర్లతో ఆయా సన్నివేశాలలో పాల్గొన్న నటీనటుల పేర్లను కూడా పేర్కొన్న ఇన్‌లే కవర్‌లో 'ధూళిపాళ' పేరు 'ధూలిపాలి' అని ముద్రణ అవటం ఒక్కటే లోపంగా అనిపిస్తుంది.

ఆ మహానటుని నటనాకౌశలాన్ని సంభాషణల ద్వారా మనోనేత్రంతో వీక్షించే అవకాశంగల ఈ క్యాసెట్‌ను ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లలో చేరాలనుకునే వారందరూ విని సాధన చేస్తే భవిష్యత్తులో కొందరి నటుల వాచకమైనా బాగుపడుతుందేమో!?.

## రచన: శివగణేష్ — 1 — గానం : శ్రీనివాస్

ఏకమే వా ద్వితీయమ్ (2)
ఏకోతేన: సర్వభూతాంతరాత్మా
ఏకాభాషా భూతకారుణ్యరూప
ఏకం లక్ష్యం సామరస్యం సమేషా
ఏకం సర్వం చిత్త మానంద భూనం

## రచన: శివగణేష్ — 2 — గానం : శంకర్‌మహదేవన్

అ: బాబా... బాబా...
అ: బాబా... కో: సినిమా సినిమా
అ: బాబా... కో: ఆటేరా
అ: బాబా... కో: సినిమా సినిమా
అ: బాబా...
అ: టిప్పు టిప్పు టిప్పు టిప్పు టిప్పు సుందరి
మంచి మాట చెప్పనీవె టిప్పు సుందరి (2)
జీవితమె కో: సినిమా సినిమా
అ: మూడే మూడు కో: గంటలు లే
అ: మూడే మూడు కో: గంటలు అంటే
అ: మూడే మూడు కో: ప్రాయాలే
అ: శిశివు ప్రాయం ఒకటి
పడుచు ప్రాయం రెండు
ముసలి ప్రాయం మూడు వినరా
కో: మూడు దశలు ముగియు మునుపె
ముల్లోకాలు గెలవరా అ: ॥టిప్పు టిప్పు॥
అ: పిల్లల తెల్లని మనసు
అది దైవం వెలిసే మనసు
పున్నమి చంద్రుని ఎగిరి పట్టి
బంతులాడేటి వయసు
బలం పెంచి భయము తుంచి
భవితనెంచి ఎదగరా
తల్లి నీడై మెదులు పెద్దపులిపై కదులు
బుద్ధి ఎరిగి మసలూ...
టిప్పు టిప్పు టిప్పు టిప్పు టిప్పు టిప్పు ఓకే ॥బాబా సినిమా॥
అ: అల్లరి చేసే వయసు
అది యవ్వనానికే సొగసు
చెట్టుసైతం చీరకట్టి
తాకి చూసే మనసు
ఉద్యోగాలు కోరి రావు
కోరి నువ్వే తరలిపో
నువ్వు కోరే ప్రేమ
ప్రేమ కాదోయ్ రామ
ప్రేమకర్థం చెప్పనా
కో: స్వచ్ఛమైన ప్రేమ అంటె కోరివచ్చు ప్రేమరో అ: ॥టిప్పు టిప్పు॥
అ: వృద్ధుల వంగిన వయసు
అది సిద్ధిని పొందే వయసు



## రచన: శివగణేష్ — 5 — గానం : జయచంద్రన్

ప: రాజ్యమా సన్యాసమా భోగమా లేక యోగమా
జ్ఞానియా అజ్ఞానియా ఎవరురా ఇతడు ఎవరురా
అంబరం దాటిన అతిశయం బాబా జాతకం ॥అంబరం॥
ప్రశ్నలా బతికెలే మౌనమై వెలిగెలే ॥రాజ్యమా॥
చ: కొడుకులు లేని ఒడిలోకి వెలుగై వచ్చిన రాజాయే
వాసనలెన్నో పంచుటకు దైవమిచ్చిన రోజాయే
కీర్తికి బదులు భుజములపై మూటలెన్నో మోశాడు
విధి ఇది విధి ఇది అని తలచి చెమట నోడ్చి బతికాడు
ఏ వృత్తిలోనైనా తప్పులేదు అంటాడు
పనిమాని కూర్చుంటే ముప్పువుంది అంటాడు
పెరిగినా తరిగినా ఎన్నడూ తొణకడు
అతిశయం ఎంతో అతిశయం అతిశయం బాబా జాతకం
చ: దేవుడు లేడని ప్రతిపూటా బోధించాడు నాస్తికత
భౌతికవాదం మదిలోన పూసిందేలా ఆస్తికత
నుదుట విభూదిని దిద్దుకుని వస్తున్నాడు ఈ జ్ఞాని
ఆశ్చర్యమాశ్చర్యంగా వుండే
అయ్యాడయ్యో రాముడే
తన తల్లి ప్రేమకే తలవంచె నీబాబా
హృదయాన ఏనాడు పసివాడు ఈ బాబా
వేదనే తొలిన పెన్నిధై వెలిగెలే ॥రాజ్యమా॥

## రచన: శివగణేష్ — 6 — గానం: కార్తిక్

మే మడుగేస్తే అదరాలి అధికార పీఠం
మే మెదురొస్తే బెదరాలి భేతాళ భూతం
శక్తినివ్వు... శక్తినివ్వు...
దేవా... దేవా... తల్లివి నీవే తండ్రివి నీవే
ప్రణవము నీవే ప్రాణము నీవే ॥తల్లివి॥
రేణువు నీవే స్థాణువు నీవే
జులుమునణచుటకు
భువిని గెలుచుటకు శక్తినివ్వు ॥నే॥
నట్టేటి నావలనే నడిపించు శక్తినివ్వు
మునిగేటి జీవులనే రక్షించు శక్తినివ్వు
తలపొగరు సిగపట్టి కీర్తించు శక్తినివ్వు
తన ఇంటి చీకటిని తొలగించే శక్తి నువ్వు
కాలాగ్ని జ్వాలల్ని ఛేదించే శక్తినివ్వు
నా మాటతో ఊరు మారేటి శక్తినివ్వు ॥తల్లివి॥
బిగిపట్టు పట్టాక సడలించబోను
ముందడుగు వేశాక వెనుకాడబోను
ననునమ్ము తమ్ముళ్ళని వంచించబోను
ఓ నిచ్చెనై నిలుచుండి నే మోసబోను
నా ప్రజల క్షేమాన్ని నే మరచిపోను (2)
నే బ్రతికేది నీ కొరకె విడిచినేపోను
మద్దెలను మిద్దెలను నే కోరుకోను
కాలాల హద్దులను నే మించబోను
దేవా... దేవా... ॥తల్లివి॥



## రచన: కులశేఖర్ — 1 — గానం: ఆర్.పి. పట్నాయక్

ప: ఔనని అంటావో మరి కాదని అంటావో
ఏమంటావో ఏమోనన్న సందేహంతో
ఏమని చెప్పాలో నీకేమని చెప్పాలో
తెలియక సతమవుతోంది నా మనసెంతో
అటో ఇటో ఎటో మరి తేలని నిమిషంలో
ఎలా చెప్పనమ్మా నాలోని ప్రేమని
ఎలా చూపనమ్మా నా ప్రేమ నువ్వని ॥ఔనని॥
చ: చిగురాకుల లేఖలు వ్రాసి చిరుగాలి చేతికి యిచ్చి
ఎపుడో నే పంపించాను నువ్వు చూడలేదా
నా మనసే పడవగ చేసి కలలన్ని అలలుగా చేసి
ఎపుడో నే పంపించాను నిన్ను చేరలేదా
చెప్పాలని అనిపిస్తున్నా నా ఎదుటే నువ్వు కూర్చున్నా
మనసులోన మాట నీకు చెప్పలేక పోతున్నా
చెప్పకుండా ఓ క్షణమైనా వుండలేక పోతున్నా ॥ఎలా॥ ॥ఔనని॥
చ: ప్రేమన్నది ఊపిరి కాదా అందరిలో వుండేదేగా
పరిచయమే లేదని అంటే వింతే కదా
నువ్వున్నది నాలోనేగా ఈ సంగతి వినసే లేదా
మదిలోనే నువ్వు నిదరోతూ గమనించలేదా
ఎదనిండా ఆశలు వున్నా ఎన్నెన్నో వూసులువున్నా
ప్రేమభాష రాదు అంటే నమ్మవా ఓ మైనా
కళ్ళలోకి చూసి అయినా పోల్చుకోవ నా ప్రేమ ॥ఎలా॥ ॥ఔనని॥

## రచన: కులశేఖర్ — 2 — గానం: కె.కె.,కవితా సుబ్రమణ్యం

ప/అ: ఆడపిల్లలూ అరె లేడిపిల్లలూ
హంస నడక నేర్చుకున్న చేపపిల్లలూ ॥ఆడ॥
ఆ వాలు చూపులు విసిరేసి పాపలు
మగవారిలోన ప్రేమచిచ్చు పెట్టిపోదురు ॥ఆడ॥
చ/అ: నీలో నాలో మౌనం తెంచే పాటే కాదా ప్రేమ నిజంగా
ఆ: ఆటా పాటా ప్రేమేనంటే అయ్యోపాపం కుర్రతనంగా
అ: అందరికి అందదుగా ప్రేమసుధ
ఆ: ఎందుకలా ప్రేమ పట్టి కట్టు కథ
అ: లైలా మజ్నూలా... గాథే తెలుసు కదా..
ఆ: అయ్యో వారి కథ... చివరికి వేరుకదా...
ఆ: మీకు... అ: మాకు... ఆ: దూరం తప్పదుగా ॥ఆడ॥
అ: కళ్ళూ కళ్ళూ చదివే భాషా... ప్రేమేనయ్యో చూడు తమాషా
ఆ: హల్లో అంటే ప్రేమేనంటూ... అయ్యో రామా ఇంత పరాకా
అ: మనసులిలా ముడిపడని పెళ్ళి వృథా... ఆ: పెళ్ళి తంతు జరిగేది పైనకదా...
అ: ప్రేమే పెళ్ళికిలా... పువ్వుల పల్లకిగా
ఆ: తేడా వచ్చినదా... ప్రేమే చావుకదా...
అ: మీకు... ఆ: మాకు... అ: వాదం తప్పకదా...
ప/ఆ: బ్రహ్మచారులు... కొయ్యొద్దు కోతలు
వెనక నుంచి తియ్యవద్దు తీపి గోతులు అ: ॥ఆడ॥
ఆ: మీ మాయ మాటలు నమ్మేది ఎవ్వరూ
అరె ఆడగాలి సోకగానే రెచ్చిపోదురూ అ: ॥ఆడ॥



## రచన: కులశేఖర్ — 8 — గానం: ఆర్.పి.పట్నాయక్, సునీల్

సునీల్: బావా ఈ సందడంతా చూస్తుంటే
చిన్నప్పటి అల్లరంతా గుర్తొచ్చేస్తంది
మా ఊర్లో కరోడా కజిన్స్ అని ఇద్దరు
సిస్టర్స్ ఉండేవారు తెలుసా!
ఉదయ్: మళ్ళీ స్టార్ట్ చేశాడ్రా...
సునీల్: ఆకాశానికి సూర్యుడు,
చంద్రుడు ఎలాగో
మా ఊరికి చింతామణీ చూడామణి అలాగ
మేటర్ లైన్‌లో ఎట్టేద్దామని
లక్స్, మెడిమిక్స్ చేతిలో ఎట్టుకుని
అ: ఓ ఎగేసుకుంటూ ఎలిపోయాను...
ఆ తరాత ఏమైందిరా
ప/అ: చింతామణి సిగ్గుపడింది
బంగారు మావ ఊరంతా చిన్నబోయింది
చూడామణి మండిపడింది
సూరయ్య మావ ఒళ్ళంతా వణుకు పుట్టింది
కో: చూడు బుల్లోడా... అయ్యో పాడు పిల్లోడా...
సొరకాయలలా... ఊరికెనే కోయకయా...
ఆడ మజాకా... మరీ తీసి పడేకా...
చాలునిక... కోతలిక... ఆపవయా... ॥చింతామణీ॥
చ/అ: కుడికాలు ముందుపెట్టి రమ్మన్నది
అడుగేస్తే పూలదండ వచ్చిపడింది
ఊరంతా తోటకూర కట్టన్నది
యవహారం నాన్చకుండా చెప్పమన్నది
సునీల్: బావగారు అంది మంచివారు అంది
చూడు చూడు అంది
సొటిలేరు అంది
అ: పైనుంచి కిందకొచ్చిందా
అందాల బొమ్మ చూపుల్తో రెచ్చగొట్టిందా
ఊరిస్తే ఊగిపోయిందా
కుర్రాడి జిన్న... ఈలేసి గోలపెట్టిందా... ॥చింతామణీ॥
చ/అ: గడియారం గంటకొట్టి లెమ్మన్నది
ఫలహారం పెట్టి మరీ పొమ్మన్నది
సెంటు గుప్పుమని కొట్టన్నది
గుండెల్లో మాట తనే గుర్తు పట్టింది
పూవులు పెట్టింది గాజులు వెయ్యంది
రైకలు తెమ్మంది కోకలు కొనమంది
సునీల్: మాగాణి రాసిఇమ్మంది ఆ రంగసాని
అందాక రాను పొమ్మంది
అబ్బబ్బో జల్లు కొట్టింది నేనెల్లగానె
ఇంకోర్తో ఎల్లిపోయింది. కో: ॥చింతామణీ॥

రచన:శివగణేష్ **4** గానం : ఉదిత్‌నారాయణ్, సుజాత

అ: మాయ మాయ మాయ అంతా మాయ
ఛాయ ఛాయ ఛాయ అంతా ఛాయ ॥మాయ॥
సంతోషి సంతోషి సంతోషి
కో: నువ్వు సంతోషంలో తేలే సన్యాసి
అ: సంతోషి సంతోషి సంతోషి నీ
సంతోషి నీతోటి సహవాసి ॥మాయ॥
పట్టీ పట్టనట్టుగా ఉండీ లేనట్టుగా
తామర ఆకుల్లో నీరల్లె నువ్వు
అంటీ అంటక ఉండు ॥తామర॥ ॥మాయ॥
అ: వాసన అందం వాడితె అంతం
పూవుల చందం మనుషుల జన్మం
భువిలో మనకు శాశ్వతమేదీ
పవళింపు వరకు స్వతంత్రమేదీ
విషయం చెబితె అతనిది సోది
విషమం పేరే రాజకీయ వాది
అందులో ఏమున్నది అది ఓ పదవుల వ్యాధి
మనిషికి కాలు చెయ్యే మరవని నేస్తాలయ్యే
సంద్రాలపై నూనె బిందువుమల్లె
నువ్వు అంటీ అంటక వుండు ॥మాయ॥
ఆ: గాలమ్మా గాలమ్మా నా చెలినికిటీ తెలుపమ్మా
కన్నీరే కన్నీరు నా మనసే చదువమ్మా
మాయల్లే ఛాయల్లే కన్నె వలపు
ఏనాడూ మారదులే
ప్రాణంలో ప్రాణంగా ఉన్న సొగసు
పసివాడి పోనిదిలే
గాలమ్మా గాలమ్మా
నా చెలునికిటీ తెలుపమ్మా
అ: పట్టీ పట్టనట్టుగా
ఆ: పట్టే రస పట్టుగా
అ: ఉండీ లేనట్టుగా
ఆ: వచ్చే లేటెస్టుగా
అ: తామర ఆకుల్లో నీరల్లె నువ్
అంటీ అంటక ఉండు
తామర ఆకుల్లో నీరల్లె
ఆ: నువ్ నాతో జంటగ వుండు
సంతోషి సంతోషి సంతోషి నువ్వు
నా జంటై వెంటొస్తే సంసారి
సంతోషి సంతోషి సంతోషి నువ్వు
తాకేస్తే అవుతాలే నీ దాసి కో: ॥మాయ॥
అ: పట్టీ పట్టనట్టుగా ఉండీ లేనట్టుగా
తామర ఆకుల్లో నీరల్లే
నువ్ అంటీ అంటక వుండు...
తామర ఆకుల్లో నీరల్లె
ఆ: నువ్ నాతో జంటగ వుండు



కమ్మని స్మృతులను నెమరువేస్తూ
నెమ్మది కోరే వయసు
కుటుంబ భారం మరచిపోయి
కోర్కె విడిచి బ్రతకవోయ్
మౌనమందే నిలచి
ధ్యానమంతా తరచి
విధికి తలనే వంచి
కో: వెలుగుతున్న యువతరాన్ని
వెన్నుతట్టి నిలిచిపో అ: ॥టిప్పుటిప్పు॥

రచన : శివగణేష్ **3** గానం : యస్.పి.బాలు, సాధనా సర్గమ్

ఆ: హ హ హ...
అ: హలో
ఆ: హె యూ... హె యూ ఊ ఊ
ఆహోహో
అ: ఏవంటున్నావ్...
ఆ: హె యూ ఊ ఊ ఆహోహో
బాబా నీకు మొక్కుతా
నా భారాలన్నీ నీపై వేస్తె మోస్తావా
బాబా ఓ పువ్విస్తా
ఈ భక్తురాలి బాధ కాస్త వింటావా
తుళ్లెనె గిల్లెనె నుదుటిపై నీ కురులు
గడ్డమె అడ్డమోయ్ శాంతంగ మారాలోయ్
కాస్త నువ్ మారితే సూరీడై వెలుగుదువోయి
అ: గిచ్చొద్దే గుచ్చొద్దే బాధా గాధా చెప్పొద్దే
నువ్ మారమంటె మారిపోడీ బాబా బాబా
నాలాగ నేనుంటేనే నలుగురికీ నయమంటానె
తగువేదీ రాదంటానే ఆహోహో ఆ: ॥బాబా॥
ఆ: బాబా నిన్నే బావా అంటే
బాబోయ్ నన్నొదిలెయ్ అంటూ
పరుగేలా (2)
పులకించు వేళ మొలకెత్తు వలపే
బాగుంది బాగుంది బాబా ॥పులకించు॥
అ: పిల్లేమొ గోరంత అహ పులకింత కొండంత
ఈ మోహం ఈ మైకం నాకోదింత
ప్రేమల్ని పంచావంటె బాబా ఒక పిల్లాడే(2)
కొమ్ముల్ని విసిరావంటి... ఆ: ॥బాబా॥
ఆ: బాబా వాకిట వాలాలంటూ వేవేల
జనులున్నా నన్నే ఎన్నుకున్నావెందుకో (2)
నీ రంగు మల్లె నా రంగు మారే
వరమివ్వ గలవా బాబా ॥నీరంగు॥
అ: మనసార నే రాలేదు విధిగారు కలిపేశారు
ఏం చేసేదమ్మాయ్‌గారు ఆహోహో
రంగంటే రంగా ఇది వరం వల్ల వచ్చిందిది
నా తల్లి ఇచ్చిందిది ఆహోహో ఆ: ॥బాబా॥



చ/ఆ: గుండెకీ గుండెకీ తెరచాటు ప్రేమ బహుశా
అ: ప్రేమనేదెప్పుడూ పొరపాటు కాదు మనసా
ఆ: ఇంతలో ఎంతగా ననుమార్చెనమ్మ ప్రేమా
అ: అందుకే ముందుగా ప్రేమించమంది ప్రేమా
ఆ: కరిగించెనమ్మ ఈ వలపూ
ఇదిగో యిలా యిలా నా మనసూ కో: తెలుసు తెలుసు తెలుసు ॥నీ మనసు॥

రచన: కులశేఖర్ **6** గానం: సునీతారావు

ప: ఛమకు చమ తళుకుల ఈ ప్రేమా
చరితలో చెరగని చిరునామా
మనిషికథ నడిపేదీ ప్రేమేసుమా ॥ఛమకు॥
ఈ గాలిలోన ఈ నీటిలోన అణువణువు నిండెనే ఈ ప్రేమా
కష్టాలలోన కన్నీటిలోన వెనకడుగు వేయదే ఈ ప్రేమా
ఈ ప్రేమా... ఈ ప్రేమా... ఈ ప్రేమా... ॥ఛమకు॥
చ: మమతల మదిలో చిలిపి జత తలపుల తడిలో అణువంత మారదు ప్రేమా...
కలతల ఒడిలో ఎడబాటు చినుకుల జడిలో మనసులను మరవదు ప్రేమా...
సమాజం కత్తులు దూస్తున్న
ఖలేజా వున్నది ఈ ప్రేమా
క్షణాల్లో ఓడిపోయి మారిపోదుగా... ॥ఛమకు॥
చ: పిడుగులు పడినా అడుగడుగు వరదలు అయినా అదిరిపడి మారదు ప్రేమా...
పిడికిలిలోన పగసెగల పరదాల్లోనా క్షణమైనా దాగదు ప్రేమా...
జనాల్లో ఎవ్వరు ఏమన్నా సరేలే కాలము కాదన్నా
నిజంగా ప్రేమనేది ఓడిపోదుగా... ॥ఛమకు॥

రచన: కులశేఖర్ **7** గానం: ఉదయ్‌కిరణ్, అనూప్

ప: లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్ మేకిట్ కలర్‌ఫుల్
కష్టంరాని, నష్టంరాని జానేదేదోయార్
డోంట్‌బి సారోఫుల్ బీ చీర్‌ఫుల్
కన్నీరైనా పన్నీరైనా టేకిట్ ఈజీయార్
దమ్ముంటేనే దిల్ చిన్న రిస్క్ వుంటేనే థ్రిల్
గాలం వేసి గోలి మారో యార్... ఓ...
బడే ముష్కిల్ వారే వాటే మిరాకిల్
వెరి వెరి వెరి వెరి బ్యూటిఫుల్
లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్ మేకిట్ కలర్‌ఫుల్
కష్టంరాని నష్టంరాని జానేదేదోయార్
కలర్స్ ఆఫ్ లవ్ దేఖో కలర్స్ ఆఫ్ లవ్
వారే వారే వారే వాటే వండర్‌ఫుల్ ॥కలర్స్॥
చ: లైఫ్ ఈజ్ సో సింపుల్ మేకిట్ ఫ్రూట్‌ఫుల్
జీనా మర్‌నాలోనే వుంది టోటల్ క్యారెక్టర్
బ్రైన్ ఈజ్ పవర్‌ఫుల్ మేకిట్ యూజ్‌ఫుల్
అప్పర్ పోర్షన్ వేకెంట్ అయితే అంతేలేయార్
గాడ్ ఈజ్ సో గ్రేట్ హీ ఓన్లీ క్రియేట్స్
నేచర్ కన్నా టీచర్ లేదోయార్
బడే ముష్కిల్ వారే వాటే మిరాకిల్
వెరి వెరి వెరి వెరి బ్యూటిఫుల్ ॥లైఫ్॥ ॥కలర్స్॥





రచన:కులశేఖర్ **3** గానం : కె.కె., సాధనా సర్గమ్

ప/అ: ఓ చెలియా నా చెలియా నేలకు వచ్చిన దేవకన్యవా
ఓ సఖియా నా సఖియా పున్నమి వెన్నెల కాంతిరేఖవా ॥ఓచెలియా॥
కళ్లముందర స్వర్గం నీవా అందమంటే అర్థం నీవా
నడిచి వచ్చిన బాపూ బొమ్మవా?! హోయ్ ॥ఓ॥
చ/ఆ: పత్రం పుష్పం ధూపం దీపం గుళ్లో పెట్టమంది గుండెలోన కోరికమ్మ
అ: అందం చందం అన్నీ వున్నా మ్మమ్మ ముద్దుగుమ్మ సొంతమైతే చాలునమ్మ
ఆ: ఏమాటా చెప్పలేక పెదవంచు ఆపిందీ
అ: ఆరోజే నిన్నుచూసి పులకింత రేగిందీ
ఆ: ఈమరుమల్లె విరబూసింది ఈ గాలి కౌగిళ్లలో... అ:॥ఓ॥
చ/అ: నువ్వే అందం నడకే నాట్యం ఎట్టా చెప్పనమ్మ భాషలంటు చాలవమ్మ
ఆ: నువ్వే రాగం నువ్వే తాళం నువ్వే ప్రాణమంది చూడవయ్యొ కన్నెజన్మ
అ: నీ తోడే లేకపోతే మది బోసి పోతుందీ
ఆ: నీ స్నేహం తీగలాగ నను అల్లుకుంటోందీ
అ: నీ చిరునవ్వే సిరిసిరిమువ్వై మోగింది నా గుండెలో ॥ఓ॥

రచన: కులశేఖర్ **4** గానం: కె.కె.

ప: ప్రియతమా ప్రియతమా
నువ్వేనా ప్రేమన్నావూ ఏమైందో కాదన్నావూ
నా స్నేహం చేదైందా నేస్తమా
మనసున్నా మాటలు రావూ మమతల్నీ కాదన లేవూ
శిలలాగే మారేవు ప్రాణమా!
ప్రియతమా ప్రియతమా... ప్రియతమా
చ: నీ జ్ఞాపకాలే యిలా నా కంటి పాపాయిలా
ఉన్నాయిలే కళ్లలో కన్నీటి లోగిళ్లలో
నీ అందె సవ్వళ్లనీ నా గుండె చప్పుళ్ళుగా
ఊహించడం నేరమా ఓ... నా ప్రేమలో లోపమా
మౌనం దూరం చేసినా కాలం కంచెలు వేసినా
ప్రాణం నీ జత చేర్చదా ప్రాణమా! ॥నువ్వేనా॥

రచన: కులశేఖర్ **5** గానం: ఆర్.పి.పట్నాయక్, సాధనా సర్గమ్

ప/ఆ: నీ మనసు నాకు తెలుసు అ: తెలుసు తెలుసు తెలుసు
అ: నీ వరస నాకు తెలుసు ఆ: తెలుసు తెలుసు తెలుసు
ఆ: తొలిప్రేమలో హాయి యిప్పుడే నేను తెలుసుకున్నానులే
అ: ఈరోజుకై నేను నిద్దరే మాని ఎదురు చూశానులే
ఆ: నువు లేనిదే నేను లేననీ అంది మనసూ... ॥తెలుసు॥
చ/అ: ఎప్పుడో చెప్పినా నువు నమ్మలేదు మనసా
ఆ: ఇప్పుడే చేరినా యిక ఆగనంది తెలుసా
అ: గుండెలో గూటిలో ఆగేది కాదు ప్రేమా
ఆ: మాటలో పాటలో చెప్పేది కాదు ప్రేమా ॥నీ మనసు॥
అ: పుడితేను చాలు ఈ వలపూ
కనిపెట్టగలదులే నా మనసూ కో: తెలుసు తెలుసు తెలుసు



రజని

లోటస్ ఇంటర్నేషనల్

# బాబా

సురేష్‌కృష్ణ

ఎ.ఆర్.రహమాన్

తెలిసింది గోరంత తెలియంది కొండంత



పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.



## తారాగణం

ఉదయ్‌కిరణ్, రిచా, చంద్రమోహన్, చలపతిరావు, ఎల్.బి.శ్రీరాం, గిరిబాబు, సునీల్, జె.పి.రెడ్డి, బెనర్జీ, రఘు, సుధ, కవిత, రాధాకుమారి, రాజశ్రీనాయర్, శ్రీలక్ష్మి, షాదాబ్, సుమిత్, వేన్యా, శ్వేత, రేష్మి తదితరులు...

ఎస్.పి. క్రియేషన్స్

# హోలీ

నిర్మాత: ఎస్.సూర్యప్రకాశరావు దర్శకత్వం: యస్.వి.ఎన్. వరప్రసాద్
సంగీతం: ఆర్.పి.పట్నాయక్ పాటలు: కులశేఖర్

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : ఆర్.పి. పట్నాయక్ |
| పాటలు | : కులశేఖర్ |
| మాటలు | : కల్యాణకృష్ణ |
| కెమెరా | : శరత్, సమీర్ రెడ్డి |
| ఎడిటింగ్ | : శంకర్ |
| ఆర్ట్ | : పేకేటిరంగా |
| డాన్స్ | : శంకర్ మరియు బృందం |
| స్టిల్స్ | : రాజా |
| పబ్లిసిటీ | : కృష్ణ డిజిటెక్స్ |
| కో-డైరెక్టర్స్ | : శేషు - నాగరాజు |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : సురేష్, ప్రవీణ్, మధు |
| మేకప్ | : శివ |
| కాస్ట్యూమ్స్ | : కుమార్ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : హరనాథ్, ప్రసాద్ |
| ఎక్సిక్యూటివ్ నిర్మాత | : కూనిరెడ్డి శ్రీనివాస్ |
| నిర్మాత | : ఎన్. సూర్యప్రకాశరావు |
| పి.ఆర్.ఓ. | : రాంబాబు వర్మ |

కథ, స్క్రీన్‌ప్లే - దర్శకత్వం : ఎస్.వి.ఎన్.వరప్రసాద్



ఎన్. సూర్యప్రకాశరావు



ఎస్.వి.ఎన్. వరప్రసాద్



ఆర్.పి. పట్నాయక్



కులశేఖర్

# కింగ్ ఆఫ్ రాక్ - ఎన్ - రోల్



ఈ ఆగస్టు 16న ఎల్విస్ ఉన్మాదం ప్రపంచాన్ని మరొక్కసారి చుట్టుముట్ట బోతోంది. రాక్-ఎన్-రోల్ అనగానే తన పేరే గుర్తుకు వచ్చేట్లా చేసుకున్న ఆ పాప్ దేవుడు ఎల్విస్ మరణించి ఆవేళ్టికి 25 సంవత్సరాలు కాబోతోంది. 1960 ప్రాంతాల్లో ఎల్విస్ ఆడిందే ఆట, పాడిందే పాట! అతని స్థానాన్ని వేరెవరూ చేరుకోలేనంతగా ప్రజల మనస్సులలో తిష్టవేసుకున్నాడు. అతని ఇమేజిని ఆ నాటి ప్రేక్షకులే కాదు, ఈ నాటి ప్రేక్షకులు కూడా మరవలేని విధంగా ఈ వర్ధంతి సందర్భంగా చేస్తున్నారు ఎల్విస్ అభిమానులు! అలా మెస్మరైజ్ కాబడే ఈనాటి ప్రేక్షకులలో ఎక్కువ మంది ఎల్విస్ మరణించిన దశాబ్దం తర్వాత పుట్టినవారే!

అవును, వాల్ట్ డిస్నీ వారు విడుదల చేస్తున్న "లైలో అండ్ స్టిచ్" అనే యానిమేటెడ్ సినిమా కథాంశం అంతా ఎల్విస్ చుట్టూనే తిరుగుతుంది. ఎల్విస్ అంటే ఎల్విస్ పాటల చుట్టూ అన్నమాట. లైలో హవాయి ద్వీపంలో ఉండే చిన్నపిల్ల. ఆమె తల్లిదండ్రులు చనిపోయారు. వారు ఎల్విస్ అభిమానులు కావడం చేత ఇంటినిండా బోల్డు ఎల్విస్ రికార్డులు. ఆ పాప అవి వింటూ తనను తాను ఓదార్చుకుంటూ ఉంటుంది. ఇతరగ్రహం నుండి స్టిచ్ అనే జీవి ఒకటి వచ్చి లైలోను కలుస్తుంది. దాన్ని చూసి కుక్కపిల్ల అనుకుంటుంది లైలో. స్నేహితులు ఎవరూ లేరు కాబట్టి స్టిచ్‌ను చేరదీసి దానికీ ఈ పాటలు వినిపిస్తుంది. స్టిచ్‌కు కూడా ఆ పాటలు నచ్చి లైలోను సంతోషపెట్టడానికి ఓ సారి ఎల్విస్ వేసుకునే తెల్ల జంప్‌సూట్ వేసుకుని ఎల్విస్‌లాగ డాన్సు చేస్తుంది కూడా!



జనాల్లో ఎల్విస్ కున్న క్రేజ్‌ను కాష్ చేసుకోవడం డిస్నీ ప్రొడక్షన్స్‌కి మాత్రమే కాదు, ఇంకా చాలామందికి తెలుసు. RCA/BMG హెరిటేజ్ వారు 4 సిడిల సెట్‌ను రిలీజ్ చేశారు. పేరు - "ఎల్విస్.. టుడే, టుమారో, అండ్ ఫరెవర్". దాంట్లో ఇంతకు ముందు రిలీజ్ కానీ 100 ఎల్విస్ ట్రాక్స్ ఉన్నాయి. ఎల్విస్ 30 నెంబర్ 1 హిట్స్ సెప్టెంబరులో రిలీజ్ కాబోతోంది. RCA రికార్డు కంపెనీ వాళ్ళు విడిగా అతని 1968 నాటి 'ఎ లిటిల్ లెస్ కాన్వర్సేషన్' మళ్ళీ విడుదల చేస్తున్నారు. జంకీ XI వాళ్ళ రీమిక్స్ చేసి విడుదల చేసిన 'ఎల్విస్ వెర్షన్ JXL - ఎ లిటిల్ లెస్ కాన్వర్సేషన్' బ్రిటన్‌లో అప్పుడే నెం.1 స్థానానికి చేరుకుంది.

42 ఏళ్ల మాత్రమే జీవించినా, చనిపోయిన 25 ఏళ్ల తర్వాత కూడా శ్రోతలను ఇంతగా ముగ్ధులను చేయగలిగిన ఎల్విస్ ప్రెస్లీ జననం 1935లో అమెరికాలోని మిసిసిపీ రాష్ట్రంలో. స్కూలు చదువుకు గుడ్‌బై కొట్టేసి చిన్నా, చితకా పనులు చాలా చేసేవాడు. 19 ఏళ్ల వయసులో ఉండగా మెంఫిస్‌లో ఉన్న సన్ స్టూడియోకు వెళ్లాడు. వాళ్ల అమ్మకు బర్త్‌డే గిఫ్ట్‌గా తను ఒక బలాడ్ పాడి రికార్డు చేసి ఇద్దామని ఎల్విస్ ఉద్దేశం. అతని పాట విని ముగ్ధురాలైన ఆ స్టూడియో సెక్రటరీ మేరియన్ కైస్కర్ సన్ స్టూడియో అధిపతి శామ్ ఫిలిప్స్‌కి ఎల్విస్ గురించి చెప్పి అతని చేత పాటలు పాడించకూడదా అంది. స్కాటీ మూర్ ఎలక్ట్రిక్ గిటార్, బిల్ బ్లాక్ స్ట్రింగ్ బాస్ మీద సహకారం అందిస్తూండగా ఎల్విస్ ఎకూస్టిక్ గిటార్ వాయిస్తూ పాటలను పాడేసరికి బ్రహ్మాండమైన టీమ్ ఏర్పడిపోయింది. వాళ్ల జానపదగీతాలను రాక్ వెర్షన్‌లో పాడి ప్రజలను ఆకట్టుకోసాగారు.

రాక్ అంతకు ముందు లేదని కాదు. రిథమ్ అండ్ బ్లూస్ (ఆర్ & బి.) అనే పేరుతో ఉండేది కానీ అది నల్లవాళ్ల మధ్యనే ప్రాచుర్యంలో ఉండేది. బిల్ హేలీ వంటి తెల్లవాళ్లు పాడడం మొదలుపెట్టడంతో 1954 ప్రాంతాల నుండి దానికో మర్యాదా, ప్రాభవం అబ్బాయి. చేస్తున్న ట్రక్‌డ్రైవర్ ఉద్యోగం వదిలేసి ఎల్విస్ గిటారిస్టులు స్కాటీ, బిల్స్‌లతో కలిసి టూర్లు చేసేవాడు. ఆగస్టు 1954 నుండి ఏడాది లోపల సన్ స్టూడియోవాళ్లు 5 ఎల్విస్ సింగిల్స్ రిలీజ్ చేశారు. ఆ రికార్డులకు ఒకవైపు ఆర్ & బి సాంగ్, మరోవైపు రాక్ ధోరణిలలోకి మార్చిన కంట్రీ సాంగ్. ఇవి బాగా పాప్యులర్ కావడంతో RCA కంపెనీవాళ్లు 35 వేల డాలర్లు ఇచ్చి ఎల్విస్‌తో కాంట్రాక్టు కుదుర్చుకున్నారు. ఏప్రిల్ 1956లో రిలీజయిన "హార్ట్ బ్రేక్ హోటల్" నంబర్ వన్ స్థానం చేరుకుంది. అదే ఏడాది ఎల్విస్ సినిమారంగ ప్రవేశం చేశాడు. ఆ సినిమా పేరు వేరే అనుకున్నారు కానీ అంతకు ముందే అతను పాడిన "లవ్ మీ టెండర్" అనే పాట హిట్ కావడంతో ఆ పేరే ఆ సినిమాకు పెట్టేశారు. తర్వాత సంవత్సరంలో వచ్చిన "జైల్ హౌస్ రాక్" అతని ఉత్తమ చిత్రం అంటారు. క్రమంగా అతను నటన మెరుగు పరచుకున్నాడు. కానీ అతని ఏజంటుగా పనిచేసిన కల్నల్ టామ్ పార్కర్ ధోరణే వైరు. 'నువ్వు యాక్టింగ్ చేయవలసిన పనిలేదు. నీ ఆటా, పాటా చూస్తేనే చాలు. ప్రజలు వెర్రెక్కిపోతారు' అనేవాడు. దాంతో ఒకేరకం ఫార్ములా చిత్రాలు తయారయ్యాయి. దేనికైనా ఓవర్‌డోస్ పనికి రాదంటారు. ఎల్విస్ సినిమాలు కూడా దెబ్బతినే గతి పట్టించాడు పార్కర్. బార్బరా స్ట్రీసాండ్ "ఎ స్టార్ ఈజ్ బోర్న్" (1976) తీస్తూ ఎల్విస్‌కు మంచి పాత్ర ఆఫర్ చేసింది. అది ఒప్పుకున్నా ఎల్విస్ దశ తిరిగేదేమో కానీ పార్కర్ కుదరదనేశాడు.

ఎల్విస్‌కి ఎంఫిటమైన్ డ్రగ్స్ మందులు వాడే అలవాటుంది. సన్నబడడానికి, కాస్త మత్తు కలగడానికి వాటిని వాడతారు. అవి ఎక్కువగా వాడడం వల్ల హార్ట్ ఎటాక్ వచ్చి, 1977 ఆగస్టు 16న మరణించాడు. ఎల్విస్ మీద ఎన్నో సినిమాలు, డాక్యుమెంటరీలు తయారయ్యాయి. 'ఎల్విస్' (1979) టీవి చిత్రంలో ఎల్విస్‌గా నటించిన కర్ట్ రస్సెల్ బాలనటుడుగా ఎల్విస్ సరసన "ఇట్ హేపెన్డ్ ఎట్ ది వరల్డ్స్ ఫెయిర్ (1963)"లో నటించడం విశేషం. "దిసీజ్ ఎల్విస్" సినిమాలో అసలు ఎల్విస్ ఫుటేజ్ కొంత చూపిస్తూ, అతని జీవితంలో కొన్ని ఘట్టాలను ఇతరుల చేత నటింపజేశారు.

ఇలా ఎల్విస్ జ్ఞాపకాలను చిరకాలం పచ్చగా ఉండేట్లు చేయడంలో అతని కుమార్తె, ఏకైక వారసురాలు లిసా మేరీ ప్రెస్లీ కృషి చాలా వుంది. "లైలో అండ్ స్టిచ్" సినిమా హిట్ అయితే మన పిల్లలు కూడా "ఎల్విస్ ప్రెస్లీ అంటే నీకు తెలుసా? నాకు చాలా ఇష్టం." అని మననే అడుగుతారామో!

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

# MARGUERITA (Margarita)

*(Don Robertson)* **ELVIS PRESLEY**




D Eb
Who makes my heart beat like thunder
D
Who makes my temperature rise
Eb
Who makes me tremble with wonderful rapture
D
With one burning glance from her eyes

Marguerita umm (ah-h-h-h)
A7
Once I was free as a gypsy
C7 F
A creature too wild to tame
C7
Then suddenly I saw Marguerita
Bb A
And I was caught like a moth in the flame
Bb Dm
Marguerita is her name
D C D
Marguerita (ah-h-h-h)
Eb
Her lips have made me a prisoner
D
A slave to her every command
Eb F
She captivates me and intoxicates me
Eb D
With one little touch of her hand

Marguerita umm (ah-h-h)
Cm D Cm D
Sweet Marguerita...
Eb D Cm D
Sweet, sweet Marguerita umm...ah-ah-ah...

**ఎల్విస్ పాడిన ఎన్నో హిట్ సాంగ్స్‌లో ట్యూన్ పరంగా మనకు మార్గరిటా పాట బాగా పరిచితం. ఎందుకంటే శంకర్ జైకిషన్ ఈ ట్యూన్‌ను యథాతథంగా 'కౌన్ హై జో సప్నోంమే ఆయా' (ఝుక్ గయా ఆస్మాన్ - 1968)గా దింపేశారు గనుక!**

## శ్రావణ మాససందర్భంగా...

**చిత్రం: ముద్దుబిడ్డ** రచన: ఆరుద్ర
**సంగీతం: పెండ్యాల** గానం: సుశీల

జయమంగళ గౌరీదేవి దయజూడుము చల్లనితల్లీ
కొలిచేవారికి కొరతలు లేవు కలిగిన బాధలు తొలగజేయు
కాపురమందున కలతలు రావు
కమ్మని దీవెనలిమ్మా అమ్మా! ॥జయమంగళ॥
ఇలవేలుపుపై వెలిసిననాడే నెలకొలిపావు నిత్యానందం
నోచే నోములు పండించావు
చేసే పూజ చేకొమ్మా అమ్మా ॥జయమంగళ॥
గారాబముగా గంగా నీవు
బొజ్జ గణపతిని పెంచిరి తొల్లి
ఇద్దరి తల్లుల ముద్దుల పాపకి
బుద్ధీ జ్ఞానములిమ్మా అమ్మా ॥జయమంగళ॥

**చిత్రం: స్వర్ణగౌరి** రచన: వీటూరి
**సంగీతం: ఎస్.వెంకటరాజు** గానం: ఎస్.జానకి, చిత్తరంజన్

జయమీవే! జగదీశ్వరీ కావ్యగాన - కళాసాగరీ! ॥జయ॥
పదముల వెలసే లయతాళాలు!
నీ కథలే - మధురగీతాలు.....
దరహాసాలే - సకల స్వరాలు!
నాదము వేదమునీవేలే ॥జయ॥
నీ చరణములే - నమ్మినదానా!
నీదానా దయార్ద్రిని కాన!
చిలుకగరాదే-నీ జాలివాన
మాతా మంగళదేవివే ॥జయ॥

**చిత్రం: రహస్యం** రచన: మల్లాది రామకృష్ణశాస్త్రి
**సంగీతం: ఘంటసాల** గానం: పి.లీల

శ్రీలలిత శివజ్యోతి సర్వకామదా
శ్రీ గిరి నిలయా గిరామయా సర్వమంగళా ॥శ్రీ లలితా॥
జగముల చిరునగవుల పరిపాలించే జననీ
అనయము మము కనికరమున కాపాడే జననీ
మనసే నీ వశమై స్మరణే జీవనమై
మాయని వరమీయవే పరమేశ్వరీ మంగళనాయకి॥శ్రీ లలితా॥
అందరికన్నా చక్కని తల్లికి సూర్యహారతి
అందాలేలే చల్లని తల్లికి చంద్రహారతి
రవ్వల తళుకుల కళలా జ్యోతుల కర్పూర హారతి
సకలనిగమ వినుత చరణ శాశ్వత మంగళ హారతి ॥శ్రీ లలితా॥

**చిత్రం:లక్ష్మీకటాక్షం**
**సంగీతం: యస్.పి.కోదండపాణి**

శుక్రవారపు పొద్దు సిరిని విడువద్దు
దివ్వెలుండగ వద్దు బువ్వనెట్టొద్దు
తోబుట్టువుల మనసు కష్టపెట్టొద్దు
తొలిసంజ మలిసంజ నిదురపోవద్దు
మా తల్లి మహాలక్ష్మి నిను వీడదపుడు
మా తల్లి మహాలక్ష్మి నిను వీడదపుడు
ఇల్లాలు కంట తడి పెట్టని ఇంట
కల్లలాడని యింట గోమాత వెంట
ముంగిళ్ల ముగ్గుల్లో పసుపు గడపల్లో
పూలల్లో పాలల్లో
పూలల్లో పాలల్లో
ధాన్యరాసుల్లో
మా తల్లి మహాలక్ష్మి స్థిరముగానుండు
మా తల్లి మహాలక్ష్మి స్థిరముగానుండు

# 'భువన చంద్ర' బోస్



భువన చంద్రగారు



**భువనంపై చంద్రుడు**
**భువనంలో చంద్రుడు**
**భువనాన చంద్రుడు**

చల్లని చూపు, తియ్యని మాట, మెత్తని మనసు. మా నాన్నంత వయసాయనది. ఆయన కొడుకంత వయసునాది.

"పెళ్లి సందడి" పాటలు రాసిన తర్వాత మద్రాస్ వెళ్లినపుడు నా సీనియర్ రచయితలు ఆశీర్వాదం తీసుకోవాలని భువనచంద్ర గారింటికి వెళ్లాను. కాళ్లకు నమస్కరించబోతే వద్దని వారించి కౌగిలించుకున్నారు. కూర్చోబెట్టి ఎన్నో విషయాలు చెప్పారు. రెండు గంటలకుపైగా మాట్లాడుకున్న తర్వాత వెళ్లబోతుంటే ఆపి భోజనం చేసి వెళ్లమని పట్టుపట్టి కొసరి కొసరి ఆయన స్వయంగా వడ్డించారు. యిది భువనచంద్ర గారితో నాకు జరిగిన తొలి పరిచయం. "పరదేశి" పాటలు రాస్తున్నప్పుడు 'తెలుగుయింటి పెరటిలోన' పాటలో 'వాషింగ్టన్ డిసిలో కురిసే హిమ చైత్యమా' అని రాశాను. ..వెళ్లబోయేముందు అనుమానమొచ్చి భువనచంద్రగారికి ఫోన్ చేసి 'హిమ చైత్యమా' అనే కాయినింగ్ కరక్టేనాండి అని అడిగాను. దానికాయన ఒకపాటలో అశోకతేజగారు రాసిన "ఆకుపచ్చ చంద్రుడు' అనే మాటని ఉదహరిస్తూ చాలామంచి మాట అది. అలాగే .... కూడా కొత్త ఎక్స్‌ప్రెషన్. తప్పు కాదన్నారు. "తణుకో, అరకో" పాటలో "పూలకు రంగులు ఎన్నున్నా - నీడ మాత్రం నలుపే" ...... అనే లైన్స్ రాసి ఆయనకు వినిపించాను. దానికాయన అద్భుతంగా స్పందించి ఒక పెద్దమాట వాడారు. నన్ను పూర్వజన్మలో వాల్మీకితో పోల్చారు. ఆ మాటకు నేను ఎంత మాత్రం సరితూగకపోయినా ఎదుగుతున్న రచయితలను స్వచ్ఛంగా, నిష్కల్మషంగా ఆయన అభినందించిన తీరు ఇప్పటికీ నాకు ఉత్సాహాన్నిస్తుంది. సినిమా రచయితల్లో అందరికన్నా పెద్ద గ్రంథాలయం భువనచంద్ర గారింట్లోనే ఉంది. ఆయనొక విజ్ఞాన సర్వస్వం. పురాణాలు, బైబిల్, ఖురాన్ అన్నీ ఆయన నాలుక మీద నివాసం. గరం గరంగా శృంగార గీతాలు రాసే భువనచంద్ర గారికి వేదాంతం, తాత్వికత, తర్కం అన్నీ కొట్టిన పిండే. యిద్దరు సినిమా వాళ్లు కలిస్తే మాట్లాడుకునేది మూడో సినిమావాడి గురించే. భువనచంద్ర గారిని నేనెన్నోసార్లు కలిశాను. వేరేవ్యక్తి గురించి, యితర రచయితల పాటల గురించి పెదవి విప్పరు, ఎన్నడూ రవ్వంతైనా చెడుగా మాట్లాడిందిలేదు.

| | | |
|---|---|---|
| నీ జీను పాంటు చూసి బుల్లెమ్మా | : | సూర్యకిరీటమే నీవా |
| బంగారు కోడిపెట్ట | : | యిదేలే తరతరాల చరితం |
| లక్స్‌పాప లక్స్‌పాపా | : | స్నేహానికన్న మిన్న లోకాన |
| నిన్నాకుట్టేసినాది | : | చెప్పకనే చెబుతున్నది యిదే యిదే ప్రేమని |
| పందిరేసి పెట్టార ఉంది ఒక్క | : | కీరవాణి రాగంలో |

వాటికి వీటికి ఎంతో వైవిధ్యం.
కాని అన్నీ విజయవంతమైన పాటలే.
ఆయన బంగారం.
ఆయన పాటలు సినిమాలకు బంగారు కోడిపెట్టలు,
నిర్మాతలకు కోడిగుడ్లు.

\- చంద్రబోస్

### చిత్రం:గ్యాంగ్ లీడర్

సంగీతం:బప్పీలహరి  గానం: ఎస్.పి.బాలు, చిత్ర

అ : వానావానా వెల్లువాయె కొండాకోనా తుళ్ళిపోయే
చెలియచూపులే చిలిపిజల్లులై
మేనుతాకితే ఏదో ఏదో ఏదో హాయి
ఆ : వానా వానా వెల్లు వాయే.... ఒళ్ళు బళ్ళూ తుళ్ళిపోయే
ప్రియుని శ్వాసలే పిల్లగాలులై
మోముతాకితే ఏదోఏదోఏదో హాయి
అ : చక్కని చెక్కిలి చిందే అందపుగంధం
ఆ : పక్కన చేరిన మగమహరాజుకి సొంతం
అ : తొలకరి చిటపట చినుకులలో మకరందం
ఆ : తిత్తడి పుత్తడి నేలకదే ఆనందం...
అ : చివురుటాకులా చలికి ఒణుకుతూ... చెలియ చేరగా
ఏదో ఏదో ఏదో హాయి ॥వానా॥
ఆ : ఒకరికి ఒకరై హత్తుకుపోయిన వేళా...
అ : ఒడిలో రేగెను ఏదో తెలియని జ్వాల...
ఆ : ముసిరిన చీకటిలో చిరుగాలుల గోలా...
అ : బిగిసిన కౌగిట కరిగించెను పరువాల...
ఆ : పలవరింతలే.... పలకరింపులై... పదును మీరగా
ఏదో ఏదో ఏదో హాయి ॥వానా॥

### చిత్రం: ఖైదీ నంబర్ 786

సంగీతం: రాజ్-కోటి  గానం: ఎస్.పి.బాలు, ఎస్.జానకి

అ : గువ్వా.... గోరింకతో.... ఆడిందిలే బొమ్మలాట....
ఆ : నిండూ.... నా గుండెలో... మ్రోగిందిలే వీణపాట...
అ : ఆడుకోవాలీ... గువ్వలాగా... పాడుకుంటాను
నీ జంట గోరింకనై ॥గువ్వా॥
అ : జోడు కోసం... గోడదూకే... వయసిది...
తెలుసుకో అమ్మాయి గారూ....
ఆ : అయ్యోపాపం... అంత తాపం... తగదులే...
తమరికీ అబ్బాయిగారూ...
అ : ఆత్రమూ... ఆరాటమూ... చిందే వ్యామోహం...
ఆ : ఊర్పులో... నిట్టూర్పులో ... ఉందే నీ ధ్యానం
అ : కోరుకున్నాననీ... ఆట పట్టించకూ
ఆ : చేరుకున్నాననీ... నన్ను దోచెయ్యకూ...
అ :  చుట్టుకుంటాను... సుడిగాలిలా ॥గువ్వా॥
ఆ : కొండనాగు... తోడు చేరే... నాగిని బుసలలో వచ్చే సంగీతం
అ : సందెకాడ... అందగత్తె... పొందులో... వుందిలే...
ఎంతో సంతోషం
ఆ : పూవులో... మకరందమూ.... వుందే నీ కోసం....
అ : తీర్చుకో... ఆ దాహమూ.... వలపే జలపాతం...
ఆ : కొంచెమాగాలిలే... కోర్కె తీరేందుకూ
అ : దూరమంటానులే... దగ్గరయ్యేందుకూ....
ఆ : దోచిపెడతాను... నా సర్వమూ... ॥గువ్వా॥

### చిత్రం: ప్రాణస్నేహితులు

సంగీతం:రాజ్-కోటి  గానం: ఎస్.పి. బాలు

స్నేహానికన్నమిన్న... లోకానలేదురా...
కడదాక నీడలా...గా... నిను వీడిపోదురా....
నీ గుండెలో... పూచేటిదీ... నీ శ్వాసగా... నిలిచేటిదీ
ఈ స్నేహమొకటేనురా ॥స్నేహాని॥
తులతూగే సంపదలున్నా... స్నేహానికి గురిరావన్నా...
పలుకాడె బంధువులున్నా... నేస్తానికి సరికారన్నా...
మాయా మర్మం తెలియని చెలిమే
ఎన్నడూ తరగని పెన్నిధిరా...
ఆ స్నేహమే నీ ఆస్తిరా... నీ గౌరవం... నిలిపేనురా
సందేహమే లేదురా... ॥స్నేహాని॥
త్యాగానికి అర్థం స్నేహం... లోభానికి లొంగదు నేస్తం..
ప్రాణానికి ప్రాణం  స్నేహం... రక్తానికి రక్తం నేస్తం
నీదీ నాదనుభేదం లేనిది నిర్మలమైనది
స్నేహమురా...
ధృవతారలా.... స్థిరమైనదీ.... ఈ జగతిలో విలువైనదీ
ఈ స్నేహమొకటేనురా... ॥స్నేహాని॥

### చిత్రం: ఘరానామొగుడు

సంగీతం: ఎం.ఎం.కీరవాణి  గానం:ఎస్.పి.బాలు, చిత్ర, కోరస్

అ : పండు పండు పండు... ఎర్రపండు... ఏపిల్ దాని పేరు
ఆ : జర్రగమ్మునుండూ... బుజ్జిపండూ... పడిందిటాపుగేరూ
అ : వాత్స్యాయానా లిఖించునాయనా...
లవంగి మొగ్గ తుంచి లొ లొ లొ లొ
ఆ : సిగ్గేసినా... చేసేది చేయనా...
శుభస్యశీఘ్రమంటు నొనొనొనొ హే... లవ్‌మి నొ...॥పండు॥
అ : మొగ్గలేసే బుగ్గపండు... నక్కిచూసే నిమ్మపండు...
ఖుషీగా ఇస్తే వస్తా కాసుకో...
ఆ : అంత ఆశా... అమ్మపండూ... ఇచ్చుకుంటే మల్లెచెండూ
మరెంతో తంటా మూడే మార్చుకో
అ : లిప్పూ లిప్పు ఫ్రెండ్షిప్పు చేసిన రోజే రెచ్చిపో
ఆ : హిప్పూ హిప్పూ చెమ్‌చెక్కలాడిన వేళే సాక్కిపో
అ : వాల్మీకిలా తరించి రాయనా వరాల మొగ్గమిటి లొ లొ లొలొ
ఆ : ప్రేమాయణం పలించిచూడనా నట్టింట లిగ్గమెట్టి
నొనొనొనొ
అ : హే... లవ్ మీ నొ ॥పండు॥
ఆ : జంపు చేసే జామపండూ... ఒత్తిగిల్లే... అత్తిపండూ
సపోటా పోటీ పెట్టా చూసుకో
అ : దాచుకుంటే దోసపండూ.... దోచుకుంటా... దొంగపండూ
సుఖాల వేట నేడే కాచుకో
ఆ : పండే పండు పండక్కి ఇస్తా ప్రాణం తీయకూ.
అ : దక్కేపండు దమ్మెంతొ చూస్తా పాఠం నేర్పకూ....
ఆ : ఓర్నాయనా... సుఖించి రాయనా...
సుఖాల భారతాన్ని నొనొనొనొ
ఆ : లవ్‌సాగరం మథించి తీయనా
మజాల అమృతాన్ని లొలొలొలొ
ఇ: హే ... లవ్‌మీ నొ...

## చిత్రం: ప్రేమలేఖ

సంగీతం: దేవా — గానం: కృష్ణరాజ్, భువనచంద్ర

చిన్నాదానా ఓసి చిన్నాదాన
ఆశ పెట్టేసి పోమాకే కుర్రదానా 2
కళ్ళు అందాల కళ్ళు కవ్వించేనే కన్నే ఒళ్ళు
చిన్నారా వీధుల్లోన చిక్కాయిలే చీనీ పళ్ళు ॥చిన్నా॥
నువ్వు నేను కలిసిన వేళ ఆశగ ఏదో మాటాడాలా
ఏం కావాలో చెవిలో చెప్పేయ్ చిన్నమ్మా
ఓ సింగపూరు సెంటు చీర స్టీలు ప్లాంటు గాజువాక
రెండో మూడో ఇళ్లిస్తానే బుల్లమ్మా
ఊరి ముందర మేళం పెట్టి  పూల మేడలో తాళిని గట్టి
నా పక్క నువ్వు ఉండక్కర్ల జాలీగా
నీ మెరుపుల చూపులు చాలు  నీ నవ్వుల మాటలు చాలు
నే నిమ్మనే నూరు ముద్దులు ఇస్తావా
నీ తలంపే మత్తెక్కిస్తుందే బడబడ బడబడమని
నా మనస్సుని తొందర చేస్తుందే
కళ్ళు రెండు వెతికేస్తున్నాయే గడ గడగడమని
తట్టి నన్ను లాగేస్తున్నాయే.... ఓ... ఓ..... ఓ.... ॥చిన్నా॥
చూసి చూడకుండా వెళ్ళె పడుచుపిల్లల్లారా
ఈ ప్రేమికుడి వంక కాస్తా కళ్ళు తెరచి చూడండోయ్
రెండు కాళ్ళమీద లేచి నిలబడి కళ్ళల్లో కళ్ళు పెట్టి
చూశారంటే, వాతం వచ్చి మైకంలో పడిపోతారో... ఓ... ఓ...
సిగ్గు లజ్జా మానం అన్నీ మరిపించేదే నాగరికత
ఎనిమిది మూర్ల చీరాలెందుకు చిన్నమ్మా
ఆ! వంకాయ పులుసు వండాలంటే పుస్తకాలు తిరగేసేయటం
ఫ్యాషన్ అయిపోయిందే ఇప్పుడు బుల్లెమ్మా
ఫేస్ కట్‌కి ఫెయిర్ అండ్ లవ్‌లీ
జాకట్‌కి లో కట్ డైలీ
లో టిప్‌కి నో లిప్లయి ఏలమ్మా
లాకెట్‌లో లారా కాంబ్లీ
నోట్ బుక్‌లో సచిన్ జాక్సన్
హెయిర్‌కట్‌కి బ్యూటీ పార్లర్ ఏలమ్మా
నీ తలంపే మత్తెక్కిస్తుందే బడ బడ బడ బడమని
నా మనస్సుని తొందర చేస్తుందే
కళ్ళు రెండు వెతికేస్తున్నాయే గడ గడ గడమని
తట్టినన్ను లాగేస్తున్నాయే  ఓ.... ఓ... ఓ... ॥చిన్నా॥

## చిత్రం: అల్లరి ప్రియుడు

సంగీతం: ఎం.ఎం.కీరవాణి — గానం: ఎస్.పి.బాలు, చిత్ర

ఆ : కనులు విప్పి... కలువ మొగ్గ... జాబిల్లిని చూచెనో
తమకంతో పాలబుగ్గ తొలిముద్దును కోరెనో...
తడియూరని పెదవులపై... తొణికిన వెన్నెల మెరుపులు...
చెప్పకనే... చెప్పకనే
అ : చెప్పకనే చెబుతున్నవి ఇదే ఇదే ప్రేమనీ
ఆ : చిలిపిగ నీ చేతులు అణువణువు తడుముతుంటే
మోహపు తెరలిక తొలిగేనా
అ : చలిచలి చిరుగాలులు గిలిగింత రేపుతుంటే
ఆశల అల్లరి అణిగేనా
ఆ : పదాలతోనే వరించనా... సరాగ మాలై తరించనా
అ : స్వరాల తోనే స్పృశించనా... సుఖాల వీణ శృతించనా
ఆ : ఆ వెన్నెల నీ కన్నుల రేపెట్టిన ఆ కోరిక
పొగలై సెగలై ఎదలో రగిలిన క్షణమే ॥చెప్పకనే॥
అ : తనువును పెనవేసిన నీ చీరకెంత గర్వమో
యవ్వన గిరులను తడిమెననా?
ఆ : నీ కౌగిట నలిగినందుకే అంత గర్వం
మదనుడి మలుపులు తెలిసెననీ...!
అ : తెల్లారనీకే వయ్యారమా... అల్లాడి పోయే... యీ రేయినీ
ఆ : సవాలు చేసే శృంగారమా.... సంధించమాకే ఓ హాయినీ
అ : ఆ మల్లెల కేరింతలు... నీ నవ్వుల లాలింతలు
కలలై అలలై ఒడిలో పొదిగిన క్షణమే.. ॥చెప్పకనే॥

## చిత్రం: అన్నయ్య

సంగీతం: మణిశర్మ — గానం: సుఖ్వీందర్ సింగ్, రాధిక

అ : ఆట కావాలా... పాట కావాలా...
స్వచ్ఛమైన అచ్చతెనుగు బీటు కావాలా
ఆ : ఆటకావాలీ... పాట కావాలీ...
గాజువాక సెంటర్లో ఫ్లాటు కావాలీ
అ : ముందే టెండర్ పెడితే ఎట్టా బేబీ...
ఆ : మానేదెట్టా గురువా అది నా హాబీ
అ : ఊపెయ్ వళ్ళే  ఆ: చేసెయ్ థ్రిల్లే
అ : భూగోళం అదిరేలా కదం తొక్కాలే
స్వీటు కావాలా... హాటు కావాలా...
నాణ్యమైన నాటు చికెను లెగ్సుకావాలా
ఆ : స్వీటు కావాలీ... హాటు కావాలీ...
రాసిస్తే వైజాగ్ స్టీలు ప్లాంటు కావాలీ.....
అ : చల్లకొచ్చి ముంతదాస్తె లాభం లేదే...
పిల్లగాలి గిల్లుతోంది దిల్ దే దే దే...
ఆ : మండపేట కుర్రదాన్ని ఓ బావయ్యా - మనీ
పర్సు చూస్తె తస్సదియ్య మహా ఇదయ్యా
అ : ఓ కే రాణీ.... చేస్తాబోణీ.... ఆపైన చెప్పొద్దే మరో కహానీ
చిప్స్ కావాలా లిప్స్ కావాలా....
గరమ్ గరమ్ సింగపూరు పఫ్స్ కావాలా...
ఆ : చిప్స్ కావాలీ... లిప్స్ కావాలీ...
అప్పనంగా ఇస్తే షిప్పుయార్డ్ కావాలీ...
ఆ : కింగులాంటి నిన్ను చూస్తె మనసౌతాందీ
ఈ డ్రెస్సుతోటి రావాలంటె సిగ్గేత్తాందీ
అ : పట్టుచీర కొనిపెడితే ముంబై బుల్లీ - ఓ
పట్టుపట్టనిస్తావా జూకా మల్లీ
ఆ : ఐతే రెడీ.... కొట్టెయ్ ఢీ ఢీ కమ్మంగా ఆడేద్దాం కిస్సు కబాడీ
అ : దిండుకావాలా... దుప్పటి కావాలా
లైట్ లైట్ - లండన్ ఫోము బెడ్డు కావాలా
ఆ : దిండు కావాలీ... దుప్పటి కావాలీ రెచ్చిపోతె
మినపసున్ని వుండకావాలీ...
అ : ముందే టెండర్ పెడితే ఎట్టా బేబీ...
ఆ : మానేదెట్టా గురువా అది నా హాబీ
అ : ఊపెయ్ ఒళ్ళే  ఆ: చేసెయ్ థ్రిల్లే
అ : భూగోళం అదిరేలా కదం తొక్కాలే
అ : స్వీటుకావాలా హాటుకావాలా నాణ్యమైన
నాటు చికెను లెగ్సు కావాలా
ఆ : స్వీటు కావాలీ... హాటు కావాలీ
ముద్దుముద్దు మెగాస్టార్ ముద్దుకావాలీ

సీరియల్

14

# సద్దాం ఆంటీ ఇంటి కథ

- మల్లాది వెంకట కృష్ణమూర్తి

## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అనన్యకు గతం చెప్పడం ప్రారంభించిన బామ్మ పెద్దతాత వల్లభరావు వీలునామా గురించి చెబుతుంది. ఆ తర్వాత తను పెండ్లాడిన అత్తకొడుకు వెంగళ్రావు గురించి చెబుతుంది. వెంగళ్రావు తెలివి తక్కువవాడు. అతనికి పిల్లనివ్వటానికి ఎవరూ ముందుకురారు. ఎలాగోలా అతని పెళ్ళి చేయాలని కుటుంబ సభ్యుల తాపత్రయం.



పెళ్ళికొడుకు వెంగళ్రావు బామ్మ మాంఛి లౌకికురాలు. ఈ సందర్భంలో వల్లభరావు అండ్ కుటుంబం యమున పుష్కరాలకి వెళ్ళడంతో ఆవిడ ఓ మాంఛి ఆలోచన చేసింది. దాన్ని కొడుకు చెవిలో ఊదింది. అతడు తన భార్య చెవిలో ఊదాడు. అది మంచి ప్లానను కున్నారు.

దాంతో వాళ్ళు యవ్వనంలో వున్న బామ్మని, వెంగళ్రావుని ఆ ఇంట్లో వుంచి మిగిలిన సంసారం అంతా కలిసి యమున పుష్కరాలకి ప్రయాగకి వెళ్ళారు. వాళ్ళు తిరిగి రావడానికి మూడు వారాలు పట్టింది. ఆ మూడు వారాలు ఒంటరిగా వెంగళ్రావుతో వున్న బామ్మని చూసి చెవులు కొరుక్కున్నారు గ్రామస్థులు.

అసలే కోతి, ఆపైన కల్లు తాగింది అన్నట్లు అసలే కుగ్రామం, పైగా ఇది డబ్భై ఏళ్ళ క్రితం సంగతి. యమునలో తడిసి జలుబు, జ్వరంతో తిరిగి వచ్చిన వల్లభరావుకి జరిగింది తెలిసి చెల్లెలిమీద ఇంతెత్తున లేచాడు. బావని తిట్టాడు. బామ్మని కొట్టబోయాడు.

అయితే ఆ నోటా, ఈ నోటా ఇది అంతటా పాకిపోయింది. ఫలితంగా బామ్మకి పెళ్ళి సంబంధాలు రావడం లేదు. వచ్చినా ముహూర్తాలు



పెట్టుకునే టైమ్‌లో 'ఈ సంగతి మాకు చెప్పకుండా ఎందుకు దాచిపెట్టారు, మీకు మేనరికం వుంది కదా? పైగా అమ్మాయి కూడా ఇష్టపడి మూడు వారాలు అతనితో కాపురం కూడా చేసిందటగా?' అని తిట్టి వెళ్ళేవారు.

కుండెడు పాలలో చుక్కవిషం బొట్టు అన్నరీతిగా, పద్దెనిమిదేళ్ళు తనింట్లో వున్న బామ్మ కేవలం మూడువారాలు ఒంటరిగా వెంగళ్రావుతో ఒకే ఇంట్లో వుండడంతో ఆమెకి పెళ్ళికాని పరిస్థితి ఏర్పడింది - నిజానికి వాళ్ళ మధ్య ఏం జరగక పోయినా వల్లభరావు కాళ్ళకి బలపాలు కట్టుకుని తిరిగాడు. అయితే ప్రతీవారు 'ప్రపంచానికి పనికిరాని ఆ వెంగళ్రావుకి పనికి వచ్చిన మీ అమ్మాయి ఎలాంటిదో మాకు వేరే చెప్పక్కర్లేదు. మీకో దణ్ణం వెళ్ళండి' అనేవారే.

నాలుగైదేళ్ళు ప్రయత్నం చేసాక ఇక తన కూతురికి వివాహం జరగదని గ్రహించి, ఒకటికి



**వెంగళ్రావు హెయిర్ కటింగ్ సెలూన్‌కి వెళితే అక్కడ సంభాషణ ఇలా ఉంటుంది.**

**"హెయిర్ కటింగ్‌కు ఎంత?"**

**"పది రూపాయలు"**

**"షేవింగ్‌కు...."**

**"మూడు రూపాయలు"**

**"అయితే నా తలకు షేవ్ చెయ్యి".**

**ఇలాంటి వెంగళ్రావు గురించి పూర్తిగా తెలియాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే...!**

రెండుసార్లు గుండెపోటు వచ్చాక, ఇక తను మరణించాక అన్నలు బామ్మకి పెళ్ళి చెయ్యలేరని గ్రహించి, మనసు సంభాళించుకుని ఓ దుర్ముహూర్తాన బామ్మకి, వెంగళ్రావునిచ్చి పెళ్ళిచేసాడు వల్లభరావు.

వాళ్ళ హనీమూన్ ఎంతో రసవత్తరంగా జరిగింది. అరకులోయకి హనీమూన్ అనుకున్నారు. రైల్వేస్టేషన్‌కి ఫోన్‌చేసి రైలెప్పుడుందో కనుక్కుని వెళ్ళమని మామగారు చెప్తే సరేనన్నాడు వెంగళ్రావు.

కాని టెలిఫోన్ రిసీవర్ చెవి దగ్గరుంచుకుని విచారంగా చూస్తున్న వెంగళ్రావుని ఏమైందని ఏమైందని ఆయన అడిగితే జవాబు చెప్పాడు.

"ఆ ఫోన్ నంబర్ వందల్లో వుంది. మన ఫోన్‌లో జీరో నించి తొమ్మిది దాకానే అంకెలున్నాయి. ఎలా చెయ్యడమా అని"

(ఈ కథా కాలంలో ఇంకా డైలింగ్ సిస్టమ్ రాలేదన్న లాజిక్‌ని ఇక్కడ పాఠకులు విస్మరించుగాక)

ఫోన్ చేసి అడిగాడు రైల్వే ఎంక్వయిరి క్లర్కుని.

"దయచేసి వైజాగ్‌కి వెళ్ళే రైలు ఎప్పుడో చెప్తారా?"

"ఒన్ మినిట్ ప్లీజ్" చెప్పిందావిడ.

"అలాగా థాంక్స్" అని ఫోన్ పెట్టేసి చెప్పాడు.

"సరిగ్గా ఇంకో నిమిషంలో రైలు బయలు దేరుతుందిట. ఇక ఇవాళ దాన్ని అందుకోలేం"

ఇంకోమాట కూడా అన్నాడు "టెలిఫోన్ డైరెక్టరి చూడండి. మీ వూళ్ళో వాళ్ళంతా తమాషాగా ఎలా ఆల్ఫాబెటికల్ ఆర్డర్‌లో ఫోన్లు తీసుకున్నారో" అని

రైలు టిక్కెట్లు రిజర్వ్ చేయించుకు రావడానికి వెళ్ళే వెంగళ్రావు ఆరోజు తారీకు ఎంతని భార్యని అడిగాడు.

"చేతిలో పేపరుంచుకుని అడుగుతారే. దానిమీద తారీకు వుంటుందిగా" కస్సుమంది బామ్మ.



"భలేదానివి దొరికావే. నాకామాత్రం తెలీదటే పిచ్చిదానా. అది ఇవ్వాల్టిదికాదు. నిన్నటిది" అమాయకురాలివంక చూసినట్లు చూస్తూ చెప్పాడు వెంగళ్రావు.

రైల్వేస్టేషన్‌లో టిక్కెట్లు కొనడానికి క్యూలో నుంచున్నాడు.

"మద్రాస్ మెయిల్‌కో టిక్కెట్టివ్వండి" క్యూలో ముందున్నతను అడిగి కొనుక్కెళ్ళాడు.

వెంగళ్రావు తనవంతు రాగానే 'మద్రాస్ మేల్‌కి నాకోటిక్కెట్టు, మా ఆవిడకి మద్రాస్ ఫిమేల్‌కి ఓ టిక్కెట్ ఇవ్వండి"

దినపత్రిక ఒకటి కొని దాన్ని చదివాక చెప్పాడు పక్క ప్రయాణీకుడితో-

"ఎంతో ఆశ్చర్యం కదా?"

"ఏమిటి ఆశ్చర్యం?" అడిగాడాయన

"రోజూ పేపర్ చూడండి. ప్రతిరోజూ కరెక్ట్‌గా పేపర్లో పట్టేటన్ని వార్తలే నిత్యం ప్రపంచంలో జరుగుతూంటాయి. అదీ ప్రకటనలకి స్పేస్ పోను. ఓ పేరా ఎక్కువా కాదు ఓ పేరా తక్కువా కాదు"

అతను ఫక్కున నవ్వాడు.

"దేనికి నవ్వారు? ఏదైనా జోక్‌గా మాట్లాడానా?"

"లేదు"

"అదేమిటో కాని నేనెప్పటినించో గమనిస్తూనే వున్నాను. నేనసలు జోక్ చెప్పకపోయినా ఒకోసారి నా మాటలకి అందరికీ ఇట్టే నవ్వొచ్చేస్తుంటుంది" చెప్పాడు వెంగళ్రావు.

రైల్లో అర్థరాత్రి భార్యని నిద్ర లేపి చెప్పాడు.

"కొంప మునిగినట్లుంది"

"ఏం జరిగింది?" అడిగింది బామ్మ.

"మనరైలు ఇంజన్ డ్రైవర్ దారితప్పినట్టున్నాడు. బయటికి చూడు. కాపాసిటి అనే వూరు వైజాగ్‌కి వెళ్ళే దారిలో లేనే లేదసలు"

బామ్మ బయటకి చూస్తే వాటర్ టేంక్‌మీద 'కెపాసిటి' (CAPA'CITY') పదిహేను వేల లీటర్లు' అని రాసి వుండడం కనిపించింది.



ఒకసారి వెంగళ్రావు ఇంటికి ఓ దొంగ కిటికీ పగలకొట్టుకుని లోపలకి వచ్చి దోచుకుపోయాడు. అతను పోలీసులకు రిపోర్టు ఇచ్చాడు.

దొంగతనం ఎలా జరిగిందో పరిశీలించటానికి వచ్చిన ఎస్.ఐ.తో "ఇంట్లోకి రావటానికైతే కిటికీ పగలకొట్టాడు. వేసిన తలుపులన్నీ వేసినట్లుగానే ఉన్నాయి. కాని తిరిగి వెళ్ళటానికి ఇంకో కిటికీ పగల కొట్టలేదు. ఆ దొంగ ఎలా పారిపోయాడో ఆశ్చర్యంగా ఉంది". అన్నాడు వెంగళ్రావు.

**ఇలాంటి వెంగళ్రావు గురించి పూర్తిగా తెలియాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే...!**

ఉదయం "రైల్లో రూపాయికి ఏం కొన్నానో చూడు. ఓ సిగరెట్ లైటర్, ఓ హేంగర్ ఇచ్చాడు. చవక" గర్వంగా చూపించాడా రెంటిని.

అవి అగ్గిపుల్ల! మేకు!!

వైజాగ్‌లో రైలు దిగాక తమకి టేక్సీ ఎరేంజ్ చేసిన వెంగళ్రావు మిత్రుడి కోసం రైల్వే స్టేషన్‌లో ఎదురు చూసారు. ఎంతకీ రాలేదు. కాసేపాగి చెప్పాడు వెంగళ్రావు.

"పదిహేనేళ్ళ తర్వాత నేను వాడ్ని మొదటిసారి చూడడం. అందుకని చటుక్కున అతన్ని గుర్తు పట్టలేక పోతున్నాను"

"పదిహేనేళ్ళ తర్వాతా? మరి అతను మిమ్మల్నీ గుర్తుపట్టలేడేమో?" అడిగింది బామ్మ.

"ఎందుకు గుర్తుపట్టలేడు? వాడిలా నేను పదిహేనేళ్ళు వైజాగ్‌లో నాకు దూరంగా లేనుగా"

టేక్సీ డ్రైవర్ పెట్రోల్ పోయించుకుంటుంటే, చెప్పాడు వెంగళ్రావు అతనితో.

"ఆశ్చర్యం కదూ. ఈ పెట్రోల్ బంక్‌ల వాళ్ళకి ఎలా తెలుస్తుందో నాకు తెలీదుకాని సరిగ్గా భూమిలో ఎక్కడ పెట్రోలుందో అక్కడే ఈ బంకులని ఏర్పాటు చేస్తారు"

"భూమిలో బంక్స్‌లో వుంచిన పెట్రోల్ టేంక్స్‌లోంచి పెట్రోల్ వస్తుందండి" చెప్పాడు డ్రైవర్.

"నేనేం వెర్రి వెంగళప్పననుకున్నావా? ఆట పట్టించే ప్రయత్నం చేయక. పెట్రోల్ టేంకుల్లోంచి రాదు. భూమిలోంచి వస్తుందని మా సైన్స్ పుస్తకంలో వుంది".

"మీ బుర్ర ఖాళీ బుర్ర" ఆ సంభాషణ విని కోపంగా చెప్పింది బామ్మ.

"ఏం కాదు. నాబుర్రనిండా మట్టి కావాలంటే, మా ఊళ్ళో ఎవర్నయినా అడుగు" చెప్పాడు వెంగళ్రావు దబాయింపుగా.

అరకులోయలో ఇద్దరు దొంగలు వీళ్ళని అటకాయించారు. అయితే వెంగళ్రావు వాళ్ళతో తలపడ్డాడు. ముగ్గురూ నేలమీదపడి దొర్లారు. చాలాసేపు పోరాడాక వెంగళ్రావు ఓడిపోయాడు. అతని జేబులు వెతికితే కేవలం ఓ చిల్లు కాణీ మాత్రమే దొరికింది.

"ఈ కాణీ కోసమా మాతో ఇంత సేపు పోట్లాడావు?" అడిగారు ఆశ్చర్యంగా.

"నేనేమంత తెలివి తక్కువ వెధవననుకున్నారా? నా కుడి కాలి సాక్స్‌లో దాచిన వంద రూపాయలకోసం మీరు పోట్లాడారనుకున్నాను" చెప్పాడు వెంగళ్రావు.

అరకులోయల్లో అందమైన పిట్టలని చూస్తూ విహరిస్తూంటే, అకస్మాత్తుగా అతని నెత్తిమీద ఓ పిట్ట రెట్ట వేసింది. అది చూసి చెప్పింది బామ్మ.

"మీ జేబులో కర్చీఫ్ వుంది. తీసి తుడవండి"

అందుకు బదులుగా బిగ్గరగా నవ్వాడు వెంగళ్రావు.



"దేనికి నవ్వుతున్నారు?" అడిగింది బామ్మ అర్థం కాక.

"పిచ్చిదానా, పిచ్చి మొహమా నువ్వూను. నేను జేబులోంచి కర్చీఫ్ తీసేదాకా అది వుంటుందనుకున్నావా? చూడు ఎంత దూరం ఎగిరెళ్ళి పోయిందో"

ఆ రోజుల్లో ఇప్పుడున్నన్ని రెస్ట్రిక్షన్స్ లేవు కనుక ఓ తుపాకిని అద్దెకి తీసుకుని వెంగళ్రావు అరకు లోయలో వేటకి వేరొకరితో వెళ్ళాడు తమ హోటల్‌కి ఆ సాయంత్రం ఓ సింహం తోకని తీసుకొచ్చి గర్వంగా చూపించాడు.

"మీకింత టేలంట్ వుందని నాకు తెలీదు" అని భర్తని మెచ్చేసుకుని చెప్పింది. తల తీసుకు రావాల్సింది"

"అప్పటికే ఎవరో దాన్ని కోసుకుని తీసుకెళ్ళి పోయారు" చెప్పాడు వెంగళ్రావు. రాత్రిళ్ళు లైటు వేయనివ్వడు వెంగళ్రావు- దోమలకి తాము కనపడకూడదని.

నూతన దంపతులిద్దరు ఓ జలపాతం చూసి తిరిగి వస్తూంటే, దారిలో కొన్ని సమాధులు కనపడ్డాయి. సమాధి రాళ్ళ మీద చెక్కిన వారి పేరు, పుట్టుక - మరణం సంవత్సరాలని ఆసక్తిగా చూడ సాగింది బామ్మ.

పేట్రిక్ 1860 - 1910

జేమ్స్ 1864 - 1902

డేవిడ్ 1877 - 1914

"ఇక్కడ ఒక సమాధిరాయి వుంది చూడు. వీడు నూటనలభై అయిదేళ్ళు బతికాడు" అరిచాడు వెంగళ్రావు.

"అతని పేరేమిటి?" అడిగింది బామ్మ.

"మైల్స్ ఫ్రం వైజాగ్" చెప్పాడు వెంగళ్రావు.

వాళ్ళు హనీమూన్ పూర్తి చేసుకుని తిరిగి వైజాగ్ రైల్వేస్టేషన్‌కి వస్తూంటే పోలీసులు వాళ్ళ టేక్సీని ఆపి అడిగారు.

"మీరు గంటకి ఏభైమైళ్ళ వేగంతో వస్తున్నారని తెలుసా? ఏక్సిడెంట్ అవచ్చని తెలీదా?"

డ్రైవర్ బదులు వెంగళ్రావు జవాడు చెప్పాడు.

"తెలుసు. అందుకే ఏక్సిడెంట్ జరగక ముందే రైల్వేస్టేషన్‌కి త్వరగా పోనివ్వమని డ్రైవర్‌తో చెప్పాను"

-------////-------

రొప్పుతూ, పక పక నవ్వుతూ చెప్పింది అనన్య

"ఒద్దు బామ్మా, కాసేపు ఆపు, నేనింక నవ్వలేక పోతున్నాను"

"నీకు నవ్వుగా ఉండచ్చుకాని, నిజంగా జరిగిందే చెప్తున్నాను"

"నిజంగా తాతయ్య అంతటి మూర్ఖుడా బామ్మా?"

"అవును. నంబర్ వన్ ఫూల్"

"తాతయ్య కొంచెం అమాయకుడని విన్నా కాని మరీ ఇంత ఇదని తెలీదు"

"ఇంత ఇదే ఆయన. అలా హనీమూన్ అయ్యాక తిరిగివచ్చాం. ఇక మా కాపురం గురించి



వెంగళ్రావు చిన్నప్పుడు స్కూల్‌కి వెళుతుంటే "ఇవాళ తినడానికి ఏమీ చెయ్యలేక పోయాన్రా. ఇంద... దీనితో సర్దుకో" అని ఓ అయిదు రూపాయలిచ్చింది వాళ్ళమ్మ. సరేనని తీసుకుని లంచ్ అవర్‌లో అయిదు రూపాయల నోటుని మింగాడు వెంగళ్రావు.

**ఇలాంటి వెంగళ్రావు గురించి పూర్తిగా తెలియాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే...!**

చెప్తాను. ఓ రోజేమైందంటే...."

"ఒద్దు బామ్మా. ఒద్దొద్దు. చెప్పింది చాలు. ఇంక నాకు తాతయ్య గురించే చెప్పకు, నాకు కడుపు నొప్పి వస్తోంది. ఆయన చావు దాకా స్కిప్ చేసి అదొక్కటే చెప్పుచాలు" అడిగింది అనన్య ఇక నవ్వలేక.

"అలాగే" నవ్వుకుని వెంగళ్రావు మరణం గురించి చెప్పసాగింది బామ్మ.

ఆ రోజుల్లో యువకుల్లో భారతదేశం స్వతంత్రం పొందాలన్న తపన వుండేది. చదువు మధ్యలో మానేసి వాళ్ళు బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాటం సాగించేవారు. గాంధీ సిద్ధాంతం ఆకర్షిస్తే రాట్నం వడికి, సముద్రంలో ఉప్పు తీసి, సుభాష్ చంద్రబోస్ సిద్ధాంతం ఆకర్షిస్తే తుపాకి పట్టుకుని.

వెంగళ్రావు కూడా ఆ 'క్విట్ ఇండియా ఫీవర్' అంటుకుంది. దాంతో ఆఫీసర్‌గా చేసే ఉద్యోగం వదిలేసి, అఖిల భారత స్వతంత్ర పోరాటంలోకి దిగాడు. మరొకరితో కలిసి ఓ బ్రిటిష్ ఆఫీసర్‌ని చంపడానికి వెళ్ళాడు.

రంగంలోకి దిగాక వెంగళ్రావుతో చెప్పాడతను.

"పథకం ప్రకారం వాడ్ని చంపుదాం. నేనటు వెళ్తాను. నువ్విటు వెళ్ళు. వాడు మనిద్దరిలో ఎవరికి చిక్కితే వాళ్ళు వాడిని చంపుదాం. రెండు గంటల తర్వాత ఇక్కడే కలుసుకుందాం. ఒకవేళ నువ్వీ ప్రాంతానికి కొత్త కాబట్టి దారి తప్పితే, ఆయుధాన్ని రెండుసార్లు గాల్లోకి ఉపయోగిస్తే చాలు. నువ్వెక్కడున్నావో తెలుసుకుని ఇట్టే రాగలను".

రెండు గంటల తర్వాత వెంగళ్రావు తను దారి తప్పానని గ్రహించాడు. అతని సలహాని పాటించదలచుకున్నాడు. చేతిలోని తుపాకిని పక్కన పెట్టి, ధనస్సుని అందుకుని, బాణాలని ఆకాశంలోకి వదిలి అతను చెప్పినట్టుగానే, ఆయుధాన్ని రెండుసార్లు వుపయోగించి, అతని రాక కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఎంతసేపు ఎదురు చూసినా వాడు రాలేదు. వాడి బదులు పోలీసులు వచ్చి వెంగళ్రావుని అరెస్ట్ చేసి



తీసుకెళ్ళారు. అతని వంటి మీద చెయ్యి వెయ్యకుండానే వెంగ(ళ్రావు తమ పథకం మొత్తం వాళ్ళకి వివరించాడు. వెంగ(ళ్రావు చెప్పిన ఆధారాలతో వాళ్ళ గేంగ్ మొత్తాన్ని పట్టుకున్నారు పోలీసులు. మేజి(స్ట్రేట్ విచారించి, అందరికీ మరణశిక్ష విధించాడు. కాని మరణశిక్ష విధించే సమయంలో అందరూ తప్పించుకున్నారు ఒక్క వెంగ(ళ్రావు తప్ప.

అదెలా జరిగిందంటే..... ..... .....

ఆ రోజుల్లో రాజ(ద్రోహులని ఏడుమంది ఫైరింగ్ స్క్వేడ్ వారు ఒకేసారి ఏడు తుపాకులని పేల్చి, మరణశిక్ష పొందిన వారిని చంపేవారు - ఎవరి గుండువల్ల వాడు మరణించాడో తెలీదు కనక ఆ స్క్వేడ్‌లోని ఎవరూ గిల్టీగా ఫీలవ్వాల్సిన అవసరం వుండదని ఆ ఏర్పాటు.

వెంగ(ళ్రావు గేంగ్‌లోని మొదటి వాడిని నదివడ్డున వున్న కొండ మీది చెట్టుకింద నిలబెట్టి గురి చూసారు. వాళ్ళు కాల్చబోయేలోగా వాడు 'టైగర్' అని అరిచాడు. నిజంగా ఏ పులో తమ మీదకి ఉరుకుతోందనుకుని అంతా భయపడి పారిపోయారు. ఆ గందరగోళంలో వాడు నదిలోకి దూకి తప్పించుకున్నాడు.

రెండోవాడిని కూడా చెట్టుకింద నిలబెట్టి కాల్చే సమయంలో వాడు 'భూకంపం' అని అరిచాడు. వాళ్ళంతా నిజంగా భూకంపం వస్తోందనుకుని భయపడి పారిపోయారు. ఆ గందరగోళంలో రెండోవాడు కూడా కొండమీంచి నదిలోకి దూకి ఈది తప్పించుకున్నాడు.

ఇక వెంగ(ళ్రావు వంతు వచ్చింది. తప్పించుకునే విధానం వెంగ(ళ్రావుకి అర్థమైంది. సిపాయిలని భయపెడితే చాలు. తనని చెట్టుకింద నిలబెట్టగానే 'ఫైర్' అని అరిచాడు.

ఆ ఏడుగురు ఒక్కసారే తుపాకులు పేల్చారు.

------///------

"సో, తాతయ్య చావు కూడా నవ్వులతోనే అంతమైందన్న మాట" నవ్వుతూ చెప్పింది అనన్య.

"అవును"

అనన్య తన తాతయ్య ఫోటో దగ్గరకి వెళ్ళి చూసింది. అతని తలకి కట్టివున్న బేండేజీని చూసి అడిగింది.

"ఇది మీ హనీమూన్‌లో ఆ దొంగలతో తలబడ్డాక తీయించుకున్న ఫోటోనా బామ్మా?"

"కాదు. ఇంకో సందర్భంలో" నవ్వుని దాచుకుంటూ చెప్పింది బామ్మ. అది గమనించి అడిగింది అనన్య.

"చెప్పు బామ్మా, ఏ సందర్భంలో?"

"ఓసారి పోస్ట్‌మేన్ రిజిస్టర్డ్ లెటర్ ఇవ్వడానికి ఇంట్లోకి వెళుతూ, గుమ్మం దగ్గర వున్న 'కుక్క వున్నది జా(గత్త' బోర్డుని చూసి ఆగిపోయి, పక్కనే కూర్చునివున్న మీ తాతయ్యని అడిగాడు.

"మీ కుక్క కొత్త వాళ్ళని కరుస్తుందా?" అని.

కరవదని జవాబు చెప్పాడు మీ తాతయ్య. తీరా లోపలకి వెళ్ళాక పోస్ట్‌మేన్‌ని అది కరిచింది. బయటకి వచ్చాక పోస్ట్‌మేన్ 'మీ కుక్క కరవదని ఎందుకు అబద్ధం చెప్పారు? చూడండి ఎలా కరిచిందో?' అని కోపంగా అడిగాడు.



**ఓ రోజు వెంగళ్రావు పేపర్ చూసి అర్జంట్‌గా బయటకు పరుగెత్తికెళ్ళి 100 పోస్టు కార్డులు కొనుక్కువచ్చాడు. పేపర్‌లో ఏ వార్త చూసి అవి కొనుక్కొచ్చావని మిత్రుడు అడిగితే చెప్పాడు -**

**"రేపటి నుంచి పోస్టల్ ధరలు పెరుగుతున్నాయి." అని.**

**ఇలాంటి వెంగళ్రావు గురించి పూర్తిగా తెలియాలంటే ఈ సీరియల్ చదవాల్సిందే...!**

'మా కుక్క నిన్నెక్కడ కరిచింది? అది తెనాలిలో వుంటేను?' అన్నాడు తెనాలిలో ఉన్న తన ఇంటి కుక్కని తల్చుకుంటూ మీ తాతయ్య.

దాంతో పోస్ట్‌మేన్‌కి కోపం పెరిగి ఓ రాత్తో నెత్తి మీద ఒకటిచ్చుకున్నాడు"

మరి కాసేపు తాతయ్య కబుర్లు విన్నాక చెప్పింది అనన్య నవ్వునాపుకుని.

"బామ్మా. మనం సైడ్‌(ట్రాక్ అయ్యాం. ఆల్‌రైట్. నీకు వెంగ(ళ్రావుతో పెళ్ళయింది. ఆయన పోయాడు. ఏ పిల్లలూ ఇప్పుడు (బతికి లేరు. కాబట్టి నువ్వు ఈ ఇంటికి ఏకైక వారసురాలివి అయ్యావు. ఇంతకీ ఇప్పుడు ఈ ఇల్లు అమ్మడంలో అసలు చిక్కేంటి?"

"నువ్వు మొత్తం వినకుండానే ఇలా అడిగితే ఎలా?" కోప్పడింది బామ్మ "అంటే నువ్వింకా చెప్పాల్సింది వుందా బామ్మా?" (ప్రశ్నించింది అనన్య.

"అవును. (గ్రామం గురించి చెప్పనే లేదు నీకింకా. ఈ కథ అతనితోనే మొదలవుతోందని చెప్పాను"

"ఎవరు? మీ సంగీతం మాస్టారు (గ్రామం గారా?"

"అవును నేను ఇంత దాకా చెప్పింది నథింగ్. అసలు విషయం ఈ (గ్రామంతోనే మొదలైంది"

"సరే, ఇక అటు, ఇటు, ఎటూ వెళ్ళకుండా కేవలం ఈ ఇంటికి, ఆ (గ్రామానికి గల సంబంధం ఏమిటో సూటిగా చెప్పు బామ్మా" అడిగింది అనన్య.

"ఓకే. ముందు ఓ కప్పు కాఫీ కలిపి తీసుకురా తాగి చాలాసేపైంది"

అనన్య ఇద్దరికీ కాఫీ కలిపి తీసుకురాగానే దాన్ని తాగుతూ తర్వాతి కథ చెప్పసాగింది బామ్మ.

"అతని పేరు జి. రామం. అయితే జి. పక్కన చుక్క కొట్టేయడంతో అంతా ఆయన్ని జి ఆర్ ఎ ఎమ్ ఎ ఎమ్(GRAMAM) చేసేసారు. ఆ (గ్రామానికి ఈ ఇంటి మీద మోజు. దీన్ని నా దగ్గరనించి కొనడానికి వచ్చాడు. ఆ రోజు నా బేంక్ ఎకౌంటుకి ఏమైందంటే...."

బామ్మ చెప్పేది (శద్ధగా వినసాగింది అనన్య.

**(ఇంకావుంది)**



అగష్టు 21 ఆదినారాయణరావు జయంతి సందర్భంగా

# స్వరపరాయణ శ్రీ ఆదినారాయణ

- పి.బి.శ్రీనివాస్

**మల్లెపువ్వులాంటి పొడుగు చేతుల షర్టూ, నీటైన పాంటూ ధరించి, నిర్మలమైన హార్టూ అప్రతిమానమైన ఆర్టూ గల ఆదినారాయణరావుగారిని సన్నిహితులూ, మిత్రులూ, ఆప్తులూ అయిన అందరూ ఆప్యాయంగా 'అబ్బాయి' అంటారు. వీరి సతీమణి అయిన శ్రీమతి అంజలీదేవిగార్ని 'అమ్మాయి' అంటారని వేరే చెప్పనవసరం లేదనుకుంటా.**

**ఈ అబ్బాయి, అమ్మాయిలది తెలుగు చిత్రరంగంలో సాటిలేని జంట.**

శ్రీఆదినారాయణ 1918వ సంవత్సరంలో శ్రీ కృష్ణాష్టమినాడు విజయవాడలో అవతరించారు. బాల్యం నుండీ వీరికి సంగీతాభిలాష మెండుగా వుండేది. దానికి తోడుగా, అబ్బాయిగారి నాన్నగారూ కూడా సంగీత ప్రియులే అవడం వీరికి చాలా ఉపకరించింది. వీరి తండ్రిగారు అనేక నాటక ప్రదర్శనలు జరిపించేవారు. అంతేకాక వారివద్ద ఆనాటి సుప్రసిద్ధగాయక శిఖామణుల రికార్డులెన్నో వుండేవి. ముఖ్యంగా బాలగంధర్వ, దీనానాథ్, నారాయణరావ్ వ్యాస్, కరీంఖాన్ మున్నగు వారి పాటలంటే ప్రాణం వారికి. ఆ రికార్డులన్నీ అబ్బాయి క్షుణ్ణంగా నేర్చుకుని కంఠతా పట్టి వప్ప జెప్పేవారు. వీరు ఏక, తప్పితే, ద్విసంతగ్రాహి. ఆ రోజుల్లో ఏ రికార్డయినా సరే ఎన్ని బిరకాలూ సంగతులూ గల పటుతర గీతాలైనా సరే ఒకటి రెండుసార్లు విన్నంత మాత్రానే వెంటనే పాడి అచ్చంగా అదేరీతిగా వినిపించగలిగేవారు.

విశాఖపట్టణంలో రాజరాజేశ్వరీ నాట్య మండలి వారు 14 సంవత్సరాలలోపు వయస్సు గల బాలురతో 'సావిత్రి' నాటకం ప్రదర్శించడానికి నిర్ణయించుకున్నారు. నారదుడి వేషానికి పనికొచ్చే విధాన బాగా పాడగలిగే కుర్రాడికోసం గాలిస్తున్నారు. ఆ నాటక సమాజపు కార్యదర్శి పూరంతా తిరిగాడు. ఓచోట ఓ అమ్మాయి పాట వినిపించింది. సన్నగా తీగలా మెత్తగా హాయిగా తీయగా వున్న ఆ అమ్మాయి గొంతు వినేసరికి కార్యదర్శికి కళ్ళకెదురుగా వైకుంఠం



కనిపించినట్లయింది. వీధి గుమ్మం ముందు కూర్చుని కాలిమీద కాలేసుకుని దర్జాగా మజాగా చుట్టకాల్చుకుంటూ ఆపాట వింటూ ఆనందిస్తున్న ఓ ఆసామిని అడిగాడు. "ఎవరయ్యా అని, బాలకోకిల కంఠం, వాళ్ళ అమ్మానాన్నా ఒప్పుకుంటే మా డ్రామాలో నారదుడి వేషం వేయింపిస్తా" అన్నాట్ట. దానికా ఆసామీ ఇతగాణ్ణి ఎగాదిగాచూసి -- "అబ్బాయిని పట్టుకుని అమ్మాయంటా వేంటయ్యా. భలే తంటాగా వుండాదే నీతో, ఆ పాడేది అమ్మాయని యెవడు చెప్పాడు నీకు" అన్నాడు.

అది విని లోపలికి వెళ్ళి చూసిన కార్యదర్శి ఆశ్చర్యానికి అంతులేదు. ఓ ఏడు సంవత్సరాల బాలగాయకుడు కుర్చీలో కూర్చుని, బాలగంధర్వ**అంటారు** పాట "మూర్తిమంత" దంచేస్తున్నాడు. ఆ అబ్బాయి మన అబ్బాయిగారే. ఆ కార్యదర్శి వేరెవరో కాదు. శోభనాచల రాజరాజేశ్వరీ సంస్థలకి తదుపరి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసి పేరుపొంది, ఆ మధ్యనే స్వర్గస్థులైన కె.వి.సుబ్బారావు.

ఎలాగైతేనేం, అబ్బాయి తల్లిదండ్రులకి నచ్చజెప్పి ఒప్పించి, కె.వి.సుబ్బారావు ఈ కుర్రాడిచేత 'సావిత్రి'లో సావిత్రి చెలికత్తెవేషం, నారదుడి వేషం రెండూ వేయించారు. ఈ అర్భకుడి అభినయానికీ, గానానికీ సభికులందరూ ముగ్ధులై, కరతాళ ధ్వనులతో హాలు దద్దరిల్లజేశారు. తదాదిగా ప్రహ్లాదుడూ, చిన్నికృష్ణుడూ, చిరుతొండడూ వంటి బాలపాత్రలెన్నో అభినయించారు అబ్బాయిగారు. చోడవరంలో ఈ బాలుర 'సావిత్రి' ప్రదర్శనానికి హాజరైన అప్పటి జిల్లా కలెక్టరు రూథర్‌ఫోర్డు దొరగారు అబ్బాయికి స్వర్ణపతకం బహూకరించారు.

సాలూరులో నాలుగు సంవత్సరాలపాటు, ఘంటసాల గురువులైన శ్రీ పట్రాయని సీతారామశాస్త్రిగారి వద్దా, వారి తండ్రి వద్దా అభ్యసించారు. సంగీత పాఠం నేర్పిన పిమ్మట, గురువుగారు, "ఏదిబాబూ, 'మూర్తిమంత' పాడు" అని వాత్సల్యంతో అడిగి పాడించుకుని విని తన్మయులయే వారు. ఈ హిందీ పాటలు సరిగా అర్థం చేసుకోగలందులకని అబ్బాయి ఆనాడే



హిందీ నేర్చుకున్నారు.

పదవ ఏట కాకినాడకి మకాం మార్చారు. అక్కడ యంగ్మెన్సు హాపీక్లబ్‌లో చేరి డ్రామాలు రాయడం ఆర్గనైజ్ చేయడం, హార్మోనీ వాయించడం వగైరా సాగించే వారు. నేటిమేటి నటీనటులైన అంజలీ, రేలంగి, రంగారావు మున్నగు పలువురు కళాకారులు నాటి ఈ యంగ్మెన్సు హాపీ క్లబ్‌లో తరిఫీదు నొంది మెరుగొందినవారే.

బోర్న్‌ఏక్టర్ ఐన శ్రీ ఎస్.వి.రంగారావుగారి బంధువైన డైరెక్టర్ బి.వి.రామానందం వీరిని 'వరూధిని' కోసం సేలం తీసుకొచ్చారు. కాని వీరా చిత్రానికి కొన్ని గీతాలు వ్రాసి, వరసలు చేసి యిచ్చి, కారణాంతరాల వల్ల సగంలోనే వదిలి వచ్చేశారు.

తొలిసారిగా వీరు స్వతంత్రంగా సంగీత సారథ్యం నెరపిన చిత్రం శ్రీ సుబ్బారావుగారి 'పల్లెటూరి పిల్ల'. ఈ చిత్రానికి కథావస్తువు సమకూర్చడంలో కూడా అబ్బాయి కొంతభాగం పంచుకున్నారు. ఆంగ్లనాటకం "పిజారో" ఆధారంగా కొన్ని చక్కని సన్నివేశాలని సృష్టించారు. పల్లె వాతావరణానికి తగిన జానపదగీత పద్ధతిలో పాటలల్లి వరసలమర్చి, ప్రథమ ప్రయత్నంలోనే పాప్యులర్ హిట్స్ అందీయగలిగారు ప్రజానీకానికి. తన ప్రథమ సంగీత దర్శకత్వంలో, ప్రథమంగా రికార్డు చేయించిన పాట తనే వ్రాశారు. అదే 'పల్లెసీమల అందమోయీ' అన్నది. శ్రీదేవి, నరేంద్ర అనే నూతన గాయకీ గాయకులకి చిత్రంలో అవకాశమిచ్చి ప్రోత్సహించారు. ఈ చిత్రంలో శ్రీ తాపీ వ్రాయగా, ఘంటసాల 'జోరుగా హుషారుగా' పాడగా, అబ్బాయి స్వరరచనలో అలరారిన "శాంతవంటి పిల్లలేదోయ్" వంటి పాటకూడా లేదోయ్ లేదోయ్ అని ధీమాగా అనవచ్చు.

"తిలోత్తమ"కు ఉత్తమ సంగీతం సమకూర్చి శ్రీమతి ఎం.ఎల్.వసంతకుమారి చేతా, బేస్ మాస్టర్ సౌమిత్రి చేతా పసందుగా పాడించారు.

అశ్వినీ పిక్చర్సు పేరిట వీరు 'మాయలమారి' 'మాయక్కారి' చిత్ర నిర్మాణం సాగిస్తున్న రోజుల్లో, అళ్వారుపేటలోని ఆఫీసుకు నేను తరుచూ వెడుతూ వుండే వాడిని. పిఠాపురం, బాలసరస్వతులచే ప్రణయద్వంద్వగీతం రిహార్సల్సు చేయిస్తూ వుండే సమయాన నేను ప్రక్కనే వింటూ కూర్చునే వాడిని తన్మయుడినై, తీగలాసాగి వీణలా పలికే శ్రీమతి బాలసరస్వతి గొంతు చిలికే సంగతుల ఒదుగులు గమనిస్తూ విస్తుపోయే వాడిని. ఈ జంటే ఈ చిత్రంలోనే మరో వీధి భాగవతం పాటకూడా పాడారు. "రాజా వెడలివచ్చె సభకు, రవితేజములలరగ రాజు" అని మొదలయే ఆ గీతం అఠాణాలో మిఠాయిలా అందించారు అబ్బాయిగారు. అంతేకాక, "అంతా అంతా యింతేరా" అనే పాట కడుపుబ్బ నవ్వు పుట్టించే విధాన వ్రాసి, ట్యూను చేసి, గమ్మత్తుగా



పాడించారు శ్రీ కస్తూరి శివరావుచేత. ఈ పాట రిహార్సలు చేస్తూ శ్రీ శివరావు చేసే అల్లరీ గల్లంతూ, ప్రదర్శించే హావభావాలూ నేటి రాక్ ఎండ్‌రోల్ కేమాత్రమూ తీసిపోయేవి కావు. నాకీనాటికీ మరవురావు. నేను వీరిని కలుసుకున్నాను. నేపథ్య గాయకుని హోదాలో. 'లబ్జకనడి లబాం లబాం' అనే విలక్షణమైన హాస్యగేయం నాచే పాడించారు కాని అది తదుపరి కత్తెర కెర అయింది. చిత్రంలో లేదు.

'పరదేశి' చిత్రంలో శ్రీ మల్లాది కృష్ణశర్మ విరచితమైన 'నేనెందుకు రావాలి' అనే గీతం శ్రీమతి జిక్కీ చక్కగా పాడారు. 'నా హృదయంలో యెవరో పొంచి పలుకరించేరు' అని శ్రీమతి కోమల మిశ్రమధ్యమావతి రాగంలో తిశ్రతాళంలో ఆలపించిన గీతం మలయమారుతం (రాగం కాదు)లా పులకింపజేస్తుంది.

"అనార్కలీ" తెలుగు చిత్రంలోని పాట ప్రతిదీ హిందీ "అనార్కలీ" చిత్రంలో వలెనే, ప్రజల పెదవుల మీద నిరంతర నృత్యం సలిపింది. "కలవోలె ప్రేమ కరిగిపోవునా" అని మాయామాళవ గౌళలో జిక్కీగళం వినిపించిన గీతం విని కరగని హృదయమే వుండదు. మిశ్రకీరవాణిలో 'అనార్‌కలీ అనార్‌కలీ' అని వినిపించిన టైటిల్‌సాంగ్ నా గుండెని కదలించి వేసింది. "భీంపలాస్"లో 'జీవితమే సఫలమూ', "మాండ్" జిల్లాలో సంచరించిన "నమదయగనుమా కొనుమా" 'మా కథలే ముగిసెనుగా ఈగతి' అనే శోకగీతి; 'తాగి తూగేనని తలచెను లోకము' అని మత్తుగా చిత్తు చేసే త్రాగుడు పాటా; ఇవన్నీ సాహిత్య సంగీతపరంగా పరిపాటిలేనివి శ్రీమతి జిక్కీగారి చక్కెర గొంతునుండి స్రవించిన మధుర సంగీత మధుర సధారలు. "సోజా రాజకుమారీ సోజా" (సైగల్ పాడినది కాదు). అని "రాజా"గారు తాజాగా మృదువుగా, మెత్తగా, హాయిగా పాడిన జోలపాట జోకొట్టింది. ఈజోల మధ్యమావతి ఛాయలో సాగింది మాల్కోస్‌లాగే మధ్యమావతి కూడా తరుచు వినిపిస్తుంది అబ్బాయిగారి అనేక గీతాలలో.

జిక్కీ ఘంటసాల ద్విగళ గీతి "రాజశేఖరానీపై మోజు తీరలేదురా" పాట వింటున్న వారి కెంతకీ ఆ పాటపై మోజు తీరదు. మాల్కోస్ రాగంలో మధురాతి మధురంగా మలచబడిందీ గేయశిల్పం. "కలిసె నెలరాజు కలువ చెలినీ, కలిసె యువరాజు అనార్కలినీ" అని శ్రీ సముద్రాల కలం చిగురింప జేసిన "పల్లవము" (పల్లవి) శ్రోతల ఉల్లాన్ని ఉల్లాసంతో నింపింది. అదే పల్లవిని పదేపదే పల్లవింప జేసింది.

"అశ్వరాజ్" వారి "అన్నదాత"లో "కాటకం, కాటకం", 'జయ జయ యదు వీర, "స్వర్గమిదేనోయి, "రింగు రింగున సాగిపోవె రంగు రంగుల బోటా" అన్న జిక్కీ పియన్నార్ల హాస్యగీతం, అబ్బాయిగారి కలం నుండి వెలువడినవే. ఈ చిత్రంలోని, 'ప్రళయ పయోధిజలే" అని సుశీలగా రాలపించిన అష్టపదిని రాగాష్టకంలో పదిలపరిచారు. కళ్యాణి, కమాచి, హిందోళం (మాల్కోన్) మోహన, ధన్యాసి, అఠాణా కేదారగౌళ, మధ్యమావతులు చేరికయే ఈ వర్గరాగమాలిక. రాగమాలికలంటే అపారమైన అనురాగం అబ్బాయిగారికి. సువర్ణసుందరి, స్వర్ణమంజరి చిత్రాల్లోనే కాక హిందీ చిత్రంలో కూడా రాగమాలికలున్నాయి.

"సువర్ణసుందరి" కిచ్చిన సంగీతంతో వీరి కీర్తిసౌరభం వింధ్యాచలాగ్రాలనుదాటి హిమాచలాగ్ర శిఖరాలనందుకుంది. తెలుగు, తమిళ, హిందీ భాషలలో మూడింటిలోనూ వీరి సంగీతం ప్రజల్ని ముగ్ధుల్ని కావించింది. హిందీ సుందరి కందించిన సశాస్త్రీయమైన సంగీతం విని ఉత్తరాదివారు ముక్కుమీద వేలేసుకున్నారు. 1958లో వీరిని ఉత్తమ సంగీతదర్శకులుగా ఎన్నుకున్నారు. ఎవార్డిచ్చారు. ఇహ దక్షిణాది వారూరుకుంటారూ? అనేక సన్మాన సభలు జరిపారు. వీరి నభినందిస్తూ ఈ గౌరవం దాక్షిణాత్య ఫిలిం పరిశ్రమకంతటికీ చెందు

తుందన్నారు వారందరూ.

పిలవకురా (తెలుగులో జిక్కీ పాడినది).

ఆళైక్కాదే (అరవంలో సుశీల పాడినది).

ముఝే నాబులా (హిందీలో లత పాడినది).

మూడు, మూడు దేశాల్లోనూ మార్మోగాయి మాల్కోన్ రాగంలో. ఈ పాట వినే ప్రతి రసికు డికీ, పిలవొద్దని బతిమాలినా, పిలవాలనే అనిపిస్తుంది. "మాల్కోస్ రాగం అంటే నాకు మహాప్రీతి. పైగా సెంటిమెంటు కూడాను. ప్రతీ చిత్రంలోనూ ఈ రాగాన్ని ఉపయోగించకపోతే నా మనసు తృప్తి చెందదు. ఒకవేళ నేను మరిచినా, నా సహాయకులు నన్ను మరవనీయరీ రాగాన్ని, కాని డ్రామాల కాలంలో భీంప్లాస్ పై మక్కువ యెక్కువగా వుండేది" అనేవారాయన. మాటల మధ్య "హాయిహాయిగా ఆమని" గేయాన్ని హంసానంది, బహార్, అసావేరి, యమన్‌రాగాల మాలతో అలంకరించారు. లీలగారి "బంగారు వన్నెల రంగారు రంగేళీ" సుశీల యమ్మె ప్రామారావుల యుగళగీతి, పిఠాపురం, సత్యం వగైరా పాల్గొన్న కామెడీసాంగ్, 'పాహిపరమేశ్వరా జగదీశ్వరా' అన్న సుశీలగారి మొరలిడే భక్తిగీతం శ్రోతల హృదయాలని రంజింపజేసి, లాలించి, నవ్వించి, కవ్వించి, కరిగిస్తాయి. కరిగించాయి.

నాకు వీరితో పరిచయం అధికమైనది "అడుత్తవీట్టుపెణ్" (పక్కింటమ్మాయి) అరవ చిత్రం తాలూకు పాటల రికార్డింగు సందర్భంలోనే, ఆ చిత్రంలో నేను చాలా పాటలు పాడాను, ప్రతీపాటా హిట్టే.

"వాదాదపుష్పమే... వనితామణియే.... అని ప్రారంభించి సంగీతం మాష్టారు పాఠం చెప్పుకుంటున్న అమ్మాయి చూస్తూ వెకిలి చేష్టలు చేస్తూ వుంది. యెవరో వస్తూన్న అలికిడి వినబడడంతో 'వాతాపిగణపతిం భజే' వా వా వా (రా, రా, రా) అని ద్వంద్వార్థంలో, గణపతి స్తోత్రం తెలివిగా ముగించే రసవత్తర సన్నివేశాలు పలికించడం వీరి ఔచిత్యానుసరణకి ఉదాహ రణలు.

వీరి "ఋణానుబంధం"లో కూడా నేను నాలుగు పాటలు పాడాను. మొదటిది సుశీల గారితో పాడిన 'దీపావళి' పాట "ఓహో ఒయ్యారిలాహిరి, వచ్చింది దీపాల పండగ' అన్నది. రెండవది జానకిగారితో కలిసి ఆలపించిన "అందమైన బావా ఆవు పాలకోవా" అనే జూనియర్ సముద్రాల రచించిన హాస్యగీతం. ఇందులో రాగాల రవ్వట్టు, భోగాల బొబ్బట్టు, నా ప్రేమ పెసరట్టులాంటి పదాల ప్రయోగం హైలైటు. జూనియర్‌కి యివ్వవలసిన మార్కు సెపరేట్. మూడవదీ జూనియరుదే. "రావేల అందాల బాలా" అన్న శ్రీనివాస్సుశీలా ఘంటసాల ట్రిప్లెట్టు నాల్గవది మొదటి పండుగ పాట వ్రాసిన శ్రీ కొసరాజు రచన "ఏహే ఏహేఁ ఒహోఁ ఒహోఁ నీళ్ళు తోడాలే" అన్న గుమ్మడికి నేను పాడిన ఈ పాట పక్కా జానపదరీతిలో సాగిన గానపదం.

ఇవికాక ఘంటసాల సోలో "ఋణానుబంధం" అనే థీంసాంగ్‌ని మరవలేము. "నిండు వున్నమినెలా - పండెతీయనికలా" అని కమ్మగా శుకపికాలుగా కలిసి ఆలపించిన గాయనీ ద్వయం గానం అద్వితీయం.

"స్వర్ణమంజరి"లో కూడా బంగారులాంటి పాటలు కుదిరాయి. "ఇదియే జీవితానందమూ" అన్న సుశీల ఘంటసాలల యుగళగీతం అరవంలో నేను సుశీలగారూ రాగమాలికతో ఆలపించాము. తిలక్, బసంత్, కమాస్, కళ్యాణి రాగాల సమిశ్రణంతో రసోత్పత్తి కావించారు. ఈ రాగసాగర సంగమంలో స్నానమాడి రంజిల్లింది రసిక లోకం. మాల్కోస్‌లో సుశీల నాగయ్యలు మధురంగా పాడిన "మధురమైన గురుదీవెన" నిజంగా మరుపురాని ప్రియభావన. జానకిగారి "మైమరపించే యీ సొగసూ, మురిపించే యీ వయసూ నీవేలే" గేయము అమృతోపమేయం. నాణెమైన నటభైరవిలో నటరాజుని ఎలుగెత్తి పిలిచిన సుశీలగారి తరలిరావా - ననూ కావా - శరణు నీవే మహాదేవా" అన్న పిలుపు విని పరమశివుడు పలికాడంటే (చిత్రంలో) మానవమాత్రులమైన మనం. వేరేమనగలం? ఆ పాట ఎంతటిదని చెప్పగలం? "అమ్మా! నీ ఆశలన్ని తీరెనా" అన్న ఘంటసాల నేపథ్యగానం నిరుపమానం. "ఏనో ఏనో ఎన్నాళుమిల్లా ఆనందం" అనే జానకి శ్రీనివాస్సుశీలల త్రిగళగీతం (Triplet) రసభరితం. ఇదే తాళమాలిక తెలుగులో "ఏమో ఏమో ఎదలోన పొంగే ఆనందం" అని జానకి సుశీలా ఘంటసాలలు వినిపించారు.

పాటలను సుస్వరాలతో రాగమాలికా డోలికలుగా చేసి రసికలోకాన్నంతటినీ వూపివూపి జోకొట్టిన ఆదినారాయణరావుగారు చలనచిత్ర సంగీత రంగానికి చేసిన సేవ కమనీయం సదాస్మరణీయం!

---



'హాసం' ఆగష్టు 1-15 సంచిక పేజీ 36లో ఎ.ఎమ్.రాజా కేసెట్ వివరాలలో "మనసూగే సఖ" పాట "బంగారు పాప"లోనిదని ప్రచురించారు. కేసెట్‌లో తప్పు జరిగిందో "హాసం"లో తప్పు జరిగిందో తెలియదుకానీ ఆ పాట "భాగ్యరేఖ" చిత్రంలోనిదని గమనించమనవి.

-డాక్టరు రహంతుల్లా, పర్లాకిమిడి (ఒరిస్సా)

జులై నెల 1-15 'హాసం' సంచికలో శ్రీ బాల మురళీకృష్ణగారి పుట్టిన రోజు ఆయన పాడిన పాటలు శీర్షిక క్రింద నర్తనశాలలో రచన సముద్రాల అని కరెక్టుగా వ్రాశారు. గానం సుసర్ల దక్షిణామూర్తి, బెంగుళూరు లత అని తప్పుగా ముద్రణ జరిగింది. సంగీతం అని వుండాల్సినది. గమనింపగలరు.

-పి.శివశంకర్, కడప

అవును. కరెక్టే. సంగీతం సుసర్ల దక్షిణా మూర్తి గానం: బెంగుళూరు లతతో యుగళం అని ఉండాల్సింది. -ఎడిటర్

'హాసం'1-15 ఆగష్టు సంచికలో "జన వాక్యం"లో సరిలేరు నీకెవ్వరూ "పాట రచయిత దాశరథి, సినారెయా అన్న ప్రశ్నకు సినారే అని మీరు ధృవీకరించటం జరిగింది. 'జనరంజని'లో ఇలాంటి పొరపాటు ఎందుకు జరిగిందా అన్న నా ప్రశ్నకు జవాబు దొరికింది. పాట తరువాత వచ్చే "ఎచటనో గల స్వర్గమ్ము నిచట దించి" అన్న ఘంటసాల పద్యం రాసిన రచయిత దాశరథి గారట.

-సోమయాజుల సాయిప్రసాద్, ఒనకడిల్లీ (ఒరిస్సా)

**పొరపాట్లు - కృతజ్ఞతలు**

**"ముద్రారాక్షసాలు తెలుగు పుస్తకానికి సహజాలు' అని ఆరుద్రగారు చమత్కరించి నట్టుగా - రెగ్యులర్‌గా ఉండే చిన్నిచిన్ని అచ్చు తప్పులతో పాటు క్షమించ రాని అచ్చు తప్పులు ఈ మధ్య దొర్లాయి. అవి: 1-15 ఆగష్టు 2002 సంచికలో 'ఆడియో రివ్యూ' పేజీలో ఎ.యమ్.రాజాతో 'అప్పుచేసి పప్పుకూడు' సినిమాలోని 'చేయి చేయి కలుపరావె హాయి హాయిగా' పాటను పాడినది లీల అయితే కాదు సుశీల అంటూ పేర్కొనటం. 74వ పేజీలో 'నా దేశం భగవద్గీత' అనే పాటను రాసింది సి.నారాయణరెడ్డి అయితే శ్రీశ్రీ అని ముద్రించటం. ఈ రెండిటిని ఎంతో సంస్కారంతో మా దృష్టికి తీసుకువచ్చిన పాఠక సోదరులకు కృతజ్ఞతలు.**

**- ఎడిటర్**

## చిత్రం: సువర్ణసుందరి

రచన: సముద్రాల సీనియర్ గానం: ఘంటసాల, జిక్కి

ఆమె: ఆ ఆ ఆ హోయి హోయిగా ఆమని సాగె ॥హోయి॥
సోయగాల గనవోయీ సఖా హోయి సఖా॥ఆ.... ॥హోయి॥
అతడు: లీలగా పువులు గాలికి ఊగ ॥2॥
సనిదమదనిస
ఆమె: గమగమదనిస
ఇద్దరూ: రిసని దని /సరిసని/సరిసని దనిని దనినిదని
మదద మదదమగ గరిగమదని ॥లీలగా॥
కలిగిన తలపుల వలపుల రేగ ॥కలిగిన॥
ఊగిపోవుమది ఉయ్యాలగా జంపాలగా ॥హోయి॥
ఆమె: ఏమో.... ఏమో తటిల్లతిక మేమరుపు, మైమరపేమో
అతడు: మొయిలు రాజు దరి మురిసినదేమో
ఆమె: మైమరపేమో
అతడు: మొయిలు రాజు దరి మురిసినదేమో
ఇద్దరు: వలపు కౌగిసుల వాలిసోలి ॥వలపు॥
ఊగిపోవు మది ఉయ్యాలగా జంపాలగా ॥హోయి॥
ఆమె: చూడుమా చందమామ అటు చూడుమా చందమామ
అతడు: కనుమా వయ్యారి శారద యామిని కవ్వించె
ప్రేమా చూడుమా చందమామ
ఆమె: వగల తూలె విరహిణుల ॥వగల॥
అతడు: మనసున మోహము రేపునదవురా ॥మనసు॥
ఇద్దరూ: ఊగిపోవు మది ఉయ్యాలగా
జంపాలగా.... ఆ.... ॥హోయిగా
అతడు: ఆ.... కనుగవా తనియగా ప్రియతమా
కలువలు విరిసెనుగా ॥కను॥
ఆమె: చెలువము కనుగొనా ॥చెలువము॥
మనసానంద నాట్యాలు చేయునోయి
ఆనంద నాట్యాలు చేయనోయి
ఇద్దరు: నిరిగమదనిస దనిస
సని సగరిగ సరినిస దని మదనిస నిరినిరి
దనిదని మదమద గమగమ
గమదనిస గమదనిస దనిసా

## చిత్రం:రుణానుబంధం

రచన: సముద్రాల జూనియర్ సంగీతం: ఎస్.జానకి, పి.బి.శ్రీనివాస్

ఓ అందమైన బావా - వహ్వా
ఆవు పాలకోవా - వరేవా
విందుగా పసందుగా నా ప్రేమనందుకోవా
ఓ హోటు హోటు గారి - వెరీవెరీసారీ
స్వీటు స్వీటుబూరీ - వై వై హరీ ॥హోటు॥
వలపు తలపు కలపి వండినానోయ్ - అమ్మోయ్
రాగాల రవ్వట్టు - భోగాల బొబ్బట్టు ॥రాగాల॥
నా ప్రేమ పెసరట్టు భుజింపరావా - ఓ మైగాడ్ ॥అందమైన॥
ఓ నిన్నే కోరివచ్చా - కన్నెమనసు ఇచ్చా
తళుకు బెళుకు కులుకులన్ని తెచ్చా-మెచ్చా
మెచ్చారా బావయ్య - నచ్చావు లేవయ్యా
చచ్చినా పోనయ్యా అంతేనయా - అయ్యబాబోయ్
అందమైన బావా -- ఊహుఁహుఁ
నోనో - గో-గో-బైబైబై..........

## చిత్రం:కళ్యాణమంటపం

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి గానం: పి.సుశీల

"సరిగమ పదనిస నిదప మగరిస" అని
పలికే వారుంటే, హృదయము తెరిచే వారుంటే,
వలచే మనసుకు బదులుగ, బదులుగ,
పిలిచే కనులకు ఎదురయి, ఎదురయి
పలికే వారుంటే, హృదయము తెరిచే వారుంటే ॥సరిగమ॥
"ఒక కోవెలలో ఒకడే దేవుడు!
ఒక హృదయములో ఒకడే ప్రియుడు!
జీవననేత, ప్రేమవిధాత"
అను గుడిగంట! విను ప్రతిజంట! ॥సరిగమ॥
"తీగ తీగా పెనగీ పెనగీ
రాగధారగా సాగీ సాగీ,
జీవన గంగవాహిని కాదా!"
అను ప్రతి జంట! విను గుడిగుంట! ॥సరిగమ॥

## చిత్రం: అల్లూరి సీతారామరాజు

రచన: శ్రీశ్రీ సంగీతం: ఘంటసాల, వి.రామకృష్ణ

తెలుగు వీర లేవరా ఆ... ఆ...
దీక్షబూని సాగరా! ఆ... ఆ...
తెలుగు వీర లేవరా దీక్షబూని సాగరా!
దేశమాత స్వేచ్ఛకోరి తిరుగుబాటు చేయరా ॥తెలుగు॥
దారుణ మారణకాండకు తల్లడిల్లవద్దురా!
నీతిలేని శాసనాలు నేటి నుండి రద్దురా!
నిదుర వద్దు బెదరవద్దు నింగి నీకు హద్దురా
నింగి నీకు హద్దురా
ఎవడు వాడు ఎచటివాడు ఇటు వచ్చిన తెల్లవాడు!
కండ బలం, కొండ ఫలం కబళించే దుండగీడు!
మానధనం, ప్రాణధనం దోచుకునే దొంగవాడు
తగిన శాస్తి చేయరా - తరిమి తరిమి కొట్టరా ॥తెలుగు॥
ఈ దేశం ఈ రాజ్యం నాదేనని చాటించి
ప్రతి మనిషి తొడలు గొట్టి శృంఖలాలు పగులకొట్టి
చురకత్తులు పదునుపట్టి - తుది సమరం మొదలు పెట్టి!
సింహాలై గర్జించాలి - సంహారం సాగించాలి!!
వందేమాతరం - వందేమాతరం!
వందేమాతరం - వందేమాతరం ॥తెలుగు॥
స్వాతంత్ర్య వీరుడా - స్వరాజ్య భానుడా!
అల్లూరి సీతారామరాజా - అల్లూరి సీతారామరాజా!!
అందుకో మా పూజలందుకో రాజా!
అల్లూరి సీతారామరాజా - అల్లూరి సీతారామరాజా!!
ఓ... తెల్ల వాడి గుండెల్లో నిదురించినవాడా! మా
నిదురించిన పౌరుషాగ్ని రగిలించినవాడా! ॥తెల్ల॥
త్యాగాలే వరిస్తాం! కష్టాలే భరిస్తాం
త్యాగాలే వరిస్తాం! కష్టాలే భరిస్తాం
నిశ్చయముగ, నిర్భయముగ
నీ వెంటనె నడుస్తాం - ॥నిశ్చ॥
వందేమాతరం! వందేమాతరం!!...

ఆగష్టు 31 ముకేష్ వర్ధంతి సందర్భంగా

# ముకేష్ - ద మాన్ ఆఫ్ మెలడీ



హిందీ చలన చిత్ర పరిశ్రమకి లభించిన
అమూల్య రత్నం ముకేష్
తన 'గళం'తో 'అమరత్వాన్ని' సిద్ధింపచేసుకున్న
సంగీత సరస్వతీ పుత్రుడు ముకేష్.
విచిత్రం ఏమిటంటే...
'హీరో'గా అడుగుపెట్టిన
ముకేష్ 'గాయకుడు'గా ప్రజల హృదయాల్లో
నిలిచిపోవడం.



"వేళ్ళల్లోంచి జారిన ఇసుక....
ఈ కదిలే కాల ప్రవాహం...!
మళ్ళీ తిరిగి రాదు -
మనసుని వదలిపోదు॥" 'పాదచారి'

*

సన్నని వాన చినుకులు పడుతూవుంటే -
వర్షం పెద్దయి జుత్తుమీదుగా చినుకులు కిందకి జారి
కళ్ళల్లో పడుతూవుంటే -
మౌనంగా తడుస్తూ
ఓ ఒంటరి చెట్టు నీడన
వేదనతో రగులుతూ వున్నప్పుడు
ఓ విషాద గీతం గుండె పొరల్ని చీల్చుకుని
గొంతులోంచి బయటికొస్తుంది.
'దిల్ జల్‌తాహై తో జల్‌నేదో'
(హృదయం మండుతూ వుంటే మండనీ)
'ఆసూఁన బహో ఫరియాద్ న కర్'
(కన్నీరు కార్చకు, ఫిర్యాదు చెయ్యకు)

*

అది 'పెహలీ నజర్' సినిమాలో ముకేష్
పాడిన మొట్ట మొదటి పాట
'రాయల్ అల్బర్ట్ హాల్'లో ఆల్‌మోస్ట్
ఆయన పాడిన చివరి విషాదగీతమూ అదే.
'విషాద గీతాల చక్రవర్తి' ముకేష్.
విరహమూ, విషాదమూ, అతి సున్నితమైన
ప్రేమా - ఆయన గొంతులో పలికినట్లు,
మరే గొంతులోనూ పలకవు.

**

1923 జులై 22న ఢిల్లీలో జన్మించిన 'ముఖేష్ చంద్ర మాధుర్' తన స్నేహితుడు 'హరీష్' ప్రోత్సాహంతో 1941లో ముంబైలో అడుగుపెట్టారు. 'దుఖ్.. సుఖ్'... 'ఆదాబర్జ్' వంటి సక్సెస్ ఫుల్ సినిమాల్లో హీరోగా నటించారు. ఆ తరవాత నాటి మేటి నటులతో చాలా చిత్రాల్లో నటించినా - చాలా చిత్రాలు పూర్తికాక పూర్తయిన చిత్రాలు 'సక్సెస్'కి నోచుకోక నటజీవితానికి స్వస్తి పలకాల్సి వచ్చింది. ఆ కాలంలోనే మరో విచిత్రం జరిగింది. ముకేష్ కొన్నాళ్ళపాటు తన స్నేహితుడూ, నాటి మేటి నటుడూ అయిన 'మోతీలాల్' ఇంట్లో వున్నారు. ఆ రోజుల్లో ఒకనాడు మోతీలాల్ ఇంటి ముందుగా వెళుతున్న ప్రసిద్ధ గాయకుడు నటుడూ అయిన 'కె.ఎల్. సైగల్'కి ఓ మధుర స్వరం వినిపించింది. ఆ స్వరాన్ని విని - అది మోతీలాల్ ఇంట్లోంచి వస్తున్నదని గమనించి - తన పనిని మర్చిపోయి - మోతీలాల్ ఇంట్లోకి చొరబడి-ఇంతకుముందు పాట పాడిన కుర్రాడెవర'ని ఆరాతియ్యడం- మోతీలాల్ ముకేష్‌ని చూపించి 'ఇతడే' అని పరిచయం చెయ్యటం - వెంటనే కె.ఎల్. సైగల్ ముకేష్ భుజంతట్టి 'ఈ కుర్రాడు ఒకానొకనాడు తప్పకుండా నా వారసుడవుతాడు.... సినిమాల్లో చేర్పించు' అని మోతీలాల్‌కి సలహా ఇవ్వటం జరిగింది.

కె.ఎల్.సైగల్ 'భవిష్యవాణి'తరువాత కొద్దికాలంలోనే 'అక్షరాలా' ఋజువయ్యింది. 1947లో ముకేష్, 'పెహలీ నజర్' సినిమాలో 'దిల్ జల్ తాహైతో' పాటతో గాయకుడిగా మరో అవతారమెత్తాడు. ఆ సినిమాకి సంగీత దర్శకుడు అనిల్ బిశ్వాస్.

ఆ సాంగ్ సూపర్ హిట్టయింది. కానీ కె.ఎల్.సైగల్‌ని - డిటో - దింపేస్తున్నాడన్న అపవాదు మీద పడింది. (ఇప్పటికీ ఆ పాట వింటే కె.ఎల్.సైగల్ ఛాయలే కని/ వినిపిస్తాయి) జూనియర్ కె.ఎల్ అని పేరు పడ్డా - అవకాశాలు మాత్రం ముకేష్‌ని వెతుక్కుంటూ వచ్చాయి. తన స్వరంలో నిండి వున్న కె.ఎల్.సైగల్ 'ముద్ర'ని తొలిగించుకున్న ముకేష్ మళ్ళీ వెనక్కి తిరిగి చూడలేదు. ఎందరో నటులకి ఆయన సూపర్‌హిట్ సాంగ్స్ పాడారు. అవన్నీ ఒక ఎత్తయితే రాజ్‌కపూర్‌కి 'ఆగ్' - 'బర్సాత్' వంటి చిత్రాలలో పాడటం మరో ఎత్తు. ఒక అద్భుతమైన కాంబినేషన్‌కి అది నాంది అయింది. ఒక ట్రెండ్ క్రియేట్ అయింది. విషాద గీతాలకి ముకేష్ గళం కేరాఫ్ అడ్రస్సయింది. హిందీ చలన చిత్ర సీమలో పంచపాండవులన దగ్గవారు రాజ్‌కపూర్ - శైలేంద్ర - శంకర్ - జైకిషన్ - ముఖేష్‌లు. కొన్ని దశాబ్దాల పాటు 'అభినయ, సాహిత్య - సంగీత - గాన సరస్వతులకు అమృతాభిషేకం చేసిన ఘనత వారిది'. చిత్ర 'సరస్వతి'కి స్వర్ణ కంకణం తొడిగిన మహానుభావులు వాళ్ళు. ప్రతి పదానికీ అనుభూతిని అద్దుతూ, 'భావ'మున్న పాటలకు 'ప్రాణం' పోసే గాయకుడిగా ముకేష్ పేరుగాంచాడు. పది వేల పాటలకు పైగా (ఫిల్మీ అండ్ నాన్ ఫిల్మీ సాంగ్స్) పాడి శ్రోతలకు వీనుల విందు చేశాడు. తెలుగులో 'భగవద్గీత'కి ప్రాణం పోసిన 'ఘంటసాల' వారిలా హిందీలో తులసీదాస్ రచించిన 'రామ చరిత మానస్'కు 'ప్రాణం' పోసి ముకేష్ ప్రజల హృదయాల్లో నిలిచిపోయాడు. ప్రతి ఆలయంలోనూ 'రామ చరిత మానస్' మారు మ్రోగింది. ముకేష్ జీవితం ధన్యమయింది. మరే గాయకుడ్నీ ప్రేమించనంతగా ప్రజలు ముకేష్‌ని ప్రేమిం

చారు. ఆయన్ని ఆరాధించారు. ఆయన స్వర్గస్థుడైన రోజున గోలుగోలున విలపించారు.

27 ఆగష్టు 1979న ది గ్రేటెస్ట్ షోమాన్ రాజ్‌కపూర్ "నా గొంతు మూగబోయింది. నా శరీరంలో నించి ఒక భాగం నన్ను శాశ్వతంగా వదిలి వెళ్ళి పోయింద"ని భోరున ఏడ్చాడు. క్రమం తప్పక ముకేష్‌కి 'రాఖీ'లు కట్టి 'భయ్యా' అని ప్రేమగా ముకేష్‌ని పిలుచుకునే లతా మంగేష్కర్ 'గొంతు' - ముకేష్' మరణంతో మూగ బోయింది. ముకేష్‌ది 'అనాయాస' మరణం. మనిషి గొప్పతనాన్ని 'మరణం'లో చూడమంటారు కాదూ!


రాజ్‌కపూర్‌తో ముఖేష్

అందరం ఏదో ఒకనాడు 'అటూ ఇటూ'గా లోకాన్ని వదిలి పోవలసిన వాళ్ళమే.

కొందరు 'జీవిస్తూ' మరణిస్తారు. మరికొందరు 'మరణించినా' జీవిస్తారు. అలా 'మరణించినా' 'జీవిస్తూనే' వున్నా మహానుభావుల్లో 'ముకేష్' ఒకరు. ఆయన మనమధ్య లేకున్నా ఆయన 'స్వరం' మనల్ని అలరిస్తూనే వుంటుంది. ఎన్నెన్నో 'తీపిగురుతుల్ని' అనుక్షణం మనకి అందిస్తూనే వుంటుంది.

**మనసు 'ఏకాకి' అయినప్పుడు ముకేష్ పాట వింటే చాలు ఎద సేద తీరుతుంది.**
**వేదనతో 'రగిలే' క్షణంలో ముకేష్ పాట వింటే చాలు - మనసు 'చల్ల' బడుతుంది.**
**ఎందరో గొప్ప గాయకులు వుండొచ్చు.**
**కానీ 'అనుభూతి'ని అద్దటం ముకేష్‌కే చెల్లింది.**
**'ఆ లౌట్‌కే ఆజా మేరే మీత్' అని నేస్తాన్ని విహ్వలంగా పిలిచినా-**
**'ఆసూఁ భరీహై ఏ జీవన్‌కి రాహే' అని వేదనతో పిలిచినా -**
**'సావన్ కా మహీఁనా పవన్‌కరే సోర్' అని ఉత్సాహంగా ఉరకలు వేసినా**
**'బోల్ రాధా బోల్ సంగమ్ హో గా కే నహీ' అని అల్లరి చేసినా**
**'జీనాయహాఁ మర్ నా యహా... ఇస్ కే శివా జానా కహా' అని ఘోషించినా...**
**'ప్యార్ కర్ లేనై తో ఫాఁసీ చఢ్ జాయెగా' అని బెదిరించినా-**
**'హంతో జాతే అప్‌నీ గాఁవ్, సబ్ కో రామ్ రామ్‌రామ్' అని శెలవు తీసుకున్నా -**
**ముకేష్ ఎప్పటికీ మనతోనే వుంటాడు.... మనలోనే వున్నాడు.**
**'నా జీవితపు నీ పేజీని గుర్తుపట్టనీ -**
**నీ జీవితపు నా గతాన్ని నిలిపి వుంచనీ-**
**నీదీ - నాదీ - గతించిన గతమే!**
**మిగిలేదీ - మిగిలిందీ జ్ఞాపకాల తృణమే -**
**అయినా అది నాకు అనంతం!!**
**మిగలనీ ఇలాగే - అద్యంతం!!**
**-ఖుదాహాఫీజ్,**

**-భువనచంద్ర**

# బాంబే పై కీర్తన

సుప్రసిద్ధ కర్నాటక సంగీత విద్వాంసుడు చెంబై వైద్యనాథన్ భాగవతార్‌కి ఓసారి క్లిష్టమైన సమస్య ఎదురైంది. బాంబేలోని షణ్ముఖానంద హాల్‌లో తమిళ శ్రోతల మధ్య ఆయన కచ్చేరీ జరుగుతూండగా ఆడియన్స్‌లోంచి ఒకరడిగారు- "బాంబే మీద ఒక కీర్తన పాడరాదా?" అని. అష్టావధానంలో అయితే మాట విరిచో, ఇంకోటి చేర్చో అప్పటికప్పుడు ఓ పద్యం పాడేస్తారు కానీ కీర్తన పాడడం సాధ్యమా? చెంబైకు ఆ శ్రోత తుంటరితనం అర్థమయింది. హాస్య ప్రియుడైన చెంబై ఒక్క చిరునవ్వు నవ్వి, పున్నాగవరాళి రాగంలో 'ఆడు పాంబే, విలయాడు పాంబే'' (ఆడు పామూ, ఆటలాడు పామూ) అనే కీర్తన ఎత్తుకున్నారు. దీనిలో ఒక చమత్కారం ఉంది. పామును తమిళంలో పాంబు అంటారు. సంబోధనకు వచ్చేసరికి 'పాంబే' అంటారు. సుబ్రహ్మణ్యేశ్వరుడిని కీర్తిస్తూ పాడే ఆ పాటను చెంబై ఎత్తుకోవడంలో తమాషా ఏమిటంటే - తమిళంలో 'ప', 'బ'లకు అభేదం ఉంది. అంటే 'ప' ను 'బ' గానూ, 'బ'ను 'ప'గా పలికినా ఫరవాలేదు. (అసలు రెండింటిని రాయడానికి ఒకటే అక్షరం వాడాలి కూడా) ఆయన 'పాంబే' అన్నది 'బాంబే'కు అన్వయించుకు చూస్తే చెంబై గెలిచినట్లే!



ఈ 'ప' గురించి ఇంకో ముచ్చట చెప్పుకోవాలి. ప్రఖ్యాత తమిళ సినిమా దర్శకుడు భీమ్‌సింగ్ 'ప'తో తీసిన సినిమాలన్నీ సూపర్‌హిట్లే! పాశమలర్ (రక్తసంబంధం), పడిక్కాద మేదై (ఆత్మబంధువు), పావమన్నిప్పు (ఒకే కుటుంబం)... ఇలా ఎన్నో.... బాగ పిరివినై (కలసి వుంటే కలదు సుఖం) కూడా ఆ ఎక్కవుంట్‌లోనే పడి పోయింది.



ఎందుకంటే 'బా'ను తమిళంలో 'పా' అనే రాస్తారుగా! (భీమ్‌సింగ్‌ను పీమ్‌సింగ్ అని రాస్తారు - తమిళంలో వత్తులు చాలా తక్కువగా వాడతారు)

బా అనగానే ఇప్పటి 'బాబా' గుర్తుకు రావచ్చు. అవును 'బాబా' రాయాలంటే 'పా' అనే అక్షరాన్ని రెండుసార్లు రాస్తారు. తమిళ లిపిలో 'ప', ఇంగ్లీషు 'యు'ను పలకలుగా రాసినట్టుంటుంది. బాబా సినిమాకి రజనీకాంత్ చూపుడువేలు, చిటికెన వేలు పైకెత్తి చూపే సింబల్‌కి వేదాంత పరంగా ఏదైనా అర్థం ఉండవచ్చేమో కానీ మామూలుగా చూస్తే దానిలో తమిళ 'ప' కనబడుతుంది. కావాలంటే 'బాబా' తమిళ పోస్టర్ చూడండి. తెలుగు అక్షరాల్లో 'బా'ను కూడా కాస్త ఆ రూపానికి దగ్గరగా తెచ్చారని పిస్తుంది.

-శిల్ప

### చిత్రం: మధుమతి

గీతం: శైలేంద్ర — సంగీతం: సలిల్ చౌధురి

సుహానా సఫర్ ఔర్ యే మౌసమ్ హసీఁ
హమేఁ డర్ హై హమ్ ఖో న జాయేఁ కహీఁ
యే కౌన్ హఁస్‌తా హై ఫూలోం మేఁ ఛుప్‌కర్
బహార్ బేచైన్ హై కిస్‌కీ ధున్‌పర్
కహీఁ గున్‌గున్ కహీఁ రుమ్‌ఝుమ్
కి జైసే నాచే జమీఁ ॥సుహానా॥
యే గోరీ నదియోంకా చల్‌నా ఉఛల్‌కర్
కి జైసే అల్హడ్ చలే పీసే మిల్‌కర్
ప్యారే ప్యారే యే నజారే హర్ కహీఁ, ॥సుహానా॥
వో ఆస్‌మాఁ ఝుక్ రహాహై జమీఁ పర్
యే మిలన్ హమ్‌నే దేఖా యహీఁపర్
మేరీ దునియా మేరే సప్‌నే మిలేంగే శాయద్‌యహీఁ ॥సుహానా॥

### చిత్రం: ఆవారా

గీతం: శైలేంద్ర — సంగీతం: శంకర్‌జైకిషన్

ఆవారా హూఁ ఆవారా హూఁ
యా గర్‌దిశ్ మేఁ హూఁ ఆస్‌మాన్ కా తారా హూఁ
॥ఆవారా హూఁ॥
ఘర్‌బార్ నహీఁ సంసార్ నహీఁ ముఝ్‌సే కిసీకో ప్యార్ నహీఁ
ఉస్‌పార్ కిసీకో మిల్‌నేకా ఇక్‌రార్ నహీఁ
ముఝ్‌సే కిసీకో ప్యార్ నహీఁ
అన్‌జాన్ డగర్ సున్‌సాన్ డగర్‌కా ప్యారా హూఁ॥ఆవారా హూఁ॥
ఆబాద్ సహీ బర్‌బాద్ సహీ గాతా హూఁ ఖుశీకే గీత్ మగర్
జఖ్మోంసే భరా సీనాహై మెరా హఁస్‌తీ హై మెరీ యే మస్త్ నజర్
దునియా, దునియా మైఁ తేరే తీర్ కా
యా తక్‌దీర్ కా మారా హూఁ ॥ఆవారా హూఁ॥

### చిత్రం: సంబంధ్

రచన: ప్రదీప్ — సంగీతం: ఒ.పి.నయ్యర్

చల్ అకేలా చల్ అకేలా చల్ అకేలా
తేరామేలా పీఛే ఛూటా రాహీ, చల్ అకేలా
హజారోఁ మీల్ లంబే రాస్‌తే తుఝ్‌కో బులాతే
యహాఁ దుఖ్‌డే సహనే కే వాస్‌తే తుఝ్‌కో బులాతే
హై కౌన్‌సా వో ఇన్సాన్ యహాఁ పే జిస్‌నే దుఃఖ్ నా ఝేలా
॥చల్ అకేలా॥
తేరా కోయీ సాథ్ న దే తో తూ ఖుద్ సే ప్రీత్ జోడ్‌లే
బిఛౌనా ధర్తీ కో కర్‌కే అరే ఆకాశ్ ఓఢ్‌లే
పూరా ఖేల్ అభీ జీవన్ కా తూనే కహాఁ హై ఖేలా ॥చల్ అకేలా॥

### చిత్రం: మేరానామ్ జోకర్

రచన: హస్రత్‌జైపురి — సంగీతం: శంకర్ -జైకిషన్

జానే కహాఁ గయే వో దిన్
కహతే థే తేరీ రాహోం మేఁ నజరోంకో హమ్ బిఛాయేంగే
చాహే కహీఁ భీ తుమ్ రహో చాహేంగే తుమ్‌కో ఉమ్ర్ భర్
తుమ్‌కో నా భూల్ పాయేంగే ॥జానే కహాఁ॥
మేరే కదమ్ జహాఁ పడే సజ్‌దే కియే థే యార్ నే (2)
ముఝ్‌కో రులా రులాదియా జాతీ హుయీ బహార్ నే
॥జానే కహాఁ॥
అప్నీ నజర్ మేఁ ఆజ్ కల్ దిన్ భీ అంధేరీ రాత్ హై (2)
సాయా హీ అప్నే సాథ్‌థా, సాయా హీ అప్నే సాథ్‌హై॥జానే కహాఁ॥

### చిత్రం:హమ్ హిందుస్తానీ

సంగీతం: ఉషాఖన్నా — గీతం: ప్రేమ్‌ధవన్

ఛోడో కల్‌కీ బాతేఁ, కల్‌కీ బాత్ పురానీ
నయే దౌర్ మేఁ లిఖేంగే మిల్‌కర్ నయీ కహానీ
హమ్ హిందూస్తానీ - హమ్ హిందూస్తానీ
ఆజ్ పురానీ జంజీరోం కో తోడ్ చుకే హైఁ
క్యా దేఖే ఉస్ మంజిల్ కో, జో ఛోడ్ చుకే హైఁ
చాంద్ కే దర్ పే జా పహుఁచా హై ఆజ్ జమానా....
నయే జగత్‌సే హమ్ భీ నాతా జోడ్ చుకే హైఁ
నయా ఖూన్ హై, నయీ ఉమంగేఁ
అబ్ హై నయీ జవానీ హమ్ హిందుస్తానీ
కహీఁ న కహీఁ మైఁ థామ్‌లూంగా
అంచల్ తుమ్హారా మాఝీ నైయా
జైసే సీతా రామ్ మిలే, జైసే రాధా శ్యామ్ మిలే
కభీ న కభీతో మిలన్ హోగా తుమ్‌సే హమారా మాఝీ నైయా
కిత్‌నే తాజ్‌మహల్ హైఁ హమ్‌కో ఔర్ సజానే
కిత్‌నే హీ అజంతా హమ్‌కో ఔర్ బనానే
అభీ పలట్‌నా హై రుఖ్ కిత్‌నే దరియావోం కా
కిత్‌నే పర్వత్ రాహోం సే ఆజ్ హటానే ॥నయా॥
ఆవో మెహనత్ కో అప్‌నా ఈమాన్ బనాయేఁ
అప్‌నే హాథోం కో అప్‌నా భగవాన్ బనాయేఁ
రామ్‌కీ ఇస్ ధర్‌తీకో, గౌతమ్‌కీ భూమీకో...
సప్‌నోం సే భీ ప్యారా హిందుస్తాన్ బనాయేఁ ॥నయా॥

### చిత్రం:సంగమ్

రచన:శైలేంద్ర — సంగీతం:శంకర్ జైకిషన్

దోస్త్ దోస్త్ నా రహా, ప్యార్ ప్యార్ నా రహా
జిందగీ హమేఁ తేరా ఐత్‌బార్ నా రహా,
ఐత్‌బార్ నా రహా ॥దోస్త్‌దోస్త్॥
అమానతేఁ మైఁ ప్యార్‌కీ గయా థా జిస్‌కో సౌంప్‌కర్
వో మేరే దోస్త్ తుమ్ హీ థే, తుమ్ హీ తో థే
జో జిందగీ కీ రాహ్ మేఁ బనే థే మేరే హమ్‌సఫర్
వో మేరే దోస్త్ తుమ్ హీ థే, తుమ్ హీ తో థే
సారే భేద్ ఖుల్‌గయే,
రాజ్‌దార్ నా రహా ॥జిందగీ హమేఁ!! ॥దోస్త్‌దోస్త్॥
గలే లగీ సహమ్ సహమ్, భరే గలే సే బోల్‌తీ
వో తుమ్ న థీ తో కౌన్ థా తుమ్ హీ తో థీ
సఫర్ కే వక్త్ మేఁ పలక్‌పే మోతియోఁ కో తౌల్‌తీ
వో తుమ్ న థీ తో కౌన్ థా, తుమ్ హీ తో థీ
నషే కీ రాత్ ఢల్ గయీ,
అబ్ ఖుమార్ నా రహా ॥జిందగీ హమేఁ॥ ॥దోస్త్‌దోస్త్॥

### చిత్రం: జాగ్తేరహో

సంగీతం: సలిల్ చౌధురి — గీతం: శైలేంద్ర

జిందగీ ఖ్వాబ్ హై ఖ్వాబ్ మేఁ ఝూట్ క్యా
ఔర్ భలా సచ్ హై క్యా.... సబ్ సచ్ హై
దిల్ నే హమ్‌సే జో కహా, హమ్‌నే వైసా హీ కియా
ఫిర్ కభీ పుర్‌సత్ మేఁ సోచేంగే,
బురా థా యా భలా ॥జిందగీ॥
ఏక్ కత్‌రా మయ్ కా జబ్, పత్థర్ కే హోఠోం పర్ పడా
ఉస్‌కే సీనే మేఁ భీ దిల్ ధడ్‌కా,
యే ఉస్‌నే భీ కహా... క్యా ॥జిందగీ॥

## చిత్రం: శ్రీ420

రచన: శైలేంద్ర సంగీతం: శంకర్ జైకిషన్

మేరా జూతా హై జాపానీ యే పత్‌లూన్ ఇంగ్లిస్తానీ
సర్ పే లాల్ టోపీ రూసీ ఫిర్ భీ దిల్ హై హిందుస్తానీ
॥మేరాజూతా॥
నికల్ పడే హైం ఖులీ సడక్ పర్ అప్‌నా సీనా తానే
మంజిల్ కహాం కహాం రుక్‌నా హై ఊపర్‌వాలా జానే
బఢ్‌తే జాయే హమ్ సైలానీ, జైసే ఇక్ దరియా తూఫానీ॥సర్ పే॥
ఊపర్ నీచే, నీచే ఊపర్ లహర్ చలే జీవన్‌కీ
నాదాం హై జో బైఠ్ కినారే, పూఛే రాహ్ వతన్ కీ
చల్‌నా జీవన్ కీ కహానీ, రుక్‌నా మౌత్‌కీ నిశానీ ॥సర్ పే॥
హోంగే రాజే రాజ్‌కుంవర్ హమ్, బిగడే దిల్ శహజాదే
హమ్ సింహాసన్ పర్ జా బైఠే, జబ్‌జబ్ కరేం ఇరాదే
సూరత్ హై జానీ పహ్‌చానీ దునియా వాలోంకో హైరానీ ॥సర్‌పే॥

## చిత్రం: సంత్ జ్ఞానేశ్వర్

సంగీతం: లక్ష్మీకాంత్ ప్యారేలాల్ గీతం: భరత్‌వ్యాస్

జ్యోత్‌సే జ్యోత్ జగాతే చలో ప్రేమ్‌కీ గంగా బహాతే చలో
రాహ్ మేం ఆయే జో దీన్ దుఖీ, సబ్‌కో గలేసే లగాతే చలో
జిస్‌కా న కోయీ సంగీ సాథీ ఈశ్వర్ రఖ్‌వాలా
జో నిర్ధన్ హై జో నిర్బల్ హై వో హై ప్రభూ కా ప్యారా
ప్యార్ కే మోతీ లుటాతే చలో ॥ప్రేమ్‌కీ....॥
ఆశా టూటీ మమ్‌తా రూఠీ ఛూట్‌గయా హై కినారా
బంద్ కరో మత్ ద్వార్ దయా కా దేదో కుఛ్‌తో సహారా
దీప్ దయాకా జలాతే చలో, ॥ప్రేమ్‌కీ..॥
ఛాయా హై చహూం ఓర్ అంధేరా భటక్ గయీ హై దిశాయేం
మానవ్ బన్ బైఠా హై దానవ్ కిస్‌కో వ్యథా సునాయే
ధర్‌తీ కో స్వర్గ్ బనాతే చలో ॥ప్రేమ్‌కీ...॥

## చిత్రం: ఆనంద్

రచన: యోగేశ్ సంగీతం: సలిల్ చౌధురి

కహీం దూర్ జబ్ దిన్ ఢల్ జాయే
సాంఝ్ కీ దుల్హన్ బదన్ చురాయే, చుప్‌కే సే ఆయే
మేరే ఖయాలోంకే ఆంగన్ మేం కోయీ
సప్నోంకే దీప్ జలాయే దీప్ జలాయే ॥కహీందూర్॥
కభీ యూం హీ జబ్ హుయీ బోఝల్ సాంసేం
భర్ ఆయీ బైఠే బైఠే జబ్ యూంహీ ఆంఖేం
తభీ మచల్‌కే, ప్యార్ సే చల్‌కే
ఛుయే కోయీ ముఝే పర్ నజర్ న ఆయే,
నజర్ న ఆయే ॥కహీందూర్॥
కహీం తో యే దిల్ కభీ మిల్ నహీం పాతే
కహీం సే నికల్ ఆయే జన్మోంకే నాతే
ఘనీ థీ ఉల్‌ఝున్, బైరీ అప్నా మన్
అప్నా హీ హోకే సహే దర్ద్ పరాయే, దర్ద్ పరాయే ॥కహీం దూర్॥
దిల్ జానే మేరే సారే భేద్ యే గహరే
హో గయే కైసే మేరే సప్నే సునహరే
యే మేరే సప్నే యహీ తో హైం అప్నే
ముఝ్‌సే జుదా న హోంగే ఇన్‌కే యే సాయే,
ఇన్‌కే యే సాయే ॥కహీం దూర్॥

## చిత్రం: రాణీరూప్‌మతీ

గీతం: భరత్‌వ్యాస్ సంగీతం: ఎస్.ఎన్.త్రిపాఠీ

ఆ లౌట్ కే ఆజా మేరే మీత్, తుఝే మేరే గీత్ బులాతే హైం
మేరా సూనా పడారే సంగీత్,
తుఝే మేరే గీత్ బులాతే హైం ॥ఆ లౌట్‌కే॥
బర్‌సే గగన్ మేరే బర్‌సే నయన్ దేఖో
తర్‌సే హై మన్ అబ్‌తో ఆజా
శీతల్ పవన్ యే లగాయే అగన్ హో
సజన్ అబ్‌తో ముఖ్‌డా దిఖా జా
తూనే భలీ రే నిభాయీ ప్రీత్ తుఝే మేరే గీత్ బులాతే హైం
॥ఆలౌట్‌కే॥
ఇక్ పల్ హై హస్‌నా ఇక్ పల్ హై రోనా, కైసా హై జీవన్‌కా ఖేలా
ఇక్ పల్ హై మిల్‌నా ఇక్ పల్ హై బిఛడ్‌నా
దునియా హై దో దిన్ కా మేలా
యే ఘడీ నా జాయే బీత్,
తుఝే మేరే గీత్ బులాతే హైం ॥ఆలౌట్ కే॥

## చిత్రం: పహ్‌లీ నజర్

గీతం: డా॥ సఫ్‌దర్ 'ఆహ్' సంగీతం: అనిల్ బిశ్వాస్

దిల్ జల్‌తా హై తో జల్‌నే దే ఆంసూ న బహా ఫరియాద్ న కర్
తూ పర్‌దా నశీం కా ఆశిక్ హై
యూం నామే వఫా బర్‌బాద్ న కర్
మాసూమ్ నజర్ కే తీర్ చలా బిస్మిల్ కో బిస్మిల్ ఔర్ బనా
అబ్ శర్మోహయా కే పర్దే మేం యూం ఛుప్‌ఛుప్‌కే బేదాద్ న కర్
హమ్ ఆస్ లగాయే బైఠే హైం తుమ్ వాదా కర్‌కే భూల్ గయే
యా ఆకే దిఖా జావో సూరత్
యా కహ్ దో హమ్‌కో యాద్ న కర్

## చిత్రం: కభీ - కభీ

రచన: సాహిర్ లుధియాన్వి సంగీతం: ఖయ్యాం

కభీ - కభీ మేరే దిల్ మేం ఖయాల్ ఆతాహై
కభీ - కభీ మేరే దిల్ మేం ఖయాల్ ఆతాహై
కి జైసే తుమ్‌కో బనాయా గయా హై మేరే లియే
తు అబ్ సే పహ్‌లే సితారోం మేం బస్ రహీ థీ కహీం
తుఝే జమీం పర్ బులాయా గయా హై మేరే లియే
కభీ-కభీ మేరే దిల్ మేం ఖయాల్ ఆతాహై
కి యే బదన్ ఔర్ నిగాహేం మేరీ అమానత్ హై
యే గేసుఓం కీ ఘనీ ఛావ్ హై మేరీ ఖాతిర్
యే హోంఠ్ యే బాహేం మేరీ అమానత్ హై
కభీ-కభీ మేరే దిల్ మేం ఖయాల్ ఆతాహై
కి జైసే బజతీహైం షహనాయియాం సీ రాహోం మేం
సుహాగ్ రాత్ హై, ఘుంఘట్ ఉఠా రహా హూం మైం
సిమట్ రహీహై, తు శరమాకే, అప్‌నీ బాహోం మే
కభీ - కభీ మేరే దిల్ మేం ఖయాల్ ఆతాహై
కి జైసే తూ ముఝే చాహేగీ, ఉమ్ర్ భర్ యూం హీ
ఉఠేగీ మేరీ తరఫ్ ప్యార్ కీ నజర్ యూం హీ
మైం జాన్‌తా హూం, కి తూ గైర్ హై మగర్, యూం హీ
కభీ-కభీ మేరే దిల్ మేం ఖయాల్ ఆతాహై

# కమనీయ సినీ గీతాలకు ప్రాణం పోసిన కళ్యాణ్‌జీ



**హిందీ చిత్రరంగంలోని జంట సంగీత దర్శకుల మ్యూజిక్‌లో ఒక సరికొత్త ట్రెండ్‌ను నెలకొల్పినవారు కళ్యాణ్‌జీ. తన సోదరుడు ఆనంద్‌జీ తో కలిసి ఆయన కూర్చిన పాటలు నేటికీ కర్ణ పేయమైనవే. హుస్నలాల్-భగత్ రామ్‌తో మొదలైన జంట సంగీత దర్శకుల స్వరయాత్రలో శంకర్-జైకిషన్‌ల తరువాత స్థానం కళ్యాణ్‌జీ- ఆనంద్‌జీలదే.**

హిందీ చిత్ర సీమలో 50దశకాన్ని నౌషాద్, నయ్యర్, సలిల్ చౌధురి, యస్.డి.బర్మన్, శంకర్-జైకిషన్‌లు తలోవైపు ఏలుతున్న కాలమది. అలాంటి సమయంలో కళ్యాణ్‌జీ సినీరంగ ప్రవేశం చేశారు. కళ్యాణ్‌జీ వీర్‌షా-ఆనంద్‌జీ వీర్‌షా లిరువురు చిన్ననాట బడికి వెళ్లడం కన్నా హాయిగా ఎక్కడైనాకూర్చుని పాటలు పాడుకోవడానికే ఇష్టపడేవారు. కొడుకులిద్దరూ తనకు వ్యాపారంలో తోడవుతారని తండ్రి, కలెక్టర్లవుతారని తల్లి - తలోవైపు ఆశిస్తే వీరేమో తండ్రి ఇచ్చిన పాకెట్ మనీని దాచుకుని ఓపాత డ్రమ్‌సెట్ కొనుక్కున్నారు. ఇలా ఆరేళ్ల వయసు నుండే సంగీతం పై ప్రేమ పెంచుకున్న కళ్యాణ్‌జీని ఆ అభిరుచి సినీరంగానికి లాక్కువచ్చింది. 1952లో హేమంత్ కుమార్ వద్ద సహాయకుడిగా చేరాడాయన. హేమంత్‌కుమార్ సంగీత దర్శకత్వంలో 1952లోనే విడుదలైన "నాగిన్" చిత్రంలో వైజయంతీమాలపై చిత్రీకరించిన "మన్‌డోలే మేరా తన్‌డోలే" పాటకు 'బీన్' వాయించినది ఆయన వద్ద అసిస్టెంట్ గా పనిచేస్తున్న కళ్యాణ్‌జీనే. నేటికీ స్నేక్ సిచ్యుయేషన్ సాంగ్స్ ఏ పిక్చర్‌లో ఉన్నా నాగిన్‌లోని కళ్యాణ్‌జీ కూర్చిన మ్యూజిక్ నే ఆధారంగా తీసుకుంటారు. హేమంత్‌కుమార్ వద్ద రెండేళ్లు పనిచేసిన తరువాత స్వతంత్రంగా సంగీత దర్శకత్వం నెరిపేందుకు సిద్ధమైన కళ్యాణ్‌జీ 1954 లో మొదటి సారిగా "సమ్రాట్ చంద్రగుప్త" చిత్రానికి స్వరాలు కూర్చారు. ఈ చిత్రంలో లత-రఫీలు పాడిన "చాహెపాస్‌హో చాహే దూర్ హో"' హిట్ గీతంగా ఎంచదగినది. ఆ తరువాత "పోస్ట్ బాక్స్999" లోని హేమంత్‌కుమార్-లత పాడిన "ఓ నీంద్ న ముఝుకో ఆయే" పాట కూడా పాపులరైంది.



ఆనంద్‌జీ

ఆ తరువాత మరో అయిదారు చిత్రాలకు ఒంటరిగా సంగీతం చేసిన కళ్యాణ్‌జీ 1956 లో తనతో తమ్ముడు ఆనంద్‌జీ ని కలుపుకున్నారు. అది మొదలు కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ ద్వయం తమ సంగీత జైత్రయాత్ర ప్రారంభించి బాలీవుడ్‌ను ఏలారు.

కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీల సంగీతాన్ని ఉన్నత స్థానంలో నిలబెట్టిన చిత్రాలు "జబ్ జబ్ ఫూల్‌ఖిలే" (1965) ఆ తరువాత వీరు మళ్లీ వెనక్కి తిరిగి చూసుకోలేదు. వీరిరువురిది విలక్షణబాణి. 1960 దశకంలో హేమాహేమీలైన సంగీత దర్శకుల మధ్య తమదంటూ ఒక ప్రత్యేక ముద్రతోఈ సోదర ద్వయం ఆకట్టుకున్నారు.

1970లో విజయ్ ఆనంద్ తీసిన 'జానీమేరానామ్' లో వీరి సంగీతం హిమాలయ శృంగాన్ని అందుకున్నది. ఈ చిత్రంలో కిశోర్‌పాడిన "నఫ్రత్ కర్‌నే వాలోంకే సీనే మె ప్యార్‌భర్‌దూం" పాటకి లత పాడిన "ఓ బాబుల్ ప్యారే" పాటకి లభించిన ప్రశంసలు అనేకం.

కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలకు మరింత ఖ్యాతి తెచ్చిన "సరస్వతీ చంద్ర"లో లతా చేపాడించిన "ఛోడ్ దే సారీ దునియా కిసీకేలియే'' ఆమె బెస్ట్‌సాంగ్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది. ఇదే చిత్రంలో ఇందీవర్ రాయగా యమన్ రాగంలో లతముఖేశ్‌లతో పాడించిన "చందన్ స బదన్ చంచల్ చిత్‌వన్"పాట నేటికీ ఎందరికో మరుపురాని అభిమాన గీతం.

లతామంగేష్కర్, కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీల సంగీతంలో ఎక్కువగా పాడేందుకు ఉత్సాహంచూపినా వీరు ఆమెను తగినంతగా వినియోగించుకోలేకపోయారని బాలీవుడ్‌లో ఓ అభిప్రాయం నెలకొని ఉండేది. అయినప్పటికీ వీరి సంగీతంలో ఆమె పాడిన "యే సమా..."(జబ్ జబ్ ఫూల్ ఖిలే), మైతో ఛోడ్ చలీ బాబుల్ కా దేశ్(సరస్వతీ చంద్ర), వాదాకర్‌లే సాజ్‌నా(హాథ్‌కీ సఫాయి), దిన్‌బదిన్ హోమేరే దిల్‌సే(తృష్ణ), హమ్‌థే జిన్‌కే సహారే (సఫర్ )వంటి 300 పాటలున్నాయి.

ఇంకా కళ్యాణ్-ఆనంద్‌జీల సంగీతంలో ముఖేశ్ "మేరేటూటే హుయేదిల్‌సే''(రాజ్‌కపూర్ పై

''ఛలియా''లో), 'చాంద్‌సి మెహబూబా హో' (మనోజ్‌కుమార్ పై"హిమాలయ్ కీ గోద్‌మే"లో) 'తుమ్హే జిందగీకి ఉజాలే ముబారక్' (ధర్మేంద్ర పై "పూర్ణిమ''లో), "కోయిజబ్ తుమ్హారా హృదయ్ తోడ్‌దే"(మనోజ్‌కుమార్‌పై "పూరబ్ ఔర్ పశ్చిమ్"లో) వంటి మరుపురాని పాటలు పాడారు.



కిశోర్‌కుమార్‌తో రొమాంటిక్ సాంగ్స్ పాడించిన కళ్యాణ్‌జీ ద్వయం అతని కెరీర్‌లో మైలురాళ్లనదగిన గీతాలు పాడించారు. అలాంటి వాటిలో ఒకటి"నఫ్రత్ కర్‌నేవాలోం" అమితాబ్‌తో డాన్‌లో పాడించిన "ఓ కైకే పాన్ బనారస్‌వాలా" పాటకు ఉత్తమ గాయకునిగా కిశోర్ జాతీయ అవార్డు అందుకున్నారు. "రోతే రోతే ఆతే హై సబ్ హస్‌తా హువాతో జాయేగా" (ముకద్దర్‌కా సికిందర్), జిస్‌కా ముఝె థాఇంతి జార్ (డాన్) మైప్యాసాతుమ్ సావన్(ఫరార్) వంటి లతాతో కిషోర్ పాటలు నేటికీ హిట్ సాంగ్సే.

పోతే అమితాబ్ కెరీర్‌కు కళ్యాణ్‌జీ సంగీతమే ఆలంబనగా నిలిచింది. వ్యక్తిగతంగా కూడా అమితాబ్ కు ఎన్నో అవకాశాలను వీరే కల్పించారు. ప్రకాష్‌మెహ్రా "జంజీర్" లో హీరో పాత్ర కోసం అన్వేషిస్తుంటే కళ్యాణ్‌జీనే అమితాబ్‌ను ప్రపోజ్‌చేశారు. ఈ చిత్రంలో "యారీ హై ఈమాన్‌మేరా యార్ మేరీ జిందగీ" పాటకున్న పాపులారిటీ నేటికీ తగ్గలేదు. అమితాబ్‌తో కలిసి వేయికి పైగా స్టేజీ ప్రదర్శనలిచ్చారు కళ్యాణ్‌జీ.

ఈ నేపథ్యంలో కళ్యాణ్‌జీ, ఆనంద్‌జీ - ఫరార్, అపరాధ్, బైరాగ్, మర్యాదా, త్రిదేవ్, హసీనామాన్ జాయేగి(పాతది), హాత్‌కీ సఫాయీ, బ్లఫ్ మాస్టర్, నన్హాఫరిస్తా, దిల్‌భీతేరా హమ్‌భీ తేరే, దుల్హాదుల్హన్, రాణీరూప్‌మతి, ఛలియా, ఖుర్బానీ, ఉప్‌కార్, సచ్చాఝూటా, ముకద్దర్ కా సికిందర్, మహల్, వంటి ఇరవై దాకా చిత్రాలకు సంగీతం అందించారు. ఐతే "నా కెరీర్‌లో హిమాలయ్ కీగోద్‌మే, గీత్, సఫర్, కోరాకాగజ్ చిత్రాలు మైలురాళ్లుగా చెప్పుకోదగినవి" అని కళ్యాణ్‌జీనే స్వయంగా చెప్పుకున్నారు ఓ సందర్భంలో.

ఇంకా కళ్యాణ్‌జీ ఆనంద్‌జీల సంగీతంలో రూపొందిన పాటల్లో ఎంచదగినవాటిలో "హమారే సివాతుమ్హారే ఔర్‌కిత్‌నే దివానే హై(అపరాధ్) పీతేపీతే కభీ కభీ య్యూం, సారే షహర్‌మే ఆప్‌సా కోయీ నహీ, సునోరే సునో ఏక్‌బాత్ బతావూం (బైరాగ్), బేఖుదీ యేసనమ్ ఉఠ్‌గయే జో కదమ్ (హసీనా మాన్ జాయేగీ), హుస్న్ చలాకుఛ్ ఐసీ చాల్ (బ్లఫ్‌మాస్టర్), ఫూల్‌తుమ్హే భేజా ఖత్‌మే(సరస్వతీ చంద్ర), తెరె హోటోంకె దోఫూల్ ప్యారేప్యారే (పారస్) వంటివి కొన్ని మాత్రమే.

కళ్యాణ్‌జీ ఆనంద్‌జీలు తమ సుమారు 50ఏళ్ల కెరీర్‌లో సినీ సంగీతంలో అత్యున్నత శిఖరాలను అందుకున్నారు. 1968లో "సరస్వతీ చంద్ర" చిత్రానికి ఉత్తమ సంగీత దర్శకులుగా జాతీయ అవార్డు, "కోరా కాగజ్" చిత్రానికి ఫిలింఫేర్ అవార్డు అందుకున్నారు. మరోవైపు కొత్త టాలెంట్‌ను ఎంకరేజ్ చేయడంలో ఎప్పుడూ ముందుండే వీరు సాధనా సర్గమ్, అనూరాధ పోడ్వాల్, సోనాలీవాజ్‌పేయీ, ఆదిత్య నారాయణ్, జానీ లివర్, అల్కాయాగ్నిక్‌లను పరిచయం చేశారు.

అంతెందుకు లక్ష్మీకాంత్ ప్యారే లాల్ ద్వయం కూడా కళ్యాణ్‌జీ ఆనంద్‌జీల శిష్యులే. శిష్యులు సుభాష్‌ఘాయ్ "క్రోధ్" చిత్రానికి సంగీతం అందిస్తున్నపుడు నేపథ్యసంగీతాన్ని కళ్యాణ్ ద్వయం కూర్చారు. హిందీ సినిమా సంగీతానికి సరికొత్త సొబగులద్దిన కళ్యాణ్‌జీ తన 74వ ఏట ఆగస్టు24న సోదరుడు ఆనంద్‌జీని ఒంటరివాడ్ని చేసి తన సినీ సంగీతయానాన్ని ముగించారు. కళ్యాణ్‌జీ మనమధ్య లేకపోయినా ఏ రేడియో స్టేషన్‌లోనో, ప్రైవేటు ఛానెల్‌లోనో "ఆజాతురఝుకో పుకారే మేరే గీత్‌రే మేరేగీత్‌రే" వంటి పాటలు విన్నపుడు మనకు మదిలో మెదులుతూనే ఉంటారు.

**-వి.మాలతి**

---

ఆగస్టు 16 మడోనా జన్మదినం సందర్భంగా...

# ది మెటీరియల్ గర్ల్



పాప్ గాయనీమణుల్లో అందరి కంటే ఎక్కువగా కీర్తిని ధనాన్ని సంపాదించుకున్న దెవరంటే మడోనా పేరే చెప్తారందరూ. ఈ నాడు పాప్ రంగాన్ని ఏలుతున్న ఫిమేల్ సింగర్స్ అందరూ కూడా మడోనా అభిమానులే! గాయనిగా కీర్తితో బాటు వ్యక్తిగా ఎంతో అపకీర్తి మూట కట్టుకుంది. ఆమె తెలివితేటలను (ఐక్యూ 140 ట!), ప్రతిభనూ గమనిస్తే కావాలనే కొన్ని వివాదాలను సృష్టించి ఎప్పుడూ వార్తలలో ఉండేట్లా చూసుకుందని పిస్తుంది. అందుకే ఈ ఆగస్టు 16కు 43 ఏళ్లు నిండుతున్నా మడోనా ఎవరూ విస్మరింపలేని స్టార్‌గా నిలవగలిగింది.

అమెరికాలోని మిషిగన్‌లో పుట్టిన ఈ సుందరి పూర్తి పేరు మడోనా లూసీ సికోన్ (Madonna Louise Ciccone) ముద్దుపేర్లు బోల్డు ఉన్నాయి. -నానీ, మేడీ, మో, ది మెటీరియల్ గర్ల్, మేడ్జీ. ఆమె తల్లిదండ్రులకు ఏడుగురు పిల్లలు. మడోనా చిన్నప్పుడే ఆమె తల్లి క్యాన్సర్‌తో మరణించింది. చదువు సంధ్యలలో చురుకుగా వుండే మడోనా హైస్కూలులో ఉండగానే డాన్సు నేర్చుకోవడానికి స్కాలర్‌షిప్ గెలుచుకుంది. మిషిగన్ యూనివర్శిటీలో డాన్సు నేర్చుకున్నాక 1970లలో న్యూయార్క్‌కు తరలి వెళ్లింది. అక్కడ రాక్ బ్యాండ్స్‌లో ఆడి, పాడేది, అండర్ గ్రౌండ్ మూవీస్‌లో నటించింది.

ఆమె పాటల్లో ప్రసిద్ధికెక్కినవి - మెటీరియల్ గర్ల్, ఫీవర్, వర్జిన్, ఫ్రోజెన్, రే ఆఫ్ లైట్, రెయిన్, మ్యూజిక్ పవర్ ఆఫ్ గుడ్‌బై.

పాటలు స్వయంగా రాయగలిగిన మడోనా అతి త్వరలోనే పాప్యులర్ అయింది. అశ్లీలతను బాహాటంగా మార్కెట్ చేసుకుంటూ ఆమె యువత క్రేజ్ సంపాదించుకుంది. స్వేచ్ఛగా జీవిస్తూ, ఒకరకమైన ఫెమినిజానికి ప్రతీకగా కూడా నిల్చేట్లు తన ఇమేజ్‌ను మలుచుకుంది. కానీ ఆమె జీవితమంతా ప్రియుల వేటలోనే గడిచింది అంటాడు ఆమె జీవితాన్ని ఇటీవలే గ్రంథస్తం చేసిన ఆండ్రూ మార్టిన్.ఎవరు మెచ్చినా, ఎవరు నొచ్చుకున్నా ఆమె ఈ నాటి పాప్‌కు మకుటం లేని మహారాణి అయింది.

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

## చిత్రం: జబ్ జబ్ ఫూల్ ఖిలే

గీతం: ఆనంద్ బక్షీ గానం: రఫీ, లతా

పర్‌దేసియోం సే న అఖియా మిలానా
పర్‌దేసియోం కో హై ఇక్ దిన్ జానా
నా యే బాదల్ నా యే తారే
యే కాగజ్ కే ఫూల్ హైఁ సారే
ఇన్ ఫూలోం కే న బాగ్ లగానా ॥పర్‌దేసియోం॥
బాగోం మేఁ జబ్-జబ్ ఫూల్ ఖిలేంగే
తబ్-తబ్ యే హర్‌జాయీ మిలేంగే
గుజరేగా కైసే పత్‌ఝుడ్ కా జమానా ॥పర్‌దేసియోం॥
హమ్‌నే యహీ ఇక్ బార్ కియా థా
ఇక్ పర్‌దేసీ సే ప్యార్ కియా థా
ఐసే జలే దిల్ యే జైసే పర్‌వానా ॥పర్‌దేసియోం॥

## చిత్రం: సరస్వతీ చంద్ర

గీతం: ఇందీవర్ గానం: ముకేష్, లతా

చందన్‌సా బదన్ చంచల్ చిత్‌వన్ ధీరేసే తేరా యే ముస్‌కానా
ముఝే దోష్ న దేనా జగ్ వాలోం హో జావూఁ అగర్ మైఁ దీవానా
యే కామ్ కమాన్ భవ్‌రే తేరీ పల్‌కోం కే కినారే, కజ్‌రారే
మాథే పే సిందూరీ సూరజ్ ఔర్ హోంఠోం పే దహ్‌కతే అంగారే
సాయా భీ జో తేరా పడ్ జాయే
అబాద్ హో దిల్ కా వీరానా ॥ముఝే దోష్ న దేనా॥
తన్ భీ సుందర్ మన్ భీ సుందర్ తూ
సుందర్‌తా కీ మూరత్ హై
కిసీ ఔర్ కో శాయద్ కమ్ హోగీ ముఝే తేరీ బహుత్ జరూరత్‌హై
పహ్‌లే భీ బహుత్ మైఁ తరసా హూఁ
తూ ఔర్ న ముఝ్‌కో తర్‌సానా ॥ముఝే దోష్ న దేనా॥

## చిత్రం: సఫర్

రచన: ఇందీవర్ గానం:కిశోర్‌కుమార్

జీవన్ సే భరీ తేరీ ఆంఖేఁ మజ్‌బూర్ కరే
జీనే కే లియే, జీనే కే లియే
సాగర్ భీ తరస్ తే రహతే హైఁ, తేరే రూప్ కా రస్
పీనే కే లియే, పీనే కే లియే ॥జీవన్ సే భరీ॥
తస్వీర్ బనాయే క్యా కోయీ
క్యా కోయీ లిఖే తుఝ్ పే కవితా
రంగోం ఛందోం మేఁ సమాయేగీ
రంగోం ఛందోం మేఁ సమాయేగీ
కిస్ తరహ్ సే ఇత్‌నీ సుందర్‌తా సుందర్‌తా
ఇక్ ధడ్‌కన్ హై తూ దిల్ కే లియే, ఇక్ జాన్ హై తూ
జీనే కే లియే, జీనే కే లియే ॥జీవన్ సే భరీ॥
మధువన్ కీ సుగంధ్ హై సాఁసోం మేఁ
బాహోం మేఁ కమల్ కీ కోమల్‌తా
కిర్‌నోం కా తేజ్ హై చెహరే పే
కిర్‌నోం కా తేజ్ హై చెహరే పే
హిర్‌నీ సీ హై తుఝ్ మేఁ చంచల్‌తా చంచల్‌తా
ఆంచల్ కా తేరే హై చాక్ బహుత్
కోయీ చాక్-జిగర్ సీనే కే లియే, సీనే కే లియే॥జీవన్ సే భరీ॥

## చిత్రం: డాన్

రచన: అన్‌జాన్ గానం: కిశోర్ కుమార్

హుమ్ - ఘుర్ - ఘుర్ - ఘుర్ -
అరె భంగ్ కా రంగ్ జమా హో చకాచక్
ఫిర్ లో పాన్ చబాయె
అరె ఐసా ఝుటకా లగే జియాపే
పునర్‌జనమ్ హెూయి జాయె
ఓ ఖయ్‌కే పాన్ బనారస్ వాలా -
ఓ ఖయ్‌కే పాన్ బనారస్ వాలా -
ఖులి జాయే బంద్ అకల్‌కా తాలా
ఫిర్ తో అయిసా కరే కమాల్
సీధీ కర్ దే సబ్‌కీ చాల్
ఓ ఛోరా గంగా కినారే వాలా
ఓ ఛోరా గంగా కినారే వాలా
ఓ ఖయ్‌కే పాన్ బనారస్ వాలా -
ఖులి జాయే బంద్ అకల్ కా తాలా
అరె రామ్ దుహాయీ
కైసే చక్కర్ మేఁ పడ్ గయా
హాయ్ - హాయ్ - హాయ్ -
కహాఁ టాంగ్ ఫసాయీ
మైఁ తో సూలీ పే చఢ్ గయా - హాయ్ - హాయ్
కైసా సీధా సాధా
కైసా భోలా భాలా - హాఁ హాఁ
అరె కైసా భోలా - భాలా
మైఁ కైసా సీధా సాధా
జానె కౌన్ ఘడీ మేఁ పడ్ గయా
పఢే లిఖోఁ సే పాలా
మీఠీ ఛురీ సే -
మీఠీ ఛురీ సే హువా హలాల్
ఛోరా గంగా కినారే వాలా
ఓ ఛోరా గంగా కినారే వాలా
ఓ ఖయ్‌కే పాన్ బనారస్ వాలా
ఖులి జాయే బంద్ అకల్ కా తాలా
ఏక్ కన్యాకువారి
హమరి సూరత్ పే మర్ గయీ - హాయ్ -
ఏక్ మీఠీ కటారి
హమరే దిల్ మే ఉతర్ గయీ - హాయ్ - హాయ్
కైసీ గోరి గోరి
వో తీఖీ తీఖీ ఛోరి - వాసీహ్ -వాహ్
అరె కైసీ గోరి గోరి
కర్‌కే జోరాజోరీ
కర్ గయీ హమరే దిల్‌కి చోరి
మిలీ ఛోరి తో
మిలి ఛోరి తో హువా నిహాల్
ఛోరా కైసా గంగా కినారే వాలా
ఓ ఖయ్‌కే పాన్ బనారస్ వాలా
ఖులి జాయే బంద్ అకల్ కా తాలా
మైఁ కైసా సీధా సాధా
ఫిర్‌తో అయిసా కరే కమాల్
సీధీ కర్ దే సబ్‌కీ చాల్
ఓ ఛోరా గంగా కినారే వాలా

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు



**✪ఎస్కేరావ్ - అరకు**

ప్ర॥ టీవీలో పాత తెలుగు సినిమాలు మాత్రమే చూసే విద్యార్థికి ఏదైనా ప్రశ్న వేస్తే?

జ॥ 'అన్నిటికీ సమాధానం ఆ కాలమే చెబుతుంది టీచర్' అంటూ జవాబిస్తాడు.

**✪వి.మంజురాణి - హైద్రాబాద్**

ప్ర॥ వ్యాకరణం తెలిసిన ఓ తిక్కశంకరయ్యకి శ్రీకృష్ణరాయబారం గురించి చెబితే!?

జ॥ శ్రీకృష్ణుడు సంధికి కాకుండా సమాసానికి వెళ్ళి వుంటే ఫలించి ఉండేదనే వాడు.

**✪డి.రామమూర్తి - విజయవాడ**

ప్ర॥ సంపన్నులంటే ఎవరు?

జ॥ ఊడినవి ఊడిపోగా నోట్లో కొన్ని పన్నులు మాత్రమే మిగిలిన వారు.

## డబుల్ రోల్



(1) 'ఈత' కొలను అదిగో కనబడే 'ఈత చెట్టు' కిందే ఉంది.

-సి.హెచ్.రమేష్‌బాబు, ఇంద్రవెల్లి

(2) కుళాయిలోంచి సన్నగా వచ్చే 'ఆ...ధార" మీదే మొత్తం అన్ని పోర్షన్ల వాళ్ళు 'ఆధార' పడాలి.

-డి.రమ్య చోడవరం

(3) ఆ 'దండ' తీసుకుని 'పదండర్రా'.

-బి.శ్రీరామ్, రుద్రారం

## పేరు - రిపేరు



సుబ్బు - నువ్వు నాకు నచ్చావ్ - మనసంతా నువ్వే - ప్రేమించుకుందాం రా

-రఫీ, రాజాం

నువ్వు-నేను - కలసి వుంటే కలదు సుఖం

-మాధవీ సనారా, ఖరగ్‌పూర్, (వెస్ట్ బెంగాల్)

ఆగష్టు 15 - జెండా - పండుగ

- ఎస్.జోత్స్న సురేష్, కర్నూలు



## చిలిపి లిపి



Kit Key = కిటికీ

Dream Time = కలకాలం

- సి.హెచ్. రమేష్‌బాబు, ఇంద్రవెల్లి

100 నం = వందనం

-దేవరం సతీష్‌కుమార్, జగిత్యాల

# ఈ రూటే వేరు



సిక్స్ టీ = ఆరు టీలు

-ఆర్.శ్రీనివాసరావు, విజయవాడ

స్పెషలిస్టు = ఎప్పుడూ ఓ జాబితాను తయారుచేసుకొని ఉంచేవాడు.

- కె.గిరిరావు, కడప

రాకుమారుడు = నీళ్ళు, సోడాలాంటివేవీ కలపకుండా మందుని డైరెక్ట్‌గా తీసుకునే పుత్రరత్నం

-సి.నాగేశ్వరరావు, విజయనగరం

# చిలిపి కవిత



**నీ నూరు - నిన్నునూరు**

నీ కోసం ప్రజలంతా
పడిగాపులు కాస్తున్నారని
పొంగిపోకు
వాళ్ళు ఎదురు చూస్తున్నది
నీ కోసం కాదు
నువ్వు చేసే తప్పుల సంఖ్య
'వంద' పూర్తవటం కోసం

-ఆశ్లేష

# పేరడీ పేరేడ్



ఏమనుకున్నావు నన్నేమనుకున్నావు
భర్తగాడిననుకున్నావా?
లేక చెత్తగాడిదనుకున్నావా? ॥ఏమను॥
వెళ్ళినట్టె వెళ్ళావు
స్వీటు తీసుకొచ్చావు
పారిపోను వీలులేక
తలుపులన్ని వేశావు
భర్తగాడిననుకున్నావా?
చెత్తగాడిదనుకున్నావా? ॥ఏమను॥
నిన్ను నేను తెమ్మన్నానా
తెచ్చి నాకు ఇమ్మన్నానా
తెచ్చి నోట కుక్కేశావు
కుక్కలాగ నిలుచున్నావు
భర్తగాడిననుకున్నావా?
చెత్తగాడిదనుకొన్నావా? ॥ఏమను॥
స్వీటంటేనే బాధంటాను
ఆ టేస్టంటేనే వేస్టంటాను
అది స్వీటే కాదంటాను
ఆ టేస్టే వేస్టంటాను
ఏమనుకున్నావు నన్నేమనుకున్నావు?
భర్త గాడిననుకున్నావా?
చెత్తగాడిదనుకున్నావా?

'బంగారుబాబు' సినిమాలోని
'ఏమనుకున్నావు నన్నేమనుకున్నావు?' పాటకు పేరడీగా

-ఎమ్.శ్రేష్ఠ, హైదరాబాద్



దేశరక్షణం, యువ వీర లక్షణం
అరివీర ఘోర మారణోద్యమోస్తు నిరంతరం
వీర కంకణం, రక్త తిలకితాననం,
అరుణాక్షి ఉజ్వలత్ స్ఫురన్మహాగ్ని క్షణం క్షణం
సుజలం, సుఫలం కలిగిన దేశం
శాంతి, అహింసలు నమ్మిన దేశం
కరకు, కరుణ కలగలపిన దేశమిదే
జననం సహజం, మరణం సహజం.
దేశం కోసం ప్రాణత్యాగం
మన చరిత లిఖితమౌ తొలిపుటలోనే
ఎగిరే జండా నీ స్ఫూర్తి అవ్వాలిరా
దేశమాతను గుండెల్లో కొలువుంచరా
ధైర్యం శరమై వేగాన సంధించరా
శత్రు సేనల గుండెలనే చీల్చేయరా
ప్రవహించే రక్తం వేడెరా
ఆ ఉష్ణత నెన్నడూ ఆర్పకురా
ఆ శత్రువు నెప్పుడు వదలకురా
నీ లక్ష్యం దేశం రా!
జయం, నిశ్చయం - నిశ్చయం, నిశ్చయం
జయం, నిశ్చయం - నీ జయం నిశ్చయం

'జయం' చిత్రంలోని 'అభిమంత్రణం' అనే స్వరఖండికకి స్పందించి

-రామకృష్ణానంద్, నూజివీడు

# సిత్తరాల తోటలో ఉత్తరాలు దొరికాయి...



చాలామంది కాలక్షేపానికి పుస్తకాలు కొని, హడావిడిగా పేజీలు తిరగేసి అక్కడక్కడ కొన్ని వాక్యాలు చదివి 'ఈ మధ్య మంచి మేగజైన్స్ రావట్లే'దని తీర్మానించేస్తుంటారు. అదంతా అసంపూర్ణంగా చదవడం వల్ల కల్గిన అపోహ మాత్రమే. ఏకాగ్రతతో సంపూర్ణంగా చదివితే ఆ దురభిప్రాయం పోతుంది. సంపాదకులు శ్రమపడి సేకరించి సముదాయ పరచిన సాహిత్య పుష్పగుచ్ఛాన్ని హృదయ పూర్వకంగా స్వీకరించాలి.

ప్రచురణ కాని నా మొదటి కథలో లోపం ఎక్కడుందో సహృదయంతో తెలియజెప్పి ఎడిటర్ గారిచ్చిన ప్రోత్సాహంతో వుత్సాహం వురకలు వేసింది. ఆ ప్రవాహంలో యీ కథ కొట్టుకొచ్చింది. ఒడ్డుకు చేర్చాల్సింది మీరు.

- గోళ్ళమూడి పద్మజ
308, పృథ్వి ఎమరాల్డ్,
1-1-520, న్యూ బాకారం,
గాంధినగర్, హైద్రాబాద్

రాజమండ్రిలో... దానవాయిపేటలో ... ఒక అందమైన చిన్న డాబా యింట్లో ... జరుగుతున్న కథలోకి ప్రవేశించేముందు ఫ్లాష్‌బాక్‌లో కెళ్ళి పాత్రల గురించి తెల్సుకుందాం.

ఆడపాత్ర పేరు రాగి.... సారీ.... రాగిణి. ఆమెకు రాగీ అని పిలుస్తే కోపం. పెళ్ళయిన రోజు రాత్రి ఆమె గదిలోకి ప్రవేశించగానే ధభీమని భర్త కాళ్ళమీద పడిపోయి "ఏమండీ ఒక్క కోరిక" అంది. ఏదైనా భయంకరమైన ఫ్లాష్‌బాక్ చెప్తుందేమో అని భయపడి గజగజ వణికిపోయాడతను. కొంపదీసి యితనికి మూర్ఛరోగం కాదుకదా అనుకుంటూ బిక్కమొహం వేసిందామె. ఆ మొహం చూసి మరింత కంగారు పడిపోయి గుండెరాయి చేసుకుంటూ ఎడం చేత్తో గుండె పట్టుకుని, కుడిచేత్తో చొక్కాగుండీని నలిపేస్తూ "హేవిటి చె... హెప్పు?" అన్నాడు. "దయచేసి నన్ను 'రాగీ' అని మాత్రం పిలవకండీ" పాదాలను గట్టిగా పట్టుకుని భోరుమని ఏడ్చేసిందామె. "ఇంతేనా" అనుకుని నలుపుతున్న గుండీని విప్పేసి గుండెలనిండా గాలి పీల్చుకున్నాడతను. పచ్చటి చీరలో, మొగలిరేకుల జడతో, ఒంటినిండా నకిలీ నగలతో బంగారం ముద్దలా కన్పించిందామె అతనికి. "ఛ ఛ.. ఏంటది? రాగీలేదు బోగీలేదు. నిన్ను బంగారం అని పిలుస్తాను సరేనా?" అన్నాడతను. ఆ విధంగా రెండో నామకరణం జరిగిందామెకు.

మగ పాత్ర పేరు బస్సు. అసలు పేరు బసవరాజయితే ఇంట్లో, బళ్ళో, వూళ్ళో అంతా బస్సు అనీ, బస్సురాజు అనీ పిలుస్తారు. ఇతను లెక్చరర్. పెళ్ళయిన కొత్తల్లో రాగిణికి యితను మెట్రో బస్సులాగా, కొన్నాళ్ళయిన తర్వాత ఎక్స్‌ప్రెస్సు బస్సులాగా కన్పించేవాడు. ఈ మధ్య ఎమ్‌సెట్ పిల్లలకి ట్యూషన్స్ చెప్పడం మొదలు పెట్టినప్పటినుంచి, అతని చుట్టూ ఎపుడూ స్టూడెంట్స్ గుంపులు గుంపులుగా మూగి వుండడంతో ఆర్డినరీ బస్సులాగా కన్పిస్తున్నాడు.

ఇంక మిగిలిన చిన్న పాత్రలు రెండూ - ఎంకి, లక్కి. కూతురు పుట్టినపుడామె పుట్టింటి నుంచి "ఏమండీ, పాప గులాబీ మొగ్గలా వుంది రోజా అని పేరు పెట్టుకుని పింకీ అని ముద్దుగా పిల్చుకుందాం'' అని బసవరాజుకి వుత్తరం రాసింది. ఆ లెటర్‌లో 'పి' అక్షరంలో గణితం సరిగా కన్పించక 'ఎంకీ' అని చదువుకున్నాడు. ప్రతి రోజూ ఫోన్ చేసి ఎంకి ఎలా వుంది అనడిగేవాడు అదే ఆ పాప పేరైపోయింది.

బాబు పుట్టినప్పుడు, బారసాలకి చేసిన బట్టల షాపింగ్‌లో 'లక్కీడిప్'లో చిన్న వెండి కప్పు ప్రైజ్ వచ్చింది. పుట్టగానే ప్రైజ్ కొట్టేశాడని వచ్చిన గెస్టులంతా 'లక్కీ లక్కీ' అన్నారు. అదే బాబు పేరై పోయింది.

ఇంక జరుగుతున్న కథలోకి వస్తే, ఒకరోజు, సాయంత్రం నలుగురూ తీరుబడిగా టి.వి. చూస్తూ కూచున్నారు. "చూడు మమ్మీ పాతరేకులు తింటుంటే నేను అనకొండలా వుంటానంటోంది అక్క'' అని పళ్ళలో యిరుక్కున్న పూతరేకుల్ని నాలుకతో తియ్యడానికి అవస్థ పడుతూ, చెప్తున్న లక్కీని చూసి తండ్రీ, కూతురూ విరగబడి నవ్వారు. "పాతరేకులు కాదురా చినకొండా పూతరేకులనాలి'' అంటూ.

బాబూని దగ్గరకు తీసుకుని రాగిణి బసవరాజుతో "ఏంటండీ మీరు? పేరుకి లెక్చరర్. వాడి మాటల్లో తప్పుని సరిదిద్ద కుండా నవ్వుతారేం? ఇప్పుడు సరదాగానే వుంటుంది. వాడికదే అలవాటైతే, పెద్దయ్యాక ఈ ముద్దుమాటలే శుద్ధతప్పుల్లా అన్పించి మనమే



వాడిని కోప్పడతాం...'' అంటూ యింకా ఏదో అనబోయేంతలో ఫోన్ మోగింది.

బసవరాజు లేచి ఫోనెత్తాడు. "ఆ, నేనే.... బస్సునే.... ఇదిగో ఇప్పుడే వస్తున్నా..... అహ, ఆలస్యం చెయ్యను.... బయల్దేరుతున్నా.... నువ్వక్కడే వుండు'' అని ఫోన్ పెట్టేశాడు.



"బంగారూ, నాన్నక్క వచ్చిందట. ఇన్నీసుపేటలో ఎవరిదో పెళ్ళికి... వెళ్ళి తీసుకువస్తా'' అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు. నాన్నక్క బసవరాజు మేనత్త . పేరు సుగుణమ్మ. చిన్నప్పుడామెను నాన్నకు అక్కకదా అని అలా పిలిచేవాడు. అదే అలవాటైపోయింది.

రాగిణి లేచి, అల్లరి పిడుగులిద్దరూ నేలమీద చెల్లాచెదురుగా పడేసిన బొమ్మలన్నీ ఎత్తి బొమ్మల బుట్టలో వేస్తూ అందులో వున్న కాయితం ముక్కలు చూసింది. "ఏంటర్రా అలా కాయితాలు చింపి పోగులు పెట్టారు? కాస్సేపు బైటకి పోయి ఆడుకోండి'' అని కోప్పడి, కాయితం ముక్కలు డస్ట్‌బిన్‌లో పడేయపోతూ యథాలాపంగా ఒక పెద్దముక్క మీదున్న అక్షరాలు చదివింది.

**'రాగిని బంగారం అనుకుంటున్నావు'**

అని వుంది. అది చూడగానే రాగిణి ముఖం తెల్లగా ప్లాస్టిక్‌లా పాలిపోయింది. గబగబా మిగతా ముక్కలన్నీ చదివింది.

**'లక్ష పైనే యిస్తారు'**

**"ఎంకీ లక్కీ రెండు మూడు"**

**"లక్కీ సంగతి వదిలేయ్"**

**"ఎంకీకి విషం పెట్టి చంపే"**

**"కలిపి అమ్మేస్తే"**

**"నీకేం తక్కువ"**

**"తగలెట్టకు"**

**"బస్సుకి దీర్ఘాయుష్షుగా"**

**"మట్టిలో కప్పెట్టి".**

ఏం అర్థం కాక రాగిణి తల పట్టుకుని కూచుండి పోయింది. ఏమిటీ వుత్తరం? ఎవర్రాశారు? ఏం పాలుపోక పిల్లలిద్దర్నీ పిలిచి "మిగతా మూడు ముక్కలు ఏవర్రా?'' అని అరిచింది. 'ఇంకెక్కడున్నాయి, 'మేగీ మేగీ' ఆటలో దో మినిట్‌లో తినేశాగా అవన్నీ'' బొజ్జ రుద్దుకుంటూ చెప్పాడు లక్కీ. రాగిణి పూర్తిగా మతిపోయిన దానిలా కూచుండిపోయింది. ఇంతలో బాబు నోటిలోంచి సగం బయటకు వేళ్ళాడుతూ, సగం నోటిలో నానుతున్న ఒక కాయితం ముక్క మీద

**"నీ నాన్నక్క సుగుణమ్మ"**

అని పెద్దపెద్ద అక్షరాలు కన్పించాయి. ఓహో ఇదంతా యీ నక్కగారిపనా? నాన్నక్కట నాన్నక్క. పేరేమో సుగుణమ్మ అన్నీ నక్కబుద్ధులు అని గొణుక్కుంది. ఏమిటి వీళ్ళిద్దరి గూడుపుఠాణి? ఆ లెటర్‌లో విషయం ఏమై వుంటుంది? ఆయన లెటర్ సంగతి తనకెందుకు చెప్పలేదు?

**'ఎంకీకి విషం పెట్టి'**

**'మట్టిలో కప్పెట్టి'**

ఏంటి జరుగుతుంది. యీమెకి? ఆమె బ్రెయిన్‌లో ఆలోచనలు మైక్రోవావెన్‌లో కేకు ముక్కల్లా కాలి పోతున్నాయి.

ఇంటిముందు రిక్షా లోంచి సుగుణమ్మ, స్కూటర్ మీంచి బసవరాజు దిగి ఒకరి వెనుక ఒకరు లోపలికి వస్తుంటే పాడయిన బస్సుని లాక్కువస్తున్న బుల్డోజర్‌లా కన్పించింది రాగిణికి. వాళ్ళిద్దరూ యింట్లోకి రాగానే 'నా వొంట్లో బాలేదు' అంటూ రాగిణి లోపలికెళ్ళిపోయింది.

"ఫర్వాలేదు లేమ్మా. యీ పూటకి వంట నేను చేస్తాలే అని "ఓ ఎంకమ్మ తల్లీ, ఒరేయ్ లక్కపిడతా, రండిర్రారండి''

''ఇంద.... తినండి''

అంటూ బాగ్‌లోంచి పెళ్ళివారిచ్చిన మిఠాయిలు తీసి పిల్లలిద్దరికీ యిచ్చింది. ఆ మాట విన్న రాగిణి గబుక్కున వెనక్కి వచ్చి "ఇప్పుడేగా మేగీ మెక్కారు. అవన్నీ మింగితే చస్తారు. రండిటు'' అంటూ వాళ్ళని లోపలికి తీసుకెళ్ళిపోయింది.

సుగుణమ్మ, బసవరాజు నిర్ఘాంతపోయారు.

"నేనంటే బానే వుండేది కదరా, ఇలా పెడసరంగా మాట్లాడుతోందేం? నేను రావడం యిష్టం లేదా?'' అందామె.

''అదేం లేదు నాన్నక్కా, అప్పుడప్పుడు పార్శ్వం నొప్పి వస్తూంటుంది అంతే'' సర్ది చెప్పాడు బసవరాజు. రాగిణి తీరు అతనికేమీ అర్థం కావట్లేదు.

ఆ రాత్రి రాగిణి మజ్జిగ తాగి పడుకుంది. హాల్లో సుగుణమ్మ ఏదో చెప్తూంటే బసవరాజు తలాడిస్తూ వింటున్నాడు. పిల్లలిద్దరూ ఆవిడని విచిత్రంగా చూస్తూ కూచున్నారు. రాగిణికి హాల్లోంచి వాళ్ళిద్దరూ కన్పిస్తున్నారు. వాళ్ళ సంభాషణ కూడా విన్పిస్తోంది.

"వచ్చే నెల్లో జగ్గుకి విమ్ముతో పెళ్ళిరా హైద్రాబాద్‌లో"

"అలాగా" అన్నాడు. బసవరాజు తల వూపుతూ.

"రమ్ముకి పెగ్గు నిద్దామనుకుంటున్నారు"

"ఓహో"

"ఇకపోతే ఎగ్గుకి పెచ్చు పుట్టినప్పట్నించే వుండనే వుంది"

"మరికేం?"

ఆవిడన్న ప్రతిమాటకీ డూడూ బసవన్నలాగా తలెలా వూపుతున్నాడో, సార్థక నామధేయుడు అనుకుంది రాగిణి కోపంగా. కాని అంత కోపంలోనూ ఆమె వాళ్ళ సంభాషణ విని లోపల లోపల నవ్వుకుంటోంది. ఆ పేర్లను డీకోడ్ చెయ్యడానికి ప్రయత్నిస్తోంది.

మొదటి జంట జగ్గరాజు విమల...

రెండో జంట రమేష్ ప్రజ్ఞ....

ఇంక ఎగ్గంటే ఎవరూ....

ఆ.... యజ్ఞనారాయణ...

మరి పెచ్చు.... ప్రత్యూష...

హమ్మయ్య ఆన్సర్లొచ్చేశాయి. ఆలోచనలు డైవర్టు అవడంతో భారంగా అయిపోయిన మనసుకి కాస్త రిలీఫ్ అన్పించిందామెకి.

బసవరాజు లోపలి కొకసారి వచ్చి 'కాస్త తగ్గిందా?' అని అడిగి వెళ్ళిపోయాడు. అతను ఎప్పటిలా మామూలుగానే ప్రవర్తిస్తుంటే అతని గురించి చెడుగా అనుకోలేక పోతోంది. ఏమో, ఏం చెప్పగలం? ఈ రోజుల్లో కన్న తల్లులే పిల్లలకి విషం పెడ్తున్నారు. కట్నానికి ఆశపడి భార్యలని తగల పెడ్తున్నారు. ఆమె ఆలోచిన ఆపి దృష్టి హాల్లోకి పోనిచ్చింది.

సుగుణమ్మ సంభాషణ పెళ్ళిళ్ళ మీంచి మళ్ళీ తీర్థయాత్రలు చేసి నోములూ వ్రతాలూ మీదకు వెళ్ళింది. "మీ అమ్మ నందికేశుడి నోము నోచుకుని ప్రదక్షిణాలు చేస్తూ చేస్తూ కళ్ళు తిరిగి పడిపోయిందిరా. అంతే నువ్వు కడుపున పడ్డావు. ఆ బసవన్న పేరెట్టుకున్నారు.... ఆ నందికేశుడి మహాత్యం అలాంటిది" ఆవలించుకుంటూ అంది సుగుణమ్మ. లోపల్నించి వీళ్ళ మాటలు వింటున్న రాగిణికి ఏదో స్ఫురించింది. ఛ.... పాపం... మంచావిడలానే వుంది. లెటర్‌లో మిగతా వాక్యాల్లో ఏముందో తెల్సుకోకుండా ఒక అభిప్రాయానికి రాకూడదు అనుకుని నిద్రపోయింది.

మర్నాడు పొద్దున్నే ఘుమఘుమలాడే వుప్మా చేసి అందరికీ పెట్టింది సుగుణమ్మ.

"బసవా, నువ్వు కాలేజికి వెళ్తూ బస్సుస్టాండులో నన్ను దింపేయ్‌రా. కోటిపల్లి వెళ్ళొస్తా. నువ్వేమో నా వుత్తరం అందలేదంటున్నావు. ఆ విషయాలన్నీ వచ్చాక మాట్లాడుకుందాం" అంది సుగుణమ్మ.

"ఆ లెటర్ ఈయనకు అందలేదా! అయితే పోస్ట్‌మాన్ చేతి నుంచి డైరెక్ట్‌గా బొమ్మల బుట్టలో కెళ్ళిపోయిందన్న మాట" అనుకుంది రాగిణి.

సుగుణమ్మ చేతి సంచిలో రెంచు చీరలు పెట్టుకుని "అమ్మాయ్, యీ పెట్టె జాగ్రత్త. ముఖ్యమైన దస్తావేజులు, జిరాక్స్ కాపీలు వున్నాయి. పిల్లల చేతికివ్వకు. చాదస్తం అని మీరేమనుకున్నా సరే నాకదో అలవాటు తల్లీ. మా వారి దాయాదుల దావాలతో కోర్టుల చుట్టూ తిరిగి తిరిగి ప్రతికాయితం ముక్కా, వుత్తరం ముక్కా కాపీలు తీయించే అలవాటై పోయింది ఇంద" అని పెట్టె, తాళాల గుత్తి రాగిణికి యిచ్చింది.

"ఒరే బసవా, పోస్ట్‌వాళ్ళ సంగతి నాకు బాగా అనుభవం రా నాయనా. అందుకే నే రాసిన ప్రతి వుత్తరం కాపీ తీయిస్తా. అందులో వుందేమో. తర్వాత తీసి చదువుకోరా" అందామె. సుగుణమ్మ చెప్పేదంతా వూపిరి బిగపట్టుకుని వింటున్న రాగిణి నిలబడలేక పోతోంది. ఆమెను గమనించిన బసవరాజు జ్వరంతో నిలబడలేక పోతోందనుకున్నాడు. "బంగారూ, మాత్రవేసుకుని రెస్టు తీసుకో. ఏం వండకు. మధ్యాహ్నం క్యారియర్ తీసుకు వస్తాలే" అని సుగుణమ్మని తీసుకుని వెళ్ళిపోయాడు.

రాగిణి యింక టెన్షన్ భరించలేక వాళ్ళటు వెళ్ళగానే పెట్టె తెరిచి ఆ లెటర్ కాపీ వుందో లేదో అని వెతికింది. ఎక్కువ శ్రమ పడకుండానే పై పైనే దొరికిన లెటర్ కాపీని గబగబా చదవడం మొదలు పెట్టింది. కొన్ని చిన్న, కొన్ని పెద్ద అక్షరాలతో, కలిపి రాతతో రాసిన ఆ లెటర్‌లో ఆశీర్వాదాలూ, సంబోధనలూ అయ్యాక ఆమెకు కావాల్సిన పేరాలో యిలా వుంది.

**మొన్న ప్రెస్సు మామయ్య వచ్చినప్పుడు జీతం చాలట్లేదు. వుద్యోగం మానేసి వ్యవసాయం చేస్తాననన్నావుట. వ్యవసాయంలోకి దిగితే నీ భవిష్యత్తును మట్టిలో కప్పెట్టినట్టే. ఆ పల్లెటూరెళ్లి దుక్కిదున్ని నువ్వేం పండించగలవు? అది బీడు భూమి. రాగిని బంగారం అనుకుంటున్నావు. మీ పాత యిల్లు, ఆ కాస్త ముక్కా చెట్టూ చేమా కలిపి అమ్మేస్తే ఎంత లేదన్నా ఎక్కీతక్కీ రెండు మూడు లక్షలొస్తాయి. ఆ డబ్బట్టికెళ్ళి చిట్టీ పండులో తగలెట్టకు. శుభ్రంగా ఒక మినీ బస్సు కొనుక్కుని కాలేజీ పిల్లలకి తిప్పి, తిరిగి అమ్మాలనుకున్నా బస్సుకి లక్షపైనే యిస్తారు. లక్కీ సంగతి నాకు వదిలేయ్. వాడిని నేను చదివిస్తాను. నీకేం తక్కువ? నేను లేనా?**

**మా కోర్టు కేసు యింకా తేలలేదు. ముఖ్యమైన కాయితం ఒకటి ఎలక కొరికేసింది. జిరాక్స్ కాపీ వుందిలే. అయినా ఎలక్కివిషం పెట్టి చంపేదాకా నేను నిద్రపోలేదు.**

కలిపి రాతలో ఎలక్కి అనేమాటని ఎంకీకి అని, ఎక్కి తక్కీ అనే మాటను ఎంకీ లక్కీ అని, కన్పిస్తున్నాయి. రాగిణి నవ్వాపుకోలేక పొట్టచేత్తో పట్టుకుని మంచం మీద వాలిపోయింది. అపోహ తొలిగి టెన్షన్ తగ్గడంతో మిగతా లెటర్ చదవాలని కూడా అన్పించలేదు ఆమెకు. ఆర్థాకలితో వున్నవాడికి అన్నం దొరికితే గుప్పెడి నిండా మెతుకులు తీసుకుని ఐదువేళ్ళతో ముద్దచేసి తిన్నంత తృప్తి కలిగిందామెకు.

"డూ డూ డూ డూ బసవన్నా అమ్మగారికి దణ్ణంపెట్టు అయ్యగారికి దణ్ణంపెట్టు" వీధిలోంచి గంగిరెద్దును ఆడించే వాళ్ళపాట విన్పించగానే పిల్లలిద్దరూ పరిగెత్తుకొచ్చి చూస్తున్నారు. రాగిణి లేచి బియ్యం తీసుకొచ్చి బసవన్నకి పెట్టింది. "సారీ, బసవరాజూ! తలాతోకా లేని ఆ వాక్యాలు అర్థం గాక కోపంతో నిన్నూ, మావారినీ, గోవులాంటి పిన్నిగారినీ నిందించాను" అని చెంపలేసుకుంది రాగిణి.

ఆర్.టి.సి. సిబ్బంది సమ్మె కారణంగా బస్సులు నడవట్లేదని వెనక్కి వచ్చేస్తున్న సుగుణమ్మ, బసవరాజులు ఈసారి గంగిగోవు, కోడె దూడల్లాగ కన్పించారు రాగిణికి. తన భర్త బస్సుకొన్నట్టు, వూళ్ళోవాళ్ళంతా 'బస్సాయన' అని పిలుస్తున్నట్టు వూహించుకుని పకాల్న నవ్విన రాగిణిని నిర్ఘాంతపోయి చూస్తుండి పోయారు ఆ యిద్దరూ.






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు
నటుడు
**రావికొండలరావు**
రాసిన వ్యాసమిది



## ఆలోచించని స్వభావం! మానుకున్నారు స్వలాభం!

# మంచి హాస్యాల పద్మనాభం!

**"శాంతాకారం భుజగశయనం**
**పద్మనాభం సురేశం"**

**అంటే "శాంతా నువ్వు చేసిన కూరకారంగా వుందీ, నీ భుజం మీద తలపెట్టి పడుకుంటాను" అని అంటే, పద్మనాభం, సురేశం అన్న ఇద్దరు మిత్రులొచ్చి చూసి, సిగ్గుపడి వెళ్లిపోయారు అని అర్థంట.**

అయితే ఈ పద్మనాభానికి సురేశం అన్నపేరుతో మిత్రుడులేడు గాని, ఇంకో పేరుతో వున్న మిత్రుడితో కలిసి చిన్నతనంలో పెద్దతనం ధరిస్తూ తెగ సినిమాలు చూసేవాడు. ముఖ్యంగా వేమూరు గగ్గయ్య వేసిన సినిమాలు, నాటకాలూ ఇష్టం; అతని పద్యాలిష్టం, పాటలిష్టం. సందు దొరికితే చాలు, మనిషి దొరికితే చాలు- "అయ్యా ఓ పద్యం - గగ్గయ్యది - చదువుతాను, వినండి" అని, అవతలివాడు "ఎందుకు నాయనా నీ పద్యం? గగ్గయ్య పద్యమే వింటున్నానుగా" అన్నా కూడా కంయ్‌మని పెద్దశ్రుతిలో చెవిటివాడి ముందు శంఖం ఊదినట్టు పద్యం ఊదేసేవాడు పద్మనాభం. ఆనాటి పద్యాలు ఈనాటికీ ఆయనకి గుర్తు. ఇప్పుడు తానుగా చదవడుగాని, ఎవరైనా చదవమంటే మాత్రం పెద్దగొంతుతో కంయ్‌మని కాదు, ఖంగుతిని చదువుతారు పద్మనాభం.

మిమిక్రీలు, జోకులూ చెప్పుకుంటూ, ఆ ఉత్సాహాన్ని సినిమాల మీదికి మళ్లించుకుని, తగుమాత్రం నాటకానుభవంతో సినీరంగ ప్రవేశానికి - ముహూర్తం పెట్టుకోకుండానే, రంగ తీరం దగ్గరకొచ్చి నించున్నాడు. 'పరవేశ దవారం' వెతుక్కుంటూ కుర్రాడు, తెల్లగా బొద్దుగా



వున్నాడు. ఆకర్షణీయమైన ముఖం. ఉషారుగా వున్నాడు. గూడవల్లి రామబ్రహ్మం గారి దృష్టిలో పడి ఆ పనీ ఈపనీ చేస్తూ "మాయాలోకం" (1945)లో కాంభోజరాజు కొడుకుల్లో ఒకడిగా (చిన్నప్పుడు) ఓ వేషం సంపాయించాడు. పద్మనాభం పద్యపఠనం, పాటా విని కన్నాంబగారు ఆదరించారు. చిన్నాచితకా వేషాలు వేస్తూ ఎలాగోలా సినిమాల్లో బతికేయాలి - అనుకున్నాడతను. ఎదురుగా చూస్తే ఏ దిక్కూ లేదు, ఎటూ దారీ కనిపించలేదు. ఎక్కడ వుండాలి? ఎలా తినాలి?

చిత్తూరు నాగయ్యగారు 'త్యాగయ్య' తీస్తున్న రోజుల్లో ఓ ఉత్తరంతో ఆయన్ని కలిసి -- ఆయన ఆఫీసులో మకాం పెట్టగలిగాడు. ఆ ఆఫీసుని "రేణుకా వారి సత్రం" అనే వారు. అక్కడ ఎందరో చాపలూ అవీ వేసుకుని మకాం. వంట వాళ్లుండే వారు, ఎవరు వచ్చి ఆకు వేసుకుని కూచున్నా సుష్టుగా వడ్డించేవారుట. అందులో పద్మనాభం ఫస్టు.

సినిమా భాషలో 'ఫ్లాష్‌బాక్' అంటే జరిగిన దాన్ని చెప్పడం. ఇది సినిమా భాష కాక పోయినా, ఫ్లాష్‌ఫ్రంట్. అంటే, కొన్ని సంవత్సరాలు ముందుకు వెళదాం. పద్మనాభం "పొట్టిప్లీడరు" నిర్మిస్తున్నారు. నాగయ్యగారు జడ్జి పాత్ర ధరించారు. సాయంకాలం టిఫిన్ వేళలో పద్మశ్రీ నాగయ్యగారు తనకిచ్చిన ఇడ్లీలని కాకులకు విసురుతూ వుంటే, పద్మనాభం చెప్పారు: "నాన్నగారూ! నేను మీ ఆఫీసులో కొన్నాళ్లున్నాను" అని. విసురుతున్న ఇడ్లీ ముక్కని టక్కున ఆపేసి, "అలాగా నాయనా! అప్పుడు నీకు అక్కడ అసౌకర్యం ఏమీ జరగలేదు గదా. మర్యాదగా చూశారు గదా" అన్నారు. నాగయ్యగారు బాధగా. పద్మనాభం పకపకా, ఇంకా పకపకా నవ్వారు. "అప్పుడు... అప్పుడు... నేనెవణ్ణి నాన్నగారూ.... మీ

ఆఫీసులో ఆశ్రయం పొందుతున్న వాళ్లలో నేనూ ఒకణ్ణి.... నాకు మర్యాదలేమిటి... వేళ పట్టున భోజనం పెట్టారు'' అని మళ్లీనవ్వారు. నాగయ్యగారు నవ్వలేదు. ఇవాళ ఇతడు ఇంత పెద్దనటుడు, నిర్మాతా అవుతాడని ఆయనకేం తెలుసు? అసలా కుర్రాడి సంగతే ఆయనకి గుర్తులేదు.

మళ్లీ 1945-46 ప్రాంతాలకి వెళదాం. పద్మనాభం ప్రయత్నం ఫలించి "రాధిక" సినిమాలో అతనికి కృష్ణుడి పాత్ర దొరికింది. అప్పుడతనికి పేరు చివర 'రావు' వుండేది. 'పాతాళభైరవి' నుంచి 'రావు తోక'ని తెంపేసుకుని - 'కమేడియన్'గా నిలబడి, స్టార్ కూడా అయిపోయాడు! విజయవారి బృందంలో పద్మనాభం నెలజీతపు ఆర్టిస్టు. 'షావుకారు'లో చిన్నవేషం వేశాడు. షావుకారు గారింట్లో పనివాడు. పద్మనాభంలోని ప్రతిభ కనిపెట్టిన కె.వి.రెడ్డిగారు 'పాతాళభైరవి'లో మాంత్రికుడి శిష్యుడి పాత్ర ఇచ్చి, పద్మనాభాన్ని 'పాతాళం' నుంచి పైకి లాగారు - మట్టిలోంచి మాణిక్యాన్ని లాగినట్టు.

"ఇప్పటికీ జనానికి ఆ సినిమా ఎంతగుర్తో. నేను కనిపిస్తే "మోసంగురో'' అని కేకలు వేస్తుంటారు" అని చెబుతారు పద్మనాభం. "నేను హాస్యం చెయ్యలేదు. మిమిక్రీలు చేస్తూ నవ్వించేవాణ్ణి. 'పాతాళ భైరవి'తో హాస్యనటుడినై పోయాను. దాంతో హాస్యం, టైమింగు, డైలాగూ ప్రాక్టీసు చేశాను. రేలంగి, రమణారెడ్డి, సూర్యకాంతాల మధ్య వెయ్యడంతో, వాళ్లని చూసి చాలా నేర్చుకున్నాను" అంటారు కృతజ్ఞతాభావంతో.

పద్మనాభంలోని ఆర్టిస్టు అదో ధోరణి. ముద్దుమాటలు, ముద్దు మాటలతో హాస్యపాత్రలు -- ఎన్నెన్నో. మంచి సంస్థల ప్రోత్సాహం, మంచి దర్శకుల ప్రోత్సాహం. రేఖా అండ్ మురళీ ఆర్ట్స్ అన్నపేరు మీద నాటకాల ప్రదర్శన -- ఇంకో పక్క. అలా అలా ఆ చిన్నవాడైన పొట్టివాడు గట్టివాడయ్యాడు. రేఖా అండ్ మురళీ పేరు మీదనే సినిమా సంస్థ స్థాపించాడు. రామారావు, సావిత్రిలతో 'దేవత' తీశారు 1965లో. పెద్దహిట్టు. ఈ నాటికీ ఏ నాటికీ పాటలు హిట్టు. ఆ పట్టు, పట్టు వరసగా సినిమా నిర్మాణం. షూటింగ్ టైములో "తార"తమ్యం లేకుండా అందరికీ షడ్రసోపేతమైన భోజనాలు పెట్టించేవారు.

"భోజనం విలువ నాకు తెలుసు. అందరూ సుష్టుగా భోం చెయ్యాలి'' అని, అందరినీ పలకరిస్తూ, కొసరి కొసరి వడ్డించేవారు పద్మనాభం. ఐతే నిర్మాతతో అతని తృప్తి ఆగలేదు. దర్శకుడు కూడా అయి, చిత్ర నిర్మాణం చేశారు. 1947 నుంచి 67 అంటే రెండు దశాబ్దాల్లో దర్శకుడుగా బాధ్యత చేపట్టారన్నమాట పద్మనాభం.

ఆయన షూటింగ్ 'జాలీ'గా వుంటుంది. టెన్షన్లు అవీ వుండేవి కాదు. సరదాగా నవ్విస్తూ నవ్వుతూ సాగించేవారు. అందరికీ పారితోషికాలు ఇవ్వడంలోనూ, మర్యాదలు చెయ్యడంలోనూ తిరుగులేదు. ప్రపంచ మహాసభలకి ధనసేకరణ కోసం నటీనటులందరూ పట్టణాలు తిరిగి ప్రదర్శనలు ఇచ్చారు. ఆ నాటికల్ని తాను స్టూడియోలో తిరిగి ఆడించి, "సినిమా వైభవం" పేరిట విడుదల చేశారు పద్మనాభం. పద్మనాభం గారు అడిగారు కదా, అని ముచ్చట పడి వేషాలు వేస్తే, అందరికీ వెండి పళ్లాల్లో పట్టుబట్టలు పెట్టి మర్యాద చేశారా "మర్యాద పద్దన్న" అనిఅంతా చెప్పు కున్నారు.



'జాతకరత్న మిడతంభొట్లు'లో నేను మిడతంభొట్లుకి మామగారిని. ఓ రోజు షూటింగ్‌లో నా చెప్పులు కనిపించలేదు. "ఆ మూల విడిచి పెట్టానే" అని నేను వెతుక్కుంటూ వుంటే- "మీరు షాటుకు రండి. చెప్పులు పోయి వుండొచ్చు. ఇది కూడా ఆలయమే కదా. నేను వెతికితెస్తాను" అని ఆయన అభయం ఇచ్చిన అరగంటలో తెల్లటి అట్టపెట్టెలో కొత్త చెప్పులు సాక్షాత్కరించాయి! "ఈ కొత్త చెప్పులు తొడుక్కుని ఇంటికి వెళ్లండి. పాతవీ దొరుకుతాయి. దొరికితే, కొత్త పెట్టెలో పెట్టి పంపిస్తాను" అని నవ్వారు పద్మనాభం. "మీరు తొందరపడ్డారు. నా చెప్పులు వున్నాయి ఇంకో మూల" అన్నాను. "మరీ మంచిది. పాత కొత్తల మేలు కలయిక. రెండు జతలూ మీవే. అలా అని అందరూ చెప్పులు కనిపించడంలేదనకండేం" అని జోకు పేల్చి తానూ నవ్వి అందర్నీ గొల్లుమనిపించారు - పద్మనాభం.

పద్మనాభం "చరిత్ర" సృష్టించారోసారి. పి.పుల్లయ్యగారికి షష్టిపూర్తి మహోత్సవం జరిగింది - విజయగార్డెన్స్‌లో. జైహింద్ (స్టిల్స్) సత్యం -- అందరికీ తలలో నాలుకలాంటివాడు - ఏర్పాటు చేశారు. అభినందనలు, ఉపన్యాసాలూ అవీ అయిన తర్వాత పి.పుల్లయ్యగారి లాగే తాను వేషం ధరించి, (పొట్టి, లావు అచ్చం అలాగే వున్నారు పద్మనాభం) స్టేజి మీద నటించారు. పుల్లయ్యగారు షూటింగ్ చెయ్యడం, ఆయన చిరాకు, కోపం -- ఇవన్నీ అద్భుతంగా అభినయించి, "నా కంటె బాగా చేశావు" అని పుల్లయ్యగారి చేత అభినందన అందుకున్నారు - పద్మనాభం. ఎంత కారెక్టర్ స్టడీ! ఎదురుగా కూచున్న పుల్లయ్యగారు, శాంతకుమారి గారూ ఎంత నవ్వారో, ప్రముఖులూ ప్రేక్షకులూ అంత వినోదించారు. ఇదొక అపూర్వమైన ఫీటు. అది ఆయనకే సాధ్యమైంది.

పద్మనాభం షూటింగ్‌లో వుంటే కిలకిలలు, గలగలలూ. ఇవాళ ఆయనకి సినిమాలు తగ్గిపోవచ్చు. అడపాదడపా టీవీ నాటకాల్లో వేస్తూ వుండొచ్చు. కాని పద్మనాభం, పద్మనాభమే! "హాస్యకుటుంబం' పేరుతో టీవీ సీరియల్ ప్లాన్ చేస్తున్నాను. నవ్వుల పువ్వులు రువ్వాలి" అని చెప్పారు పద్మనాభం - స్వలాభం ఆలోచించని పద్మనాభం.



**చిత్రం: లక్ష్మీనివాసం** రచన: ఆరుద్ర
**సంగీతం: కె.వి.మహదేవన్** గానం: పిఠాపురం నాగేశ్వరరావు

సోడా సోడా ఆంధ్రసోడా
గోలీసోడా జిల్‌జిల్ సోడా
సోడా తాగు తెలుగోడా చల్లని సోడా
దీని మహిమ చెప్పలేడు దేవుడు కూడా ॥సోడా॥
నెత్తిమీద గంగవున్న ఈశ్వరుడైనా - అహ
నిత్యసుధలు తాగుతున్న దేవతలైనా
ఆంధ్రసోడా కోరికోరి తాగుతారోయ్ - అది
లేకుంటే వడదెబ్బకు వాడుతారోయ్ ॥సోడా॥
నాయకులు చెప్పేది ఉత్తగ్యాసు - వి
నాయకుల చప్పట్లు శుద్ధ గ్యాసు
పోచుకోలు పాలిటిక్సు పరమగ్యాసు
వాటికన్న ఉపయోగం సోడా గ్యాసు ॥సోడా॥
ఒక్కగుక్కతాగి చూడు మండుటెండలో - అహ
హిమాలయం చల్లదనం నీ గొంతుకలో
రాళ్ళుతిని తాగితే జీర్ణమవ్వాలి - ఈ
నీళ్ళు తాగితే సగం కడుపు నిండాలి ॥సోడా॥

**చిత్రం:కృష్ణప్రేమ** రచన: ఆరుద్ర
**సంగీతం: పెండ్యాల** గానం:ఘంటసాల

మోహనరూపా గోపాలా ఊహాతీతము నీ లీల ॥మోహన॥
వలదని నిన్ను వారించువారిని
వదలక వెంట తిరిగెదవయ్యా ॥కృష్ణా॥
వేణువునూదుచు వేడుకచేయగ
వేడినవారికి దరిశనమీయవు ॥మోహన॥
అవని భారము అమితము కాగా
అవతరించితివి ఎన్నిసారులో, కృష్ణా
అన్నిటికన్నా అపురూపమైనది
కన్నులవిందగు ఈనాటి రూపము
మోహనరూపా గోపాలా - ఊహా తీతము నీ లీలా!

**చిత్రం: దాగుడుమూతలు** రచన: ఆరుద్ర
**సంగీతం: కె.వి.మహదేవన్** గానం: పిఠాపురం, స్వర్ణలత

డిప్పి డిప్పి డిప్పిట్టం నువ్వంటేనే నాకిష్టం 2
డీడిక్కంది అదృష్టం గట్టెక్కింది మనకష్టం
బాజాలతో బాకాలతో
పందిట్లో ఇద్దరం ఒకటౌదాం ॥బాజా॥ ॥డిప్పి॥
అందరు చుట్టాలు వస్తారు ఆనందమానందమంటారు 2
అబ్బాయి తొందర చూస్తారు
తాము అటు తిరిగి పకాపకా నవ్వుతారు ॥డిప్పి॥
కవ్వించి సిరులన్ని కలిసొచ్చినా
కాబోవు పెళ్ళామే కడు పచ్చన
కొండకు వేసాను ఒక నిచ్చెన
నీ కొంగు తగిలితే ఒళ్ళు నులివెచ్చన ॥డిప్పి॥
బుక్కా వసంతాలు చల్లుకుందాం
ఎంచక్కా తలంబ్రాలు పోసుకుందాం
దీవించి వేస్తారు అక్షింతలు
ఇక అవుతాయి సౌఖ్యాలు లక్షింతలు ॥దీవిం॥ ॥డిప్పి॥

**చిత్రం: దేవత** రచన: కొసరాజు
**సంగీతం: కోదండపాణి** గానం: పద్మనాభం, ఎల్.ఆర్.ఈశ్వరి

అ: మా పూరు మదరాసు నా పేరు రాందాసు 2
కమ్మని నీ ఫోజు కవ్వించే ఈ రోజు 2
మదనపడి మనసుచెడి వచ్చానే అమ్మాయి
ఆ: మా పూరు బొంబాయి నా పేరు రాధాబాయి 2
ఏమిటి నీగాధ ఏమాత్రం నీహోదా 2
ఆ విషయం ఆ వివరం చెప్పవోయి అబ్బాయి
చ: రోడ్ల మీద కార్లున్నాయ్ బ్యాంకులో డబ్బులున్నాయ్
దేవుడిచ్చిన కాళ్ళున్నాయ్ చూడ్డానికి కళ్ళున్నాయి
మన బింకం మన పొంకం తెలిసిందా అమ్మాయి ॥మా॥
ఆ: క్యాడిలాక్కారుందా న్యూమోడల్ మేడుందా 2
ఇంటిముందు వేసుందా నిదురబోవు ఫ్యానుందా
కాఫీలకు సినిమాలకు కరువేమీ లేదుకదా ॥మా॥
చ: పూరు తిరగ బస్సుంది ప... పాంయ్ ప... పాంయ్
ఉండను ప్లాట్‌ఫారముంది
కడుపునిండా నీరుత్రాగ కార్పొరేషన్ టాపుంది
ఏమున్నా లేకున్నా 2 మిన్నయైనదొకటుంది 2
ఆ: ఏముంది ఏముంది అ: ప్రేమించే హృదయముంది
ఆ: అదే నాకు కావాలి ఇతడె నన్ను ఏలాలి 2
అ: అబ్బాయిని అమ్మాయిని ఇద్దరిని కనాలి
ఇ: హేపీగా తాపీగా 2 బ్రతుకు పరుగు తీయాలి 2 ॥మా॥

**చిత్రం: సంబరాల రాంబాబు** రచన: రాజశ్రీ
**సంగీతం: వి.కుమార్** గానం: పిఠాపురం, సుశీల

ఆ :పొరుగింటి మీనాక్షమ్మను చూసారా
వాళ్ళ ఆయనచేసే ముద్దుముచ్చట విన్నారా మిమ్మల్నే॥పొరు॥
పగలంతా ఇద్దరకు తగవులు ఎన్నున్నా 2
చీకటిపడితే పక్కకుచేరి రాజీకొస్తాడు
కోరిన చీరలు ఇస్తాడు ॥పొరు॥
అ :పొరుగింటి పుల్లయ్య గొడవ ఎందుకులేవే
వాడికి జీతం కంటే గీతం ఎక్కువ
తెలుసుకోవే... ఆండాళూ ॥పొరు॥
తప్పనిసరిగా ప్రతిసినిమాకు వెళతావుముందే
జీతం కాస్త సినిమాకైతే మిగిలేదేముందే
చీరకు మిగిలేదేముందే ॥పొరు॥
అ :పెళ్ళయి మూడు ఏళ్ళు గడిచినా
పొందిందేమిటి ఆండాళ్ళు 2 ॥పెళ్ళయి॥
ఆ: తల్లితండ్రి ప్రేమగుర్తుగా పుట్టెను బుల్లినామాలు 2
ఆ వగలను చూపిస్తారేగాని నగలెపుడైనా పెట్టారా 2
ఓ ముత్యాలబేసరి ఇచ్చి ముక్కుకి అందం తెచ్చారా
నా ముక్కుకి అందం తెచ్చారా
అ: ఉద్యోగం ఒక మెట్టుదాటనీ కోరినదిస్తా నీకు
ఆ: ఇష్టం లేదని చెప్పకూడదా ఎందుకులెండి సొకు ॥పొరు॥
అ: మాటలతోటీ రెచ్చగొట్టకే నన్నూ
ఆ: బెదిరింపులకు లొంగేదాన్ని కానూ
అ: కోపం వస్తే మనిషిని కాను నేనూ
ఆ: ఏం చేస్తారు అ: చెవులు మెలేస్తా
ఆ: ఇంకేం చేస్తారు అ: దుంప తెంచేస్తా
ఆ: ఆ తరువాత అ: తాట వలుస్తా
ఆ: ఆ.... ఆ.... ॥పొరుగింటి ॥

ఆగస్టు 31 పెండ్యాల వర్ధంతి పురస్కరించుకుని.....




సంగీతం, సాహిత్యం, కథ, నటన... ఇలా ప్రతి విభాగంలోనూ అత్యద్భుతమైన ప్రతిభా వ్యుత్పత్తులను చూపిస్తూ 'మంచి చిత్రాలను మాత్రమే తీయాలి' అనే కమిట్‌మెంట్‌తో ఏర్పడ్డ సంస్థల్లో 'అనుపమ' ఒకటి. దర్శకుడుగా తిలక్, పాటల రచయితగా ఆరుద్ర, సంగీత దర్శకుడిగా పెండ్యాల ఈ సంస్థ కీర్తిప్రతిష్టలను నిలబెట్టడంలో మూల స్థంభాలుగా నిలిచారు. శరత్ నవల 'బిందుగారబ్బాయ్' (బిందూర్ ఛేలో) ఆధారంగా 1956లో సంస్థ తీసిన చిత్రమే

# ముద్దుబిడ్డ

ఈ చిత్రంలోని పాటలు ఎన్నేళ్ళ తర్వాత విన్నా ఒకే అనుభూతిని అందిస్తూ ఉత్తమ గీతం యొక్క లక్షణం, లక్ష్యం అదేనని నిరూపిస్తూ ఉంటాయి. ఆ చిత్రంలోని ఆరు పాటలివి.

చిట్టీ పొట్టీ వరాల మూటా
గుమ్మడి పండు గోగు పువ్వు
నీకూ నాకూ ఏ వేళైనా ఎడబాటే లేదమ్మా
ఏమంటావే బొమ్మా ఓ.ఓ.ఓ.
ఎవరూ లేరే నీ సాటి
పోటీ ఎవరే నీతోటి
ఆటా పాటా అల్లన మెల్లన
ఆడుకుందామమ్మా
ఏమంటావే బొమ్మా ఓ.ఓ.ఓ.
కాళ్ళాగజ్జా కంకాళమ్మా
వేగు చుక్కా వెలగా మొగ్గా
నీకూ నాకూ ఏ వేళైనా ఎడబాటే లేదమ్మా
ఏమంటావే బొమ్మా
ముందుగ యిప్పుడు ముస్తాబు
అవుదామయ్యా నా బాబు ॥ముద్దుగ॥
మేఘాలందున తేలీ సోలీ పోవాలమ్మ షికారు
రారూ - బొమ్మగారూ ॥చిట్టీ॥
ఊసులన్నీ నీతోనే ఆశలన్నీ నీమీదే ॥2॥
నీవే దగ్గర లేకపోతే ఏమౌతానోనమ్మా
నేనేమౌతానే బొమ్మా ఓ.ఓ.ఓ. ॥చిట్టీ॥





*This feature is sponsored for 6 issues by*
**Sri MANISHARMA** *(music director)*
in memory of his beloved friend
late THIRUPATHI SWAMY *(director)*

ఈ పాటను పి.సుశీల పాడగా జమున అభినయించింది. పాటచివర్లో పెరుమాళ్ళు, విజయలక్ష్మి కనిపిస్తారు. ఈ పాట మిశ్ర పహాడీ, యమన్ రాగచ్ఛాయలలో స్వరపరచబడింది. 'ముద్దుగ ఇప్పుడు ముస్తాబు' అనే చరణంలో ఎక్కువగా యమన్ రాగచ్ఛాయలు కనిపిస్తాయి. తక్కిన పాటంతా అన్యస్వరాలతో కలిసిన పహాడీ రాగంతో కనిపిస్తుంది. పహాడీ రాగాన్ని ఉపయోగిస్తూ పెండ్యాల 'భాగ్యరేఖ' సినిమాలో చేసిన 'కన్నీటి కడలీ లోనా' పాటను గుర్తు చేసుకుంటూ ఈ 'చిట్టి పొట్టి' పాటను వింటే రెండిటికి గల పోలిక తెలుస్తుంది. ఈ పాటలో గల 'ఓ..ఓ..ఓ..' అంటూ సుశీల తీసిన ఆలాపనను పొడిగించుకుంటూపోతే అది 'చిరంజీవులు' సినిమాలోని 'చికిలింత సొగసు' పాటలోని ఆలాపనలను అందుకునే అవకాశం వుంది. ఈ పోలిక కేవలం యాదృచ్ఛికమే.

పదరా సరదాగా పోదాం పదరా
బావ చిందేసుకుంటూ ॥పదరా॥
ఝల్లు ఝల్లుమని గుండె లదరగా ॥6॥
చల్లని రేతిరి సరసాలాడగ ॥పదరా॥
ఈడూ జోడూ యింపుగ కుదిరే ॥8॥
పాలు తేనె కలసినట్లుగ ॥పదరా॥
నా సోగకన్నులు కాయలు కాచెను ॥2॥
కాచుకొనియున్నాను నీకోసమే ॥నా సోగ॥
దాచిన వలపంతా
దోచుకొనిపోయావు ॥దాచిన॥
కాసుకొని యున్నాను నీ కోసమే ॥దాచిన॥
మొక్కజొన్న చేలలోన
పక్క పక్కన నడుచుకుంటూ
చక్క చక్కని కలలుగంటూ ॥మొక్కజొన్న॥
సుతారంగ చూపులు చూస్తూ ॥4॥
చూపులలోనే సోలీపోదాం ॥పదరా॥



ఈ పాటను జిక్కి పాడగా శాంతారాం నిర్మించిన 'తీన్ బత్తీ -చార్ రాస్తా' హిందీ చిత్రంలో నటించి పేరుతెచ్చుకున్న మీనాక్షి అభినయించింది. ఈ పాటను జగ్గయ్య, జమున, నాగయ్య, లక్ష్మీరాజ్యం మొదలైన వారంతా ఇతర ముఖ్యపాత్రధారులతో సహా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. హీరో హీరోయిన్‌లకు పెళ్ళయిన సందర్భంగా రిసెప్షన్‌లాగా ఏర్పాటు చేసిన ఓ సాంస్కృతిక కార్యక్రమంలో ఈ నృత్యగీతం వస్తుంది. ఇటువంటి సందర్భాల్లో ఓ అవుట్‌డోర్ డ్యూయెట్ లేక ఓ శోభనపు పాటో జొప్పించకుండా ఇంచుమించు చిత్రంలో నటించిన ముఖ్య పాత్రధారులందిరినీ ఒకచోట చేర్చి ఓ నృత్యగీతాన్ని చూపించటం దర్శక నిర్మాత తిలక్ అభిరుచికి, కమిట్‌మెంట్‌కి ఓ పవిత్ర నిదర్శనం. ఈ పాటలో డప్పుల వాద్యాలకు ప్రాధాన్యత ఉంది. రికార్డింగ్ సమయంలో మంటవేసి ఆ మంటల్లో డప్పులను శృతిచేసుకొని రికార్డింగుకి వెళ్ళారు. డప్పులు వాయించటంలో ఆరోజుల్లో పేరెన్నిక గన్న - ఏసుదాసు, అమృతయ్యలను పిలిపించి, వారిచేతనే వాయింపజేసి వారే నటించేట్టుగా చేశారు తిలక్. ఇక పాటలో కొస్తే మధ్యమావతి రాగం ప్రధానరాగంగా మలచుకుంటూ పాటను స్వరపరిచారు పెండ్యాల.

జానపద ధోరణిలో సాగే ఈ పాట ట్యూన్ ఎంతోమంది హృదయాలలో బాగా నాటుకుపోయింది. ఈ మధ్య వచ్చిన "భామరో నన్నే ప్యార్ కరో" (ఘటోత్కచుడు), "పోరి హుషారు గుందిరో హైటేమో ఆరుందిరో" (సీమ సింహం) పాటల్ని ఈ పాటతో సహా సంపాదించి వినగలిస్తే ఆనాటి ఆ పాట ప్రభావం ఇవాల్టికీ తెలుగు సినీ సంగీతంపై ఎంతగా ఉందో తెలుస్తుంది. ఈ పాటలో కొన్ని లైన్లు -ఒక్కొక్కటి ఎనిమిదిసార్లు, ఆరుసార్లు, నాలుగుసార్లు రిపీట్ అయినా సరే బోరు కొట్టకుండా మరింత హుషారుగా ఉండడం ఈ పాట ప్రత్యేకత.

ఇటులేల చేశావయా ఓ దేవదేవ ॥3॥
ఎటుపోయి ఎటు తిరిగి ఏమౌనో మరి ॥ఇటు॥
చూడ ముచ్చట గొలిపే
ఈడూ జోడు కలిపి ॥చూడ॥
వాడి బ్రతుకే కడకు బీడు చేసేవా? ॥ఇటు॥
హాలాహలము మ్రింగ నీలాంటి వాడే తగు ॥హాలా॥
మాలాటి మానవులు ఏలాగు సైచేరు ॥ఇటు॥
నా మొరవిని ఈ స్థితి గని కాపాడు దేవా
మది లోలోన దావాగ్ని రగిలించినావే ॥నా మొర॥
అది వేవేగ కరుణించి ఆర్పేయ లేవా?
దేవదేవా



ఈ పాటను నాగయ్య పాడి అభినయించారు. సన్నివేశ ప్రాధాన్యంగా లక్ష్మీరాజ్యం, జగ్గయ్య, పెరుమాళ్లు కనిపిస్తారు. 1960 నాటికి నాగయ్యకు ప్లేబాక్ వచ్చేసింది. (భక్తరామదాసు ఓ మినహాయింపు) అంతకు కొద్ది సంవత్సరాలు ముందుగా తీసుకుంటే - నాగయ్య పాడిన సోలో గీతాలలో ఓ మంచిగీతమిది. చక్రవాక రాగం ఈ పాటకు ఆధారరాగం. ఆ రాగంలోని మట్లు, పట్లు, జీవస్వరాలు ఇవన్నీ నాగయ్య గొంతులో ఎంతగా జీవం పోసుకున్నాయో తెలుస్తుంది ఈ పాటవింటే...! సినిమాలోని మొత్తం పాటలన్నిటినీ రికార్డు చేసుకుని దాచుకునే అలవాటున్న వాళ్ళ దగ్గర మాత్రమే ఈ పాట దొరికే అవకాశం వుంది.

ఎవరు కన్నారెవరు పెంచారు
నవనీత చోరుని గోపాలబాలుని
ఎవరు కన్నారెవరు పెంచారు
నోము నోచి నెలలు మోసి
నీలమేఘశ్యాము కన్నది దేవకి
లాల పోసి పాలు పట్టె
జోల పాడే కలిమి కలిగె యశోదకి ॥ఎవరు॥
తడవ తడవకు కడుపు శోకము
తాళజాలక పెంచనిచ్చెను దేవకి
తాను కనకయె తల్లి అయ్యెను
తనయుడాయెను దేవుడే యశోదకి ॥ఎవరు॥
ఎవరు కనినా ఎవరు పెంచిన
చివరికతడానందమిచ్చిన దేవరికి
అవనిలో తనపైన ఎన్నో
ఆశలుంచిన వారికి
తననాశ్రయించిన వారికి ॥ఎవరు॥






'ఎవరు కన్నారెవరు పెంచారు' నీలాంబరి రాగంపై ఆధారపడ్డ గీతం. పి.లీల ఆలపించిన ఈ గీతంలో ఆరుద్ర చూపిన భావబలం, భాషా చమత్కారం ఆయన తన గురువుగా భావించే మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి ప్రశంసల్ని ఆశీస్సుల్ని మరోసారి ప్రత్యేకంగా పొందేట్టు చేశాయి. ముఖ్యంగా 'కి' అనే అక్షరాన్ని అంత్యప్రాసకు అనువుగా వాడుకుంటూ లయబద్ధంగా రాసిన ఆరుద్ర ప్రతిభకు అద్దం పడుతుందీ పాట. రెండో చరణంలో 'త' అనే అక్షరంతో ఆదిప్రాసను కూడా జతచేయటం, ఒప్పించటం, మెప్పించటం ఇవన్నీ ఆరుద్రకే చెల్లాయి. ఆఖరు చరణం వింటే ఆరుద్ర నాస్తికుడేంటి అని అనాలనిపిస్తుంది. అలా అనిపించటమే సృజనాత్మకత కలిగిన కవికి సార్థకత. ఒక బిడ్డను ఇద్దరు సాకాల్సి వస్తే దేవకి, యశోద ప్రేమతో పోల్చే ప్రక్రియను ఆ తర్వాత ఎన్నో సినీ గీతాల్లో ఎందరో ఉపయోగించడం జరిగింది.

అంతలోనె తెల్లవారె
అయ్యొ ఏమిసేతునే
కాంతుని మనసెంత నొచ్చెనో
ఇంతీ ఎటు సైతునే ॥అంతలోనే॥
కొంతసేపు ప్రియములాడి
చెంత జేరి చేయి జాపి
దోర వయసు నాసామి
దొంతర విడెమందుకొనే ॥అంతలోనే॥
చెక్కిలిపై కొనగోటితో
ఒక్కసారి కొసర లేదు
ముక్కువతో గోపాలుడు సుంత
పరిహాసమాడు ॥అంతలోనే॥







ఈ పాటను సుశీల పాడగా జ్యోతికృష్ణ అభినయించింది. తొలి తెలుగు సినీనటి సురభి కమలాభాయ్ కూడ సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తుంది. భోగం మేళం ఆనాటి సంప్రదాయాలలో ఒకటి. అదే సంప్రదాయాన్ని ఇవాళ్టి సినిమాలలో చూపించవలసి వస్తే సంగీతం, సాహిత్యం యొక్క వైఖరి ఎలా ఉంటుందో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అటువంటి అవసరం అంటని రోజులు కనుక చక్కని జావళిగా మలిచి ఓ మంచిగీతాన్ని సమర్పించారు - ఆరుద్ర, పెండ్యాల, తిలక్! కమాచ్ రాగం ఆధారంగా స్వరపరచిన ఈ పాటను ఇవాళ గనుక వింటే ఓ సినిమా పాట అని అనుకోరు. ఎప్పటినుంచో వస్తున్న ఓ సంప్రదాయ గీతం అని అనుకుంటారు. ఏదైనా ఓ సాంస్కృతిక కార్యక్రమంలో ప్రదర్శించ దగ్గ - మరుగున పడిపోయిన మాణిక్యమిది.

చూడాలని వుంది
అమ్మా చూడాలని వుంది
నిన్ను చూడాలని వుంది
పొరపాటు పనులిక
చేయబోనని నీతో చెప్పాలి
అమ్మా చూడాలని వుంది
కంటికి నిద్దర రాదే
నే తింటే నోటికి పోదే
చేశాచిన్న తప్పు
నువు వేశావెంతో ఒట్టు
ఒక సారిమాత్రం
నిన్ను చూస్తే చాలులే అమ్మా ॥చూడాలని॥
కాళ్ళు అటే పోయేనే
నాకళ్ళు అటే లాగేనే
చూడక పోతే దిగులు
నిను చూస్తే ఏమౌతావో
చూడడం మరి కూడదంటే
ఏడుపొస్తుందమ్మా ॥చూడాలని॥



'చూడాలని వుంది' పాటను సుశీల పాడగా మాస్టర్ వెంకటేశ్ అభినయించారు. పల్లవిని, చరణాలలోని మొదటి రెండు లైన్లని 'మధ్యమావతి' రాగంలో స్వరపరిచారు. పాటల్లో కవులు తమ మేధో సంపదను చూపించుకునే ప్రయత్నం చేయడం మంచిదే. అవసరం కూడా. అయితే అది పాత్రల స్థాయికి మించినది, దించేది అయితేనే వస్తుంది చిక్కు. ముఖ్యంగా పిల్లల పాటలు రాసేటప్పుడు ఎందుచేతనో ఈ విషయాన్ని పట్టించుకునే ప్రయత్నం అంతగా కనబడదు. కానీ ఆరుద్ర రాసిన ఈ పాట వినగానే చెప్పొచ్చు ఇది పిల్లలు పాడే పాటని. 'బాల భాష'ని శభాషనిపించే విధంగా ఉపయోగించిన ఆరుద్రతో తర్వాత్తర్వాత పిల్లల పాటలెన్నిటినో రాయించడానికి ఈ గీతం ఓ విధంగా పునాది అయిందని చెప్పొచ్చు. ఈ పాటని రికార్డు చేసే సమయంలో పాడడానికి వచ్చిన సుశీల ఒంట్లో బాగులేని కారణంగా మరో రోజు రికార్డింగ్ పెట్టుకోమని కోరడం జరిగిందట. కానీ సంగీత దర్శకుడు పెండ్యాల 'ఏం ఫర్వాలేదు అలాగే పాడు' అని బాగా నచ్చచెప్పి పాడించారట. రికార్డ్ అయిన పాట విన్న సుశీల ఆశ్చర్యపోయారట. 'ఇంతబాగా వస్తుందనుకోలేదు' అంటూ ఎంతో ఆనందించారట.

పైన ఉదహరించిన పాటలే కాక పీలూ రాగంలో పి.లీల పాడిన 'జయ మంగళ గౌరీదేవీ' పాట కూడా ఈ చిత్రంలో ఉంది. ఆ పాట సాహిత్యం ఇదే సంచిక 42 పేజీలో ఉంది కనుక తిరిగి ఉదహరించటం లేదు. తెలుగునాట నేటికీ ఓ సంప్రదాయ గీతంగా ఇళ్ళలో జరుపుకునే పూజల సమయంలో ముత్తయిదువుల చేత పాడబడుతున్న గీతమిది. అటు నేల విడిచి సాము చెయ్యకుండా ఇటు నేలబారుగా ఉండకుండా సామాన్యుడికి సైతం అర్థమయ్యేలా సినీ గీతాల్ని రాయడంలో ఆరుద్ర ముద్రను ఒక పార్శ్వంలో ఆవిష్కరించిన ఈ చిత్రంలోని గీతాలు రసాంబుధినుండి జాలు వారిన జలపాతాలు.




### ☆ నటీనటులు ☆

లక్ష్మీరాజ్యం, జమున, నాగయ్య, జగ్గయ్య, మాష్టర్ వెంకటేశ్, సి.యస్.ఆర్., పేకేటి, రమణారెడ్డి, పెరుమాళ్ళు, కుటుంబరావు, వర్మ, రామలింగయ్య, మోహనదాసు, బొడ్డపాటి, రాజు, దుర్గారావు, టైగర్ జోగారావు, అమృతయ్య, ఏసుదాసు, ఓగిరాల, సూర్యకాంతం, విజయలక్ష్మి, ఉదయం, ఇ.వి.సరోజ, మీనాక్షి (తీన్‌బత్తి - చార్ రాస్తా), జ్యోతి కృష్ణ వగైరా నటించిరి.

### ☆ ప్లేబాక్ గాయకులు ☆

పి.లీల, పి.జి.కృష్ణవేణి (జిక్కి), పి. సుశీల,
పి.నాగేశ్వరరావు, వైదేహి.

....హెచ్.యం.వి. కొలంబియా రికార్డులలో వినండి.

### ☆ నిర్వాహకులు ☆

| | |
|---|---|
| రచన | : తాపీ, ఆరుద్ర |
| పాటలు | : ఆరుద్ర |
| ఫొటోగ్రఫీ | : లక్ష్మణ్ గోరె |
| సౌండ్ | : జె. సూర్యనారాయణ |
| సాంగ్సు, రీ- రికార్డింగ్ | : పి.వి. కోటేశ్వరరావు |
| సంగీతం | : పెండ్యాల |
| ఆర్టు | : వి. సూరన్న బి.ఎ., |
| సెట్టింగ్సు | : వి. చెంగయ్య |
| నృత్యం | : వేణుగోపాలస్వామి |
| మేకప్ | : హరిబాబు, నాగేశ్వరరావు, నరసింహులు |
| స్టిల్సు | : కె. వెంకటేశ్వరరావు |
| ఎడిటింగ్ | : ఎమ్.వి. రాజన్, వెంకటేశ్వరరావు |
| ప్రాసెసింగ్ | : ఎ. త్యాగరాజన్ |
| సహాయ దర్శకులు | : బి. సత్యం, మూనార్, కె. బాపయ్య |
| ప్రొడక్షన్ | : బి.వి. కృష్ణమూర్తి, కె. కృష్ణ, కనకరాజు |
| స్టూడియో | : వీనస్ |
| ఆర్కెష్ట్రా | : ప్రసాదరావు పార్టీ |

### చిత్రం: 'పెళ్ళిసందడి'

రచన: సముద్రాల రామానుజాచార్య    సంగీతం: ఘంటసాల

రావే ప్రేమలతా, నీవే నా కవితా!
కిన్నెర మీటుల కిలకిలవే పలు
వన్నెల మెరుపుల మిలమిలవే
ఓహో కవిరాజా నేడే నెలరాజా
ఎందులకోయీ పరవశమూ నీ
కెందులకోయీ కలవరమూ
పూవులలో నును తీవెలలో ఏ
తావున నీవే వనరాణీ
అందవతీ కనునించినచో కవులందరి చందమిదేలే ॥రావే॥
పరువులిడే సెలయేరు వలే
నినుచేరగ కోరును నా మనసూ
ఊహలతో ఉలికించకుమా
నవమోహన ఈ చెలి మదినీ
రావే ప్రేమలతా, నీవే నా కవితా!
ముచ్చటగా మనముండినచో మన మచ్చికకూ జగమేమనునో
లోకముతో మనకేమిపనీ మనసేకమయీ మనముంటే
రావే ప్రేమలతా

### చిత్రం: 'రాధిక'

రచన: సదాశివబ్రహ్మం    సంగీతం: సాలూరి హనుమంతరావు

గోపాలకృష్ణుడు నల్లన
గోకులములో పాలు తెల్లన
కాళిందిలో నీళ్ళు చల్లన
పాటపాడెద నీ గుండె ఝల్లున ॥గోపాల॥
మాచిన్ని క్రిష్ణయ్య లీలలు
మంజులమగు మురళి ఈలలు
మా కీరశారికల గోలలు
మాకు ఆనంద వారాశి ఓలలు ॥గోపాల॥
మాముద్దు కృష్ణుని మాటలు
మరువరాని తేనెతేటలు
మా పూర్వ పుణ్యాల మూటలు
మమ్ముదరిజేర్చు తిన్నని బాటలు ॥గోపాల॥

నల్లని వాడా నేగొల్ల కన్నెనోయ్
పిల్లన గ్రోవూదుమూ....
నా యుల్లము రంజిల్లగా ॥నల్లని॥
నీ తీయని పాటలకై
రేతిరి ఒంటరిగ వచ్చితినే
నా మనసూ, తనువూ
నా మనిషే నీది కదా... ॥పిల్లన॥
ఆకసాన మబ్బులనీ
చీకటులే మూగెననీ
నేనెరుంగనైతిని నీ తలపే వెలుంగాయే ॥పిల్లన॥
మెరుపే నీ దూతికయై వలపే నా నెచ్చెలియై
తోడితెచ్చె నీ దరికీనాడు పండె నా నోములూ ॥పిల్లన॥

### చిత్రం: దేవదాసు

రచన: సముద్రాల రాఘవాచార్య    సంగీతం: సి.ఆర్.సుబ్బరామన్

తానేమారెనా గుణమ్మే మారెనా
దారీ తెన్ను లేనేలేక ఈ తీరాయెనా
తొలి చూపునాటి రూపుమారే
ధోరణి మారే నిలువెల్లా మెల్లవాయె
నిట్టూర్పే తుదాయే ఏదీలేని పేదైపోయి ఈ తీరాయెనా
వలపుతీరు ఈ తీరవునా ॥తానే॥
మా చెలిమి కలలో పెన్నిధానమా
పెనుచీకటయిన జీవితాన వెల్గినజ్యోతీ
మధుపాయై మాసిపోనా
అంతమ్మే పథమ్మా
ఏరీకోరు ఉల్లాసాలు ఈతీరాయెనా ॥తానే॥
నా సేవలకు ఇంతేవరమా
నాకిదే కడసారి దర్శనమా
అడియాస పాలు చేసినారు కోరినవారు
మనసైన చేరలేని ఈదాసి ఇటాయే
గాలిమేడ కూలిపోయి ఈ తీరాయెనా ॥తానే॥

### చిత్రం: 'మంచి మనసుకు మంచి రోజులు'

రచన: సముద్రాల జూనియర్    సంగీతం: ఘంటసాల

ధరణికి గిరి భారమా
గిరికి తరువు భారమా
తరువుకు కాయ భారమా
కనిపెంచే తల్లికి పిల్ల భారమా
మును నే నోచిన నా నోము పండగా
నా వొడిలో వెలిగే నా చిన్ని నాయన
పూయని తీవెననే అపవాదు రానీక
తల్లిననే దీవెనతో తనియించి నావయ్య ॥తరువుకు॥
ఆపదవేళల అమ్మ మనసు చెదరునా
పాపల రోదనకే ఆ తల్లి విసుగునా
పిల్లల కనగానే తీరేనా స్త్రీ విధి
ప్రేమతో పాపలను పెంచని దొకతల్లియా ॥తరువుకు॥

రచన: సాలూరి సన్యాసిరాజు    సంగీతం: ఎస్.రాజేశ్వరరావు

తుమ్మెదా! తుమ్మెదా ఒకసారి
మోమెత్తి చూడమని చెప్పవే నా మాట రాచిలుక తోడ
రమ్మనవే తుమ్మెదా గండుకోకిల నిపుడు
పాడుటకు మా ఇంటి పడక గదికీ ॥పాడుటకు॥
ఏలనే తుమ్మెదా పొదలు మాకిపుడెల్ల గదులుగా మారెను
ఇందు రమ్మననే....
మగవారి వలపులూ ఎరుగవే తుమ్మెదా ॥మగవారి॥
మగువ దొరికిన దాక వలపు చూపెదరూ ॥మగువ॥
మదన తాపమూ అధికమాయెనూ
మాటలేల ఇక రమ్మనవే
మారుడు నన్నూ మాటాలాడుమని
మందలించుచున్నాడు కదే
ఇకపోవే, తుమ్మెదా! మరిపోవే, తుమ్మెదా!
మా జోలి నీకు ఇకనేల, తుమ్మెదా!

విక్షిప్త చిత్రం

హాసం



టి.జి.కమలాదేవి, పి.సుశీల, కె.రాణి, పి.లీల, జిక్కి, ఎ.పి.కోమల
ఎ.ఎమ్.రాజా, జె.వి.రాఘవులు, ఘంటసాల, మాధవపెద్ది సత్యం, తిరుచ్చి లోకనాథన్, టి.ఎమ్.సౌందర్ రాజన్, పిఠాపురం, కృష్ణన్

